# కలలు-వాటి ఫలితాలు

రచయిత :

సాయిశ్రీ






శ్రీ అరుణా బుక్ హౌస్

1/48, నారాయణ మొదలి వీధి,
మద్రాస్-1.

# ముఖ్య గమనిక

మీ కలలకు ఫలితాన్ని నిర్ణయించుకునే ముందు, ఈ గ్రంథ పీఠికను క్షుణ్ణంగా చదివి అర్థం చేసుకోవాలి. అంతేకాకుండా ఫలితాన్ని చూసుకునేటప్పుడు రచయిత సూచించిన పద్ధతినే అనుసరించాలి. సరైన ఫలితాన్ని పొందాలంటే సరైన మార్గం ఇదే.

పోతే, మీ కల మీకే సరిగ్గా జ్ఞాపకం వుండక పోవచ్చు. కొంత భాగాన్ని మరచిపోవటమో లేక కలలో కొంత భాగం స్పష్టంగా ఉండకపోవటమో జరుగవచ్చు. అలాంటి పరిస్థితిలో మొత్తం కలలో మిమ్మల్ని ప్రధానంగా ఆకర్షించిన వస్తువునో, విషయాన్నో, సంఘటననో మాత్రమే గుర్తుంచుకొని దానికి మాత్రమే ఫలితాన్ని ఈ 'కలల నిఘంటువు'లో చూసుకోవాలి.

# మనవి

తెనుగు పాఠక లోకానికి మేమందజేస్తున్న ఈ గ్రంథం సరిగ్గా మూడేళ్ళ క్రిందట మాకొక కల మాత్రమే! ఆ కల నిజం కావటానికి మా సంకల్పం సిద్ధించటానికి ఈ మూడేళ్లు నిరంతరం శ్రమించాం. విశేష వ్యయ ప్రయాసలను భరించాం. కనుకనే మా కల ఫలించిందని సంబర పడుతున్నాం. కలలకు సంబంధించిన ఈ సమగ్ర గ్రంథాన్ని ఆంధ్ర పాఠక ప్రపంచానికి సముచితంగా సమర్పించ గలుగుతున్నాం.

విభిన్న మనస్తత్వాలు, విభిన్న మనోదారుడ్యాలూ గల మానవులందరికీ వచ్చే కలలన్నిటికీ ఫలితాల్ని వివరించ గలిగిన సంపూర్ణ స్వప్న ఫలితాల గ్రంథాన్ని వెలువరించగలగట మనేది ప్రపంచంలో ఎవరికీ సాధ్యపడని విషయం.

పై విధంగా కాకపోయినా ఎక్కువ మందికి వచ్చే సర్వ సామాన్య స్వప్నాల్ని సాధ్యమైనంతగా సేకరించి సాధ్యమైనంతలోనే సమగ్రంగా, చక్కగా, తెలుగులో–కలల ఫలితాల్ని గురించిన ఒక గ్రంథాన్ని ఎందుకు ప్రచురించకూడదు? – అన్న భావన కలిగింది. ఆ భావన కార్యరూపం దాల్చి ఈ గ్రంథంగా వెలువడుతోంది.

దీన్ని ఇంత పొందికగా వెలువరించటానికి మాకు సహకరించిన శ్రీ సాయిశ్రీ గారికీ, అనేక గ్రంథాల్ని పరిశీలించి తగువిధంగా సుదీర్ఘ పీఠికను వ్రాసి యిచ్చిన శ్రీ ముంగర కోటేశ్వరరావు గారికీ, చక్కగా

ముద్రించి యిచ్చిన వెల్డన్ ప్రెస్ అధినేతలకి మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

ఈ బృహత్తర పథకంలో మాకు పరోక్షంగా సహకరించిన మిత్రులకీ, పెద్దలకీ మా ధన్యవాదాలు సమర్పించుకుంటున్నాం.

తెలుగు పాఠకలోకం గతంలో మా ప్రచురణలను సమాదరించినట్లే దీన్ని సమాదరించి ప్రోత్సహించగలదనీ, మా కృషిని జయప్రదం చేయగలదనీ విశ్వసిస్తూ సెలవు తీసుకుంటున్నాం.

15–12–1977
మద్రాసు-1

ధన్యవాదాలతో,
ప్రకాశకులు.

# మీ కలలకు ఫలితాల్ని చూసుకునే దెలా

పాఠకులకు కొన్ని ముఖ్య సూచనలు:

లోకంలో అనేక రకాల మనస్తత్వాలు కలిగిన వారున్నారు. అలాగే అనేకానేక సమస్యలతో సతమతమయ్యేవారూ ఉన్నారు. అందువల్లనే ఆయా సందర్భాలలో వారికి వచ్చే కలలు వారివారి అప్పటి పరిస్థితులకు అనుగుణమైన ఫలితాల్ని తెలుపుతాయి. ఈ కారణంగానే ఒకరు కన్న కలకు వేరొకరు ఫలితాన్ని నిర్ణయించి చెప్పేదానికంటే ఎవరికి వారే ఫలితాన్ని నిర్ణయించుకోవటం అన్ని విధాల ఉత్తమం.

సాధారణంగా కలలు వారి వారి దైనందిన జీవిత సమస్యల నాధారం జేసుకునే వస్తాయి. అంతేకాదు ఆ సమస్యలకు పరిష్కార మార్గాలు కూడా కలల రూపంలోనే సాక్షాత్కరిస్తాయి. ఎటు తిరిగీ ఆ కలను ఆ సమస్యకు అన్వయించుకుని భవిష్యత్తును తీర్చి దిద్దుకోవటంలోనే జాగ్రత, సమర్థత అవసరం.

మీ కలకు ఫలితాన్ని నిర్ణయించుకునే ముందు, మిమ్మల్ని వేధిస్తున్న సమస్యను మీ కలతో చక్కగా అన్వయం చేసుకోవాలి. మొదట్లో ఈ అన్వయం కష్టంగా

వున్నా క్రమక్రమంగా అలవడి ఈ అన్వయంలో మీరూ నిపుణులౌతారు.

ఉదాహరణకు మీరు పట్టపరీక్ష వ్రాసి ఫలితం కోసం ఎదురు చూస్తున్నారనుకోండి - తప్పినట్లో, పాసయినట్లో మీకు కల వచ్చిందనుకోండి - ఆ కలకు ఫలితం ఉండదు. కేవలం మీరు ఆ జిజ్ఞాసలో వుండటంవల్ల ఆ సంగతి మీకు కలలో కన్పించింది. ఇలాగే సైకిల్ కొనాలని అదేపనిగా ఆలోచిస్తున్నప్పుడు సైకిల్ కొన్నట్లు, ఊటీ వెళ్ళి విశ్రాంతి తీసుకుని రావాలనుకున్నప్పుడు ఊటీ వెళ్ళినట్లు, ఓ అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకోవాలనుకున్నప్పుడు అదే విధంగా కలలు రావచ్చు. వీటికి ఫలితాలు వుండవు. కాని ఇదే సమయంలో మీకు శుభ సూచకమైన కల మరేదన్నా వస్తే దాన్ని మీకు విజయసూచకంగా భావించాలి.

ఈ గ్రంథాన్ని మీరు మీ పడక గదిలోనే ఉంచుకోవాలి - మీ తలగడ క్రిందనే ఉంచుకుంటే ఇంకా మంచిది. ఎందుకంటే మీరు కన్నకల మీకే, కాలం గడిస్తే గుర్తుండకపోవచ్చు. మరచిపోయిన కలకు ఫలితం నిర్ణయించటం కష్టం. పైగా మీకు మీకల ఫలితాన్ని వెంటనే చూసుకోవాలన్న ఆతృతావుంటుంది. కనుకనే ఈ గ్రంథం మీ తలగడ క్రిందనే సిద్ధంగా ఉన్నట్లయితే మెలకువ వచ్చీరాగానే అప్పటికప్పుడే ఈ నిఘంటువును పరిశీలించి ఫలితాన్ని మీరే నిర్ణయించుకోవచ్చు.

పోతే మరొక్క సంగతి!

గ్రంథాలయాల్లోను, మీ పుస్తకాల గదిలోను తెలుగు నిఘంటువుల్ని, ఇంగ్లీషు డిక్షనరీలను ఉంచటం మీకు తెలిసిన సంగతే! మీలో ఎవరూ వాటిని నవలగానో, కథా పుస్తకంగానో భావించి ఈ చివరినుండి ఆ చివరివరకు ఏకబిగిని చదవరు. అలా చదివినా వ్యర్థంగానూ, బోర్ గానూ అన్పిస్తుంది. ఎప్పుడైనా ఏ పదానికైనా అర్థం తెలియనప్పుడు నిఘంటువును తెరచి ఆ పదానికి మాత్రమే అర్థాన్ని గ్రహించి తిరిగి మూసిపెట్టేస్తాం.

వార పత్రికల్లో వార ఫలాల్ని, దిన పత్రికల్లో దిన ఫలాల్ని, తారాబలం చంద్ర బలాల్ని మీరు చూస్తూనే వుంటారు. అవన్నీ వరుసపెట్టి చదవరు. మీ నక్షత్రాన్ని బట్టి, మీ రాశిని బట్టి మీ ఫలాల్ని మాత్రమే చదువుకుని ఆనందిస్తారు. అలా కాకుండా అన్నీ వరుసగా చదివేశారనుకోండి. అవన్నీ ఒకే రకంగా వున్నట్లు కన్పిస్తాయి. అర్థం పర్థం లేని వాటిగా కూడా అన్పిస్తాయి. కాని అవన్నీ నిజమైనవే! దారి తప్పటం వల్ల అపార్థం ఏర్పడింది అంతే! మీరు సరైన విధానాన్ని అవలంబించి వుంటే ఈ ఇబ్బంది వుండేది కాదు. ఈ కలల నిఘంటువు విషయంలోనూ మీరు అనుసరించాల్సిన విధానం అదే.

దీనిలో వున్న కలల ఫలితాల నన్నిటినీ ఏకబిగిని చదవకూడదు. మీరు కాంచిన కలకు మాత్రం విషయ సూచిక సహకారంతో ఫలితాన్ని తెలుసుకోండి, సంతృప్తి పడండి.

మీ కలల్ని మీ జీవన స్థితి గతులకు సక్రమంగా అన్వయించుకుని, ఆ సమన్వయంతో మీ భవిష్యత్తును శోభస్కరంగా తీర్చిదిద్దుకోండి. ఒకొక్క కలకు మీ నిర్ణాయక శక్తి పెరిగి పెరిగి పటిష్టంగాను, స్పష్టంగాను, నిర్దుష్టంగాను ఏర్పడగలదని గ్రహించండి. మీ యీ స్వప్న ఫల నిర్ణాయక శక్తితో మీ భవిష్యత్తును మీరు ముందే తెలుసుకుని తదనుగుణంగా సుఖమయ జీవితాన్ని సాగించండి.

# పీఠిక

కలల పుట్టుక :

మానవజాతికి ఎంత చరిత్ర వుందో ఆ మానవులు కన్న కలలకూ అంత చరిత్ర ఉన్నదనటంలో సందేహం లేదు. ఆది మానవుడు కలలు కన్నాడు - నేటి మానవుడు కలలు కంటున్నాడు - రేపటి మానవుడూ తప్పక కలలు కంటాడు.

అసలు వేటిని మనం కలలుగా భావించాలి? వాటికి గల సరి యైన ఫలితాలు ఏమిటి? అన్న రెండు ప్రశ్నలు అనాదినుండి విడీ విడని చిక్కులుగా, మిస్టరీలుగా వున్నాయని చెబుతూ, రాబర్ట్ ఆండ్రూ తన 'లకీ డ్రీమ్స్' అన్న గ్రంథంలో శతాబ్దాలుగా కలల్ని గురించి పరిశోధనలు జరుగుతున్నాయనీ, లక్షలాది ప్రజానీకానికి వచ్చిన కోట్లాది కలల్ని నిశితంగా పరిశీలించి ఫలితాల్ని శాస్త్రజ్ఞులు సమీకరించారనీ, అవి కేవలం ఊహలుగా గాక హేతువాదానికి నిలువ గలుగుతున్నాయనీ వెల్లడిచేశారు.

యుగయుగాలుగా నాటినుండి నేటివరకు ఎందరో మేధావులు, మానసిక శాస్త్రవేత్తలు కలలకు ఫలితాల్ని చెబుతూనే వున్నారు. ప్రపంచంలోని అన్ని దేశాల్లోను అన్ని జాతుల్లోను ఈ స్వప్నాలకు ఫలితాలు చెప్పుకోవటం అనేది అనాదిగా జరుగుతూనే వుంది.

మన పురాణాల్లోను, గ్రీకుల పురాణాల్లోను, బైబిల్ గ్రంథం లోను, ఇంకా కొన్ని దేశాల ప్రాచీన గ్రంథాల్లోను స్వప్నాల ప్రస్తావన ఉండటాన్నిబట్టి వాటి ప్రాధాన్యతను మనం అర్థం చేసుకోవచ్చు.

## కలల వ్యాప్తి – మొదటి కలల గ్రంథం :

జాన్ గూటెన్ బర్గ్ అచ్చు యంత్రాన్ని కనిపెట్టక ముందు ఈ కలలు—వీటి ఫలితాలు ఒకరి నుండి మరొకరికి జ్ఞాపకాలుగా ఆనోట, ఆనోట మాత్రమే వ్యాపించాయి.

ఆర్టిమిడోరాస్ అనే గ్రీకు రచయిత రెండవ శతాబ్దంలో కలల్ని గురించి ఒక గ్రంథాన్ని ప్రకటించాడు. దీన్నే కలల్ని గురించిన మొదటి గ్రంథంగా పేర్కొనవచ్చు. అంతకు ముందు తాటియాకుల గ్రంథాలుగా ఏవైనావున్నా అచ్చులో గ్రంథంగా వెలువడింది ఇదే!

ఈ కలల సంగతులు గ్రీకు దేశాన్నుండి అరబ్ దేశాలకు, వారి నుండి యూరప్ రాజ్యాలకు అటునుండి మిగతా ప్రపంచానికి వ్యాపించాయి. తొమ్మిదవ శతాబ్దంలో కాలిఫ్ సుల్తానుకు ఆస్థాన పండితుడుగా ఉన్న 'సిరిం' ప్రత్యేకంగా సుల్తానుగారి స్వప్నాలకు ఫలితాలు చెబుతూ ఉండేవాడట.

స్వప్నాలకుగల ఈ ప్రాధాన్యతను బట్టే పురాణాల్లో వీటికి వివిధ రకాలైన వివరణలు ఈయబడ్డాయి.

## కలలు — అందలి రకాలు

మన పూర్వీకులు కలల్ని ఈ క్రింది విధంగా విభజించారు.

"దృష్టశ్శ్రుతోఽను భూతశ్చ ప్రార్థితః కల్పితస్తథా,
భావికో దోషజ శ్చైవ స్వప్న స్సప్త విధోమతః"

1. దృష్టం : పగలు చూసిన వాటినే రాత్రికి కలగనటం.
   ఉదా : మనం వీధిలో ఒక గంగిరెద్దును చూసి దాని ఆకర్షణకు లొంగిపోయా మనుకోండి. అది రాత్రికి మనకు కలలో కన్పిస్తే దాన్ని దృష్టస్వప్నంగా భావించాలి.

2. శ్రుతం : పగలు విన్న మాటనే రాత్రికి విన్నట్లు కలగనటం –

ఉదా : మనం ఏ హోటల్లోనో కాఫీ త్రాగుతూ ఓ మంచి సినిమాపాట విన్నామనుకోండి – దాన్ని రాత్రికి తిరిగి కలలో విన్నట్లైతే దాన్ని శ్రుతస్వప్నంగా తీర్మానించు కోవాలి.

3. అనుభూతం: మనం మామూలుగా అనుభవించిన దాన్నే కలలో తిరిగి అనుభవించటం.

ఉదా : మనకు కంట్లో నలుసుపడి విపరీతంగా బాధ పడ్డామను కోండి - తిరిగి అదే బాధను కలలోకూడా అనుభవిస్తే ఆ కలను అనుభూత స్వప్నంగా భావించాలి.

4. ప్రార్థితం : నిత్య జీవితంలో మనం కోరుకున్నదాన్ని కలగనటం–

ఉదా : మనం బందరు లడ్డును తినాలనుకున్నా మనుకోండి – ఆ కోరిక బలీయంగా తయారై రాత్రికి కలలో ఆ లడ్డును తిన్నట్లైతే దాన్ని ప్రార్థిత స్వప్నం అనుకోవాలి.

5. కల్పితం : మనం సృష్టించిన దానినో లేక ఊహించి కల్పించు కున్న దానినో కలగనటం.

ఉదా : రోజంతా శ్రమపడి మనం ఒక ట్రాన్సిస్టర్‌ను తయారు చేశామనుకోండి – దాన్నంతా అదే విధంగా తిరిగి కల గంటే ఆకల కల్పిత స్వప్నమవుతుంది.

6. భావికం : మన మెన్నడూ ఎరగనిది, ఊహించనిది కలలో కనబడటం –

ఉదా : మనం ఎన్నడూ చూడని వ్యక్తో, ప్రదేశమో, దృశ్యమో లేదా ఊహకే అందని విపరీతమో కలలో కన్పిస్తే దాన్ని భావిక స్వప్నంగా భావించాలి.

7. దోషజం : వాత పిత్త శ్లేష్మాదుల ప్రకోపంవల్ల అర్థంలేని కలలు కనటం –

ఉదా: శరీరారోగ్యం సరిగాలేక దోషాలవల్ల కలత నిద్రలో అర్థం పర్థం లేని కలలు కంటే వాటిని దోషజ స్వప్నాలుగా భావించాలి.

కలలు కనే కాలం :

మానవుని జీవితంలోని నాలుగు రకాల అవస్థల్ని పేర్కొంటూ మన పూర్వీకులు కలలు కనే కాలాన్ని ఈ విధంగా వివరించారు.

1. జాగ్రదావస్థ :
మనం మెలకువగా ఉండే సమయం

2. స్వప్నావస్థ :
కేవలం కలలుకనే కాలం. ఈ సమయంలో కనేవి పగటికలలు.

3. నిద్రావస్థ :
నిద్రపోయే సమయం. ఈ సమయంలో కనే కలల్నే అసలైన సిసలైన కలలు అనవచ్చు.

4. సుషుప్తావస్థ :
గాఢనిద్ర చెందే సమయం. ఈ సమయాన్నే కొందరు మరణావస్థగా చెప్పటం పరిపాటి. ప్రఖ్యాత తమిళ మహర్షి, మేధావి, మహాకవి శ్రీ తిరువళ్లువర్ మరణించిన వారు, వేరే శరీరంలో తిరిగి లేస్తారనీ, సుషుప్తావస్థలో ఉన్నవారు అదే దేహంతో లేస్తారనీ ఇద్దరికీ వ్యత్యాసం అంతేననీ తెలిపారు. అంటే సుషుప్తావస్థలో ఉన్న మానవులు చచ్చిన వారివలె ఏ మనో వ్యాపారమూ ఆచరించని స్థితిలో వుంటారని సెలవిచ్చారు.

కనుకనే "ఏ సమయంలో గాఢ నిద్ర పట్టక మనోవ్యాపారములవలన కలలు కలుగునో, ఏ సమయమున విషయేంద్రియములు తమ తమ పనులు చాలించియుండ మనసుకు మాత్రము పని యుండునో ఆ సమయముననే - మానవులు రకరకముల కలలు కనుట కద్దు." అని తెల్పారు.

మనోరథానాం పూర్ణత్వాత్ దోషై రతిబలై స్త్రిభిః
స్రోతసాం దారుణాన్స్వప్నాన్కాలే పశ్యత్య దారుణాన్

"మనస్సు సంచరించుటకు యోగ్యములగు నాడులయందు వాత పిత్త శ్లేష్మములు విషమముగ సంచరించుటవలనఁ గలిగిన దోషములచే శుభా శుభములగు స్వప్నములు గలుగును." అని పురాణకాల పండితులు తమ అభిప్రాయం వెల్లడించారు. ఆధునాతన మానసిక శాస్త్రవేత్తలుకూడా కలలు కలిగే సమయాన్ని గురించి వివరణలు ఇచ్చారు.

పాశ్చాత్య శాస్త్రవేత్తల అభిప్రాయాలు

స్విట్జర్లాండు దేశస్థుడు, ప్రముఖ మానసిక శాస్త్రవేత్త పి. రియల్ కలకు ఇలా నిర్వచనం ప్రకటించారు :

"A Dream is an unconscious psychological phenomenon occuring during paradoxical slumber."

అయితే మానసిక శాస్త్రవేత్తలలోనే అగ్రగణ్యులుగా కీర్తిగాంచిన సిగ్మండ్ ఫ్రాయిడ్‌ను స్వప్నలోకానికి సామ్రాట్టుగా చెప్పుకోవాలి.

వీరికి ముందు ఎందరో శాస్త్రవేత్తలు ఎన్నో రకాలైన తమ సిద్ధాంతాలను ప్రచారం చేసినా ఫ్రాయిడ్ మహాశయులు పిల్లల మనస్తత్వ చిత్రీకరణలోను, పెద్దల మనస్సుల వ్యక్తీకరణలోను, శృంగార ప్రణయ ప్రపంచాల్లోను, స్వప్నలోకంలోను తన సిద్ధాంతాల హేతు

అలాగే నిద్రలో నవ్వేవాళ్ళను, ఏడ్చేవాళ్ళను మనం చూస్తూనే వున్నాం. ఇందులో పరాకాష్ఠత ఏమంటే నిద్రపోయే వ్యక్తి లేచి అదే స్థితిలో నడుచుకుంటూ పోవటం. దీన్నే 'స్లీప్ వాకింగ్' అంటారు ఆంగ్లంలో.

కలల ప్రభావంతో ఏర్పడేవే కలవరింతలు. కలగంటున్న వ్యక్తి ఆ దృశ్యంలోని సంభాషణల్ని అదే విధంగా చెప్పుకుంటూ పోతాడు. ఒక్కో వ్యక్తి పగలు మాట్లాడిన మాటల్ని తిరిగి రాత్రికి నిద్రపోతూ అదే విధంగా గొణుక్కుంటూ వుంటాడు. వీటిని కలవరింత అని అంటారు.

## కల ఎంతసేపు వుంటుంది?

దీన్ని ఇదమిద్ధంగా తేల్చి చెప్పటం కష్టం. క్షణాల్లో ముగిసి పోయే కలలూ వున్నాయి. రోజూ సీరియల్‌గా ముగింపులేకుండా వచ్చే కలలూ వున్నాయి. అయితే ఏ కల ఎంతసేపు పట్టింది అన్న విషయాన్ని కరెక్టుగా చెప్పుకోవటం కష్టం.

ఉదాహరణకు నీవు ఒకనాడు రెండో ఆట సినిమాకు వెళ్ళివస్తున్నట్లు - ఆ సమయంలో నీ పక్క నడుస్తున్న వ్యక్తిని కొందరు రౌడీలు చుట్టుముట్టి సైకిల్ చైన్స్‌తోను, హేండిల్ బార్స్‌తోను చావ బాదినట్లు, అడ్డం వచ్చిన నిన్ను తలపై కొట్టినట్లు - నువ్వు 'అమ్మో' అని కేకవేసినట్లు కలవచ్చిం దనుకోండి.

కలలో నువ్వు చూచిందంతా నిజంగా జరగటానికి నీ ఉద్దేశంలో అరగంట పడుతుందని అనిపిస్తే కలలో రెండే నిమిషాల్లోనే అది జరిగిపోయి వుండవచ్చు.

ఒక్కోసారి నువ్వు ఆలోచిస్తూ వుంటావు - పరధ్యానంగా వుంటావు - బయట ప్రపంచాన్ని మరచిపోతావు - అలా అరగంట

నుండో అమాంతం దూకేసినట్లు, నడిసముద్రంలో బుడుంగున మునిగినట్లు, ఏ కొరివి దెయ్యమో మెడ కొరికేసి రక్తం పీల్చేసినట్లు భయంకరమైన కలలు వచ్చి ముచ్చెమటలు పోయవచ్చు – అంతేకాదు, ఆ బీభత్సానికి నిజంగానే ఎవరైనా గుండె ఆగి మరణించవచ్చు. ఏ ఆదివారం మధ్యాహ్నమో సుష్టుగా భోజనంచేసి మీ స్నేహితులంతా సాయంకాలం పిచ్చాపాటి మాట్లాడుకొనే సమయంలో అకస్మాత్తుగా ప్రస్తావన స్వప్నాల్లోకి మారి మీలో ఒక్కొక్కరు ఒక్కొక్క అభిప్రాయం వెల్లడించవచ్చు. కలల్ని అర్థం పర్థం లేని గందరగోళంగా ఒకరు – అనాగరికతగా, మూఢవిశ్వాసాలుగా మరొకరు – భవిష్యత్తుకు సంబంధించిన ఘటనలకు పునాదులుగా ఇంకొకరు – ఎంతో వైవిధ్యంతో కూడిన భావప్రకటన చేయవచ్చు.

కలల్ని నమ్మేవాళ్లు నమ్మనివాళ్లు కూడా వున్నారు. దేవుడు వున్నాడా లేడా అన్న సమస్య వున్నంత కాలం కలల సమస్య కూడా వుండి తీరుతుంది.

## రోగులు మాత్రమే కలలు కంటారా?

కలలు కనటానికి రోగానికి అసలు సంబంధం లేదు. రోగులు కూడా కలలు కనవచ్చు. కాకపోతే, ఆడా మగా చిన్నా పెద్దా అనే భేదం లేకుండా మానవు లందరూ కలలు కంటారు. నిద్రపోని మనుషులెలా వుండరో, కలలు రాని వ్యక్తులు కూడ అలానే వుండరు. ఆ కలలు మెలకువ వచ్చిన తరువాత గుర్తుండకపోతే అది వేరే విషయం. మానవులే గాదు ప్రతి ప్రాణీ కలలు కనవలసిందే నని పెద్దలు నిర్ణయించారు.

## నిత్యజీవితంలో కలల ప్రభావం, కలవరింతలు

నవరసాలు మానవుని జీవితంపై తమ ప్రభావం చూపుతాయి.

సేపు గడచిపుంటుంది - కాని ఇదంతా చూస్తున్న నీ మిత్రుడు పలక రించినపుడు మాత్రం "అబ్బే ఏంలేదే .... ఇప్పుడే .... " అంటూ కంగారుగా జవాబు చెబుతావు.

కనుక రెండు మూడు క్షణాల్లోనే ఎన్నో దృశ్యాలను, సంఘట నలను కలగాంచ వచ్చునని బోధపడుతోంది.

కల అనేది శకునమా ?

శకునాలు రెండు రకాలు - సుశకునాలు, దుశ్శకునాలు. అలాగే కలల్ని కూడా పీడకలలనీ, తీయని కలలనీ విభజించటం కద్దు. కలల్ని శకునాల్నిగా భావించటం అనాదినుండీ వస్తోంది. శకునం శుభాశుభాల్ని నిర్ణయించటానికి ఉపయోగించినట్లే కల అనేదికూడా మంచి చెడుల్ని నిర్ణయించటానికి వినియోగిస్తుంది.

ముక్కోటి దేవతలు, ముప్పదికోట్ల దెయ్యాలు మానవుల స్వప్నాలకు కారణాలుగా పూర్వకాలంలో భావించేవారు. మానసిక శాస్త్రవేత్తలు ఈ మూఢవిశ్వాసాన్ని పటాపంచలుచేసి స్వప్న కారణా లను పేర్కొంటూ, స్వప్న ఫలితాలను నిర్ణయించారు.

కల అనేది అపస్మారక స్థితిలో ఏర్పడుతుందనీ, మనసనేది కలలకుకూడా కావాలనీ మనకు తెలుసు.

మామూలుగా ఊహించని విషయాలను కలలో 'మనసు' ఆలోచించి వ్యక్తం చేస్తుంది. ఎటొచ్చీ వానిని అర్థం చేసుకోవటం లోను, ఫలితాన్ని నిర్ణయించటంలోనే మన సామర్థ్యం ఆధారపడి వుంటుంది.

కనుక కలలకు ఫలితాలు వుంటాయనేది స్పష్టమౌతుంది - శకు నంగాకూడా స్వీకరించవచ్చు - వివరంగా ముందు ముందు చూద్దాం.

## మనిషిలో మనిషి

ప్రతి వ్యక్తిలోను మంచి చెడులు వుంటాయి – మంచి వ్యక్తు లనబడేవారి నీచత్వాన్ని వారి కలల్లోను, దుష్టస్వభావం గలవాడి మంచితనాన్ని అతడి కలల్లోను మనం స్పష్టంగా గమనించవచ్చు.

## కలల ఫలితాలు : మార్కండేయ మతం

ఇక కలల ఫలితాల్నిగూర్చి పురాణాల్లో ఎలా వివరింపబడి ఉందో చూద్దాం.

మార్కండేయుని మతానుసారం స్వప్న ఫలితాన్ని పరీక్షించి నట్లయితే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. బలహీనులకు భయం కలుగుతుంది. ఈ ఫలితాలన్నీ కేవలం ప్రజల్ని బెదరించటానికా అన్పి స్తాయి. పాఠకులు ఈ క్రింద ఉదహరించిన వాటిని గమనించండి.

మలము, మూత్రము, వెండి, బంగారము మొదలగు వాటిని వాంతి చేసుకున్నట్లు కలగంటే అవ్యక్తి పదినెలలు మించి బ్రతకటం కష్టం.

నల్ల ఏనుగు, నల్ల గుఱ్ఱముతో, నల్ల మనుష్యుడు దగ్గరగా నిల బడినట్లు కలగన్నయెడల ఆ వ్యక్తి మూడు రోజులలో మరణించును.

భయంకరులు, కురూపులు, ఆయుధధారులు; అయిన నల్లని మనుష్యులు రాళ్ళతో కొట్టినట్లు కలగన్న వ్యక్తి వెంటనే మరణించును.

ఎర్రనిబట్టలు ధరించిన స్త్రీ లేదా నల్లని బట్టలు ధరించిన స్త్రీ, పాటపాడుతూ, నవ్వుతూ, దక్షిణ దిక్కుగా తీసుకుని పోయినట్లు కల గన్న చావు తప్పదు.

కప్పుకొనిన బట్టలు తెల్లగ – నల్లగ – ఎర్రగ - రంగులలో వున్నట్లు కలగన్న వ్యక్తి మరణించును.

గోతిలోపడినట్లు, ఇంటి వాకిలికి తాళము వేసినట్లు కలలో కనబడిన వ్యక్తి లేచినతోడనే మరణించును.

ఎర్ర చందనము ఒడలంతా పులుముకున్నట్లు, ఎర్రని పూలను ధరించినట్లు, నూనె పూసుకున్నట్లు, లేదా త్రాగినట్లు, తలబోడియైనట్లు ఎర్రని బట్టలు ధరించి గాడిదమీద ఎక్కి దక్షిణ దిక్కుగా వెళ్ళినట్లు, తన్ను తానే చూచుకొన్నట్లు కలగన్న వ్యక్తికి శీఘ్రకాలంలో మరణ యోగం ప్రాప్తించును.

ఇదేవిధంగా దాదాపు అన్నిరకాల కలలకు మరణాన్ని ఫలితంగా ప్రకటించారు మార్కండేయ మతంలో – ఇవి సంభవాలో, అసంభవాలో చదువరులే గ్రహించాలి! మరికొన్ని ఉదాహరణలు చూడండి!!

వెంట్రుకలు రాలిపోయినట్లు, దంతాలు వూడిపోయినట్లు కలగాంచిన ధన నాశము, రోగపీడ ఏర్పడును.

ఎద్దు, దున్నపోతు, సింహము, పెద్దపులి, కుక్క, పాము, కోతి, పంది వెనుకనుండి తరిమినట్లు స్వప్నము కలిగిన రాజకులము వలన భయము.

దుమ్ము, తైలము, నెయ్యి ఒడలంతా పులుముకున్నట్లు, కలగాంచిన రోగము కలుగును.

రక్త వస్త్రము, రక్త చందనము ధరించిన స్త్రీని కౌగిలించుకున్నట్లు స్వప్నము గాంచిన ఆ వ్యక్తి మృత్యువువాత బడును.

దిన మొలగా వున్నవారు – బోడితలల వారు – ఎర్రని నల్లని బట్టలు ధరించినవారు – అంగహీనులు – నల్లని త్రాళ్ళను చేతబట్టిన వారు – ఆయుధాలను ధరించినవారు – కొట్టుచూ దక్షిణ దిక్కుకు తీసుకుని పోయినట్లు; దున్నపోతు, ఒంటె, గాడిదలపై ఎక్కిన స్త్రీ, పురు

షులను చూచినట్లు కలగాంచిన యెడల రోగము లేని వ్యక్తికి రోగము వచ్చి తీరును. రోగము వున్నవాడు మరణించును.

విష్ణుపురాణం

దేవతలు, బ్రాహ్మణులు, మహారాజులు, ప్రజలు కోపగించి నట్లు - కన్యను ఆలింగనము చేసికొన్నట్లు - పశువులు, పక్షులు, క్రూర జంతువులు మైథునము గావించుచున్నట్లు - కలగాంచిన వ్యక్తి చేతులకు కీడు కలుగును.

దక్షిణ దిక్కునకు పోయినట్లు కలగాంచిన దీర్ఘవ్యాధి కలుగును.

పండ్లు దొంగిలించుట, గడ్డికోయుట, నూనెలో మునుగుట, ఎర్రని గుడ్డలు కట్టుకొనుట, ఎర్ర పూదండలు వేసికొనుట, ఎర్ర చందనమును పూసికొనుట కలలో కనబడిన దుష్ఫలితములు ఏర్పడును.

కలలు - రోగాలు

ఏయే కలలు వచ్చినపుడు ఏయే రోగాలు రాగలవో కూడ పూర్వీకులు ఈ క్రింది విధంగా తెలిపారు.

గాడిద, ఒంటె, కుక్క మొదలైన వాటిపై ఎక్కి దక్షిణ దిక్కుకు వెళ్ళినట్లు కలగన్న క్షయరోగ పీడితుడై మృతిచెందును.

లక్కవలె ఆకాశం ఎర్రగా కనబడిన రక్తపిత్తరోగం ఏర్పడును.

రక్త దేహం, రక్త వస్త్రం. రక్తపు పూమాల ధరించి మా

మాటికి నవ్వుచు స్త్రీ తన్ను లాక్కొని పోతున్నట్లు స్వప్నం కలిగిన రక్త రోగము తగులుతుంది.

గోళ్ళు నల్లబడినట్లు, బొమ్మమీద ముళ్ళతీగ మొలిచినట్లు కల గాంచిన గుల్మరోగము వచ్చును.

దిగంబరుడైనట్లు, దేహమంతటా నెయ్యి పూసుకున్నట్లు, మంట లేని అగ్నిలో హోమము చేసినట్లు, బొమ్మమీద పద్మము పుట్టినట్లు కలగాంచిన కుష్ఠురోగము కలుగును.

| | |
|---|---|
| చండాలురతో కలసి నెయ్యి త్రాగినట్లు | — మధుమేహరోగం |
| రాక్షసులతో నృత్యం చేస్తూ నీటిలో మునిగినట్లు | — ఉన్మాదరోగం |
| చక్కిలములు అపూపము తిని కక్కినట్లు | — అతిమూత్ర వ్యాధి |
| కుక్కతో స్నేహము చేసినట్లు | — జ్వరం |
| కోతులను పెంచి పెద్ద చేసినట్లు | — శోష రోగం |
| పిశాచాలతో మైత్రిగా వున్నట్లు | — మూర్ఛారోగం |
| పసుపు కలిపిన పదార్థములు తినినట్లు | — పాండురోగం |
| శిరస్సునందు, చంకలందు చెట్లుమొలిచినట్లు | — గుల్మరోగం |
| చక్కిలములు తినినట్లు | — వాంతి రోగం |

పైన ఉదహరించిన కలలకు పూర్వీకులు చెప్పిన ఫలితాలు సరైనవే అయితే ఇప్పుడున్న ప్రపంచంలోని జనాభాలో దాదాపు అందరు ఏదో రోగం వచ్చి మృతిచెంది వుండేవారు గదా అన్న సందేహం కలుగుతుంది.

## పరాశర సంహిత

కేవలం దుస్వప్నాలనే గాకుండా కొందరు పూర్వీకులు కమ్మని కలలకు తియ్యని ఫలితాలు తెలిపారు.

పరాశర సంహితలో ఈ క్రింది విధంగా చెప్పబడి వుంది:

తన శరీరము కాలిపోయినట్లు, శత్రువులను జయించినట్లు, ఇంద్రధ్వజాన్ని కౌగిలించుకున్నట్లు, పాదాలకు సంకెళ్ళు పడినట్లు, ఎర్రని నిప్పులు మ్రింగినట్లు, గొడుగు పట్టుకున్నట్లు, ఏనుగుపై అంబారీ వేసుకుని అందులో కూర్చుని ఊరేగినట్లు, బ్రాహ్మణులను దర్శించి నట్లు కలగాంచిన వ్యక్తి రాజ్యాధిపతి కాగలడు.

సూర్య చంద్రాదులను, తారకలను భుజించినట్లు, శిరస్సు ఏడు, ఐదు, మూడు ముక్కలయినట్లు; ఎద్దును, ఇంటిని, రాజును చూచినట్లు, తెల్లని సింహాసన మెక్కినట్లు; సముద్రము, భూమి వంటి వానిని మ్రింగినట్లు; కలను గాంచిన వ్యక్తి పృథ్వీపతి కాగలడు.

పరస్త్రీతో విహరించుట, సుగంధాదుల్ని తాల్చుట, వాసన లీను పూలను లేక వస్త్రములను ధరించుట, మణి రజత సువర్ణ పాత్ర లలో నెయ్యి, పెరుగు, పరమాన్నంవంటి వానిని స్వీకరించినటు స్వప్నము గాంచిన మిక్కిలి మేలు జరుగును.

## వరాహ మిహిరుని బృహద్యాత్రా గ్రంథం

వరాహ మిహిరుని సిద్ధాంతం ప్రకారం కొన్ని కలలకు ఈ క్రింది విధంగా ఫలితాలు నిర్ణయించ బడ్డాయి.

లేడి మీద కూర్చుండి యున్నట్లు — దేశ భ్రమణము
పందిమీద కూర్చుండి దిగినట్లు — కొద్దికాలంలో మరణం
ఒంటిపై ఎక్కినట్లు — జబ్బు చేయును
ఏనుగుపై ఎక్కినట్లు — శీఘ్రకాలంలో వృద్ధాప్యం

ఈ క్రింది కలలను మంచి కలలుగా నిర్ణయించారు వరాహ మిహిరులు :

పర్వతము, మేడ, ఎద్దు మొదలగువానిపై ఎక్కుట.

చంద్ర, సూర్య, నక్షత్ర, సముద్ర, భూములను మ్రింగుట.

వివాహము, జూదము, యుద్ధము, కుస్తీ మొదలగు వానియందు గెలుచుట.

మాంసము, చేపలు, పాలు, కల్లు, సారాయి, రక్తము, పరమాన్నము వంటి వానిని భుజించుట లేక త్రాగుట.

తడిసిన నేల, నిర్మలముగా వున్న ఆకాశము, దేవ, బ్రాహ్మణ, గురు, గృహముల చూచుట.

గేదె, ఆవు, ఆడసింహము, ఆడ గుఱ్ఱముల పాలు పిదుకుట.

పై కలలు గన్న రాజ్యాభిషేకమే జరుగవచ్చునని వరాహమిహిరులు సెలవిచ్చారు. నేడు ప్రజా ప్రభుత్వాలు అమలులో వున్నాయి గనుక ప్రధాన మంత్రిగా పదవీ స్వీకారం జరుగుతుందేమో మరి!

తలతెగుట, మరణించుట, అగ్ని దొరుకుట, ఇండ్లు తగుల బడుట, చెఱువు నీదుట, ఆడుగుఱ్ఱము, ఆడు ఏనుగు, ఆవుల వంటివి ఇంటిలో ఈనుట, ఏడ్చుట మొదలగు కలల వలన శుభ ప్రాప్తి కలుగునని తెలుపబడినది.

ఆ చా ర మ యూ ఖ ం

మన ప్రాచీనుల ఊహలు, ఆలోచనలు ఎలా వుండేవో, వారి స్వప్న ఫలితాలు ఎలా వుండేవో ఆచార మయూఖం ద్వారా తెలుసుకోవచ్చు.

కన్నె పిల్లను సంభోగించినట్లు కలగన్న యెడల శుభం జరుగ వచ్చునని తెలియపరచబడింది.

కాని ఇదే సమయంలో మరొక విపరీతమైన కలను గురించి కూడా చెప్పబడింది.

తోబుట్టువును సంభోగించినట్లు స్వప్నము కలిగినను మంచిదే నని ఆచార్య మయూఖంలో ఉదహరించబడింది. ఇలాంటి వింతకల వస్తుందా ? అన్న సంశయం కొందరికి కలుగవచ్చు. కాని ఆనాడే కాదు. నేటి నవనాగరిక జగత్తులో కొందరు యువకులు తోబుట్టువులను తెలిసో తెలియకో కామించటం – సంఘ కట్టుబాట్ల దృష్ట్యా అలవిగాక ఏ స్వప్నంలోనో కోరికల్ని తీర్చుకోవటం అసంభవంగాక, సంభవమై పోయింది.

## శయనకాల స్మరణీయ మంత్రము

ఇక పురాణాల్లోని కలల ప్రస్తావనలో చివరి విషయానికి వద్దాం.

"నమశ్శమ్భో త్రినేత్రాయ రుద్రాయ వరదాయ చ,
వామనాయ విరూపాయ స్వప్నాధి పతియే నమః
భగవన్ దేవదేవేశ శూల భృ ద్వృష వాహన,
ఇష్టానిష్టే మమా చక్ష్వ స్వప్నే సొంత్వ తః."

పై మంత్రాన్ని ప్రతివారు నిద్రపోయేముందు ఏకాగ్రతతో స్మరించి ఆ తర్వాత నిద్రపోయినట్లయితే పీడకలలు రావనీ, కమ్మని కలలే వస్తాయనీ పూర్వీకులు చెప్పారు.

## దుస్స్వప్న ప్రాయశ్చిత్తం

మనకు నిద్రలో ఏదైనా దుస్స్వప్నం లేదా పీడకల వచ్చి నపుడు ఎవరికీ ఆ కలను వినిపించరాదనీ, ప్రాతఃకాలాన్నే స్నాన మాచరించి బంగారు, నువ్వులు, ఇనుము దానంచేస్తే సరిపోతుందనీ.

పెద్దలే చెప్పారు. విష్ణు సహస్రనామం వంటి విష్ణు స్తోత్రం పఠించాలనీ, రాత్రంతా విష్ణు మందిరంలో జాగరణ చేయాలనీ, ఈ విధంగా మూడు రోజులు చేస్తే దోష పరిహారం జరుగుతుందనీ పురాణాల్లోనే ప్రాయశ్చిత్తమార్గంకూడా వివరించబడింది.

అనేకానేకాలైన విషయాలపై ఇలాంటి మంత్రాలు ప్రాయశ్చిత్త మార్గాలు మన పురాణాల్లోను, ప్రాచీన గ్రంథాల్లోనూ ఉదహరించి వుండటంవల్ల ప్రజానీకంలో వాటిని అనుసరించటమూ, లేక మూఢ విశ్వాసాలుగా కొట్టివేయటమూ అన్న నిర్ణయం వారివారికి వదలి వేయటం జరిగింది.

## కలల ఫలితాల్ని విశ్వసించ వచ్చా ?

మనది భారతదేశం. ఒకప్పుడు దీన్ని మహర్షుల, మహాసర్పాల దేశంగా పాశ్చాత్యులు భావించారు. కాని ఆతర్వాత తర్వాత హైందవ సంస్కృతినీ, భారతీయ ఇతిహాసాల్నీ, వేదాల సారాన్నీ, మహామహుల శాస్త్రాల్ని మథించి, మథించి భారతీయుల మేధాసంపత్తిని అవగాహన చేసుకున్నారు. మంత్ర తంత్రాల్నీ, క్షుద్రవిద్యల్నీ ఇంద్రజాల మహేంద్రజాలాల్నీ విశ్వసించారు. ఇంగ్లాండు దేశంలో దయ్యాల్ని గురించి పరిపూర్ణంగా పరిశోధనలు జరిగాయి. దయ్యాల్ని చూసిన వారున్నారు – దయ్యాలు నివసిస్తున్న మేడలు నేటికీ వున్నాయి.

పుట్టుమచ్చలకు ఫలితాలు, బల్లిపాటుకు ఫలితాలు, జాతకాలు వ్రాయించుకోవటం, చిలుకతో జోస్యం చెప్పించుకోవటం, హస్త సాముద్రికునివద్ద చేయిచూపించుకోవటం, కోయదొరతో అరచేతిని నేల కానించి చేతిమీద నరాల్ని చూపించి భవిష్యత్తు చెప్పించుకోవటం, ఎరుకలసానితో సోది చెప్పించుకోవటం సర్వసాధారణంగా మనం

చూస్తుంటాం. ప్రతి శుభకార్యానికీ, అశుభకార్యానికీ కూడా లగ్నాలు, ముహూర్తాలు పెట్టించి మరీ ఆకార్యాల్ని పూర్తికావిస్తాం. ఇవన్నీ మానవ జాతికి మామూలే!

అయితే ఇవన్నీ మూఢ విశ్వాసాలని కొట్టిపారేసేవారూ వున్నారు.

అంతెందుకు?

ఇటీవల పుట్టపర్తిలో వున్న సత్యసాయిబాబా మహిమల్ని గురించి పెద్ద దుమారం లేచింది. వాదప్రతివాదాలు జరుగుతున్నాయి. భారతీయుల్లోనే కొందరు అంతా బూటకం అంటుంటే వేల మైళ్ళ దూరంలో వున్న అమెరికాలోని కొందరు సత్యసాయిబాబా మహిమ మా కిక్కడికే తెలుస్తోంది అంటున్నారు.

అనుకూలంగానూ ప్రతికూలంగానూ అనేక పత్రికల్లో ప్రతి రోజు వార్తలు వస్తూనే వున్నాయి. విశ్వసించేవారు విశ్వసిస్తూనే వున్నారు. లేనివారు విమర్శిస్తూనే వున్నారు. మానవ స్వభావమే అంత!

దేవుడు వున్నాడా – లేడా? మతాలు మంచివా, కావా? ఇలా ప్రపంచంలోని చాలా విషయాలపై అటూ ఇటూ వాదించేవారున్నారు. ఇది ఎప్పటికీ తెగని సమస్య. ఆఖరుకు విజ్ఞాన శాస్త్రవేత్తలే ఒకప్పటి తమ నిర్ణయాన్ని అ తర్వాత కాలంలో మార్చుకుని మరో సిద్ధాంతాన్ని కని పెడుతున్నారు.

## ఫ్రాయిడ్ అభిప్రాయం

ప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్త డాక్టర్ సిగ్మండ్ ఫ్రాయిడ్ కలల ఫలితాల్నే కాకుండా మరికొన్నిటి ఫలితాల్నికూడా ధృవీకరించారు. మానవుని జీవితంలో జరిగే ఒక్కొక్క సంఘటనకూ అది ప్రయత్న అపూర్వకంగా జరిగినా, ప్రయత్న పూర్వకంగా జరిగినా సరే, దానికి

తప్పక ఫలితం వుండితీరుతుందన్నారు. కళ్ళకు పెట్టుకున్న కళ్ళ జోడు పొరబాటున జారిపడి అద్దాలు పగిలినా ఆ సంఘటనకు ఫలితం వుంటుందన్నారు. ఎటు తిరిగీ ఆ ఫలితాన్ని తెలుసుకోవటంలోనే అసలు ఇబ్బందంతా వుంది.

## పగటి కలలు

ఈ పగటి కలలకు ఫలితాలు వుండవని పెద్దల అభిప్రాయం. ఇది నిజం కాదు. ఎందువల్లనంటే పగటి కలలు రెండు రకాలుగా వున్నాయి. మొదటి రకం బడలికవల్ల పగటివేళ ఏ పడక కుర్చీ లోనో కూర్చుని ఓకునుకు తీస్తే, సరిగా నిద్రపట్టని అసమయంలో వచ్చిన కలలు. రెండవ రకం రాత్రి వేళల్లో ఏ ఫ్యాక్టరీలోనో డ్యూటీ చేస్తూ, నిద్రపోవటానకి అవకాశంలేక పగటి వేళనే హాయిగా పడ గ్గదిలో పందిరి మంచంమీద గుర్రుపెట్టి నిద్రించే టప్పుడు కాంచిన కలలు. ఈ రెండు రకాల్లో మొదటి రకం పగటి కలలకు ఫలితం వుండదు కాని రెండవ రకం పగటి కలలకు తప్పని సరిగా ఫలితం వుంటుంది.

## కలలు భవిష్యత్తును సూచిస్తాయా?

జీవితంలో ముందు జరగబోయే మంచి చెడులను సూచిస్తూ కలలు వస్తుంటాయి. ఇందుకు సందేహం లేదు. పురాణకాలంనుండీ ఇందుకు ఉదాహరణ లున్నాయి. ముందుగా పురాణాల్లోని ఫలితాల్ని చూద్దాం.

## త్రిజటా స్వప్నం

రంగనాథ రామాయణంలో ఒక ప్రధాన ఘట్టం త్రిజటా

స్వప్నం—త్రిజట రాక్షసస్త్రీ. అశోక వనంలో సీతాదేవికి కావలిగా మరి కొందరు రాక్షస స్త్రీలతోపాటు రావణునిచే ఈమె నియమించబడింది. సాటి రాక్షస స్త్రీలు సీతాదేవిని నానాహింసలు పెట్టటం, ఆమె శోకించటం చూడలేక త్రిజట దూరంగా పోయి పడుకుంటుంది. అప్పుడామెకు ఒక కల వస్తుంది. ఆ కలకు ఫలితాన్ని మిగతా స్త్రీలతో చెబుతుంది. శ్రీరామచంద్రుడు రావణాసురుని సంహరిస్తాడనీ, సీతాదేవిని తీసుకుని పోతాడనీ తన కల ఫలితాన్ని నిర్ణయించి చెబుతుంది.

రాక్షస నాయకులు కొందరు నూనె త్రాగి పడిపోయినట్లు కల వచ్చిందనీ, కనుక వారు మరణిస్తారనీ చెబుతుంది. ఆతర్వాత సరిగ్గా అలాగే జరిగింది.

ఉషా అనిరుద్ధుల వివాహం

బాణాసురుని కుమార్తె ఉష. ఆమెకు ఒక కలవస్తుంది. అందులో ఒక యువకుడు కన్పించి ఆమెతో తీయగా మాట్లాడి అదృశ్యమౌతాడు. ఆమె చెలికత్తె చిత్రరేఖ తన ఊహతో ఎన్నో చిత్రాల్ని చిత్రిస్తుంది – అందులోని ఒక చిత్రంలోని రాకుమారుడిన్ని తన కలలోని నాయకుడిన్నిగా గుర్తిస్తుంది. అతడే అనిరుద్ధుడు. చివరకు ఎలాగైతేనేం ఉషా అనిరుద్ధులకు వివాహం జరుగుతుంది – ఇందులో గుర్తించుకొన వలసిన దేమంటే ఉషాసుందరికి తా నెన్నడూ చూడకపోయినా. ఆమెకు కాబోయే భర్త కలలోకి రావటమే. ఇలా పురాణాల్లో అనేక సందర్భాల్లో కలల ప్రస్తావన వుంది.

ప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్తలు కొందరు లక్షలాది మందికి వచ్చిన కలల్ని పరిశోధించి పుస్తకాలు వ్రాశారు. ముఖ్యంగా టెర్రెల్, డ్యూబర్ మహాశయులు కొందరి కలలను, అవి వారి భవిష్యత్తును ఎలా సూచించిందీ కూడా తెలిపారు.

## నెపోలియన్ సామర్థ్యం

కలలకు ఫలితాల్ని నిర్ణయించటంలో నెపోలియన్ గొప్పవాడని కొందరు చరిత్రకారులు వెల్లడించారు. తనకు అవసరమైన వాటిని, తాను చేయబోయే కార్యక్రమాల పరిణామాన్ని ముందుగానే కలల రూపంలో తాను చూచేవాడట. ఈ సామర్థ్యం ఆత్మవిశ్వాసంతో, పట్టుదలతో సాధన చేసినప్పుడు అలవడి తీరుతుంది. నెపోలియన్ తన మరణాన్ని కూడా స్వప్నంలో ముందుగానే చూచాడని చెబుతారు.

## భవిష్యత్తును ఎలా సూచిస్తాయి?

సాధారణంగా చాలాకాలం తర్వాత జరుగబోయే సంఘటనలు కలల్లో అస్పష్టంగా కన్పిస్తాయి. దగ్గరలో జరిగేవి స్పష్టంగానే కన్పిస్తాయి. కాని గుర్తించే శక్తి కొందరిలో మాత్రమే వుంటుంది.

## తమాషా కలలు

కొన్ని కలలు తమాషాగా వుంటాయి. వాటికి ఫలితం వుండదు. ఉదాహరణకు నీవొక సినిమాకు వెళ్ళాలనుకున్నావు. అందరూ చూచి చెప్పుకుంటుంటే నీకూ ఆ సినిమాను చూడాలన్న ఉత్సాహం, ఆరాటం ఏర్పడ్డాయి-కాని నీవద్ద డబ్బు లేకపోవటంవల్ల ఆ సినిమాకు పోలేక పోతున్నావు - అదే బాధగా అనుక్షణం నిన్ను వేధిస్తుంది. ఆ సమయంలో 'వంద రూపాయలు దొరికితే బాగుండు, యాభై సార్లు ఆ సినిమా చూడవచ్చు-' అన్న ఊహ నీలో బలంగా కలుగుతుంది. అదే నీకు కలగా వస్తుంది - పదిమంది ఫ్రెండ్స్‌ను వెంటేసుకుని, అందరి టిక్కెట్లు నువ్వే కొని ఆ సినిమాను చూచినట్లు కలవస్తుంది. ఇది తమాషా కల. దీనికి ఫలితం వుండదు.

XXXII

ఇలాగే ఉద్యోగం కోసం నానా అగచాట్లు పడుతున్నప్పుడు గెజిటెడ్ ఆఫీసర్ ఉద్యోగం వచ్చినట్లో, పెళ్ళికోసం తాపత్రయ పడుతుంటే అది ఘనంగా జరిగినట్లో కలలు వస్తాయి. వాటికి ఫలితాలు వుండవు.

## కన్నెపిల్ల కల

ఒకసారి పదహారేళ్ళ కన్నెపిల్లకు ఓ కలవచ్చింది. అందులో ఆమె ఒక వెన్నెలరాత్రి, ఒక తోటలో తెల్లని బట్టలు ధరించి వన దేవతలా విహరించినట్లు, అతి నిర్మలంగాను తామరపూలు తీవెలతో నిండియున్న ఓ కొలను చూచినట్లు, అందులో స్నానం చేయాలన్న సంకల్పంతో దిగి ఒక మునుగు మునిగి లేచి చూసుకునేసరికి బట్టలే కాకుండా తన దేహంకూడ బురదతో నిండి అసహ్యంగా మారినట్లు ఆ అమ్మాయి కల గన్నది.

ఆ అమ్మాయి స్థానిక గరల్స్ హైస్కూల్లో 10 వ తరగతి చదువుతోంది. ఓ కలవారి అబ్బాయి ఆమెను ప్రేమిస్తున్నాడు. పెళ్ళి చేసుకుంటానని ఊసులాడు తున్నాడు. ఇక ఆ అమ్మాయికూడ చేసుకో వాలన్న నిర్ణయానికి వచ్చింది. రేపు చెప్పాలనుకుంటుండగా ఈరోజు ఆమెకీ కల వచ్చింది.

ఆమె వారి క్లాస్ టీచర్‌కు ఈ కల చెప్పి ఫలితం అడిగింది. ఆమె ఆ కన్నెపిల్లను అనేక ప్రశ్నలతో ముంపతెంచి తన మానసిక శాస్త్రపరిజ్ఞానంతో చివరకు ఫలితాన్ని నిర్ణయించి ఇలా చెప్పింది - "నువ్వు శీలవతివి. అందుకే తెల్లని బట్టలను ధరించావు - నీ మనస్సు సున్నితమైంది - అందుకే వెన్నెల్లో బయల్దేరావు. నీవు చూచిన సరస్సు నిర్మలంగా వుంది - అంటే ఆ అబ్బాయి అంత మంచివాడుగా

కన్పిస్తున్నాడన్న మాట - నీవు కొలనులో దిగి స్నానం చేయాలను కున్నావు - ఆ అబ్బాయితో జీవితం సాగించాలనుకున్నావు. అయితే ఒక్క మునుగుతోనే నీ బట్టలు, శరీరం బురదతో నిండిపోయింది. అంటే ఆ అబ్బాయితో నీవు కలిస్తే నీ సాంఘిక జీవితం, శరీరం అన్నీ దుర్గంధ పూరితా లౌతాయ్ - కనుక జాగ్రతగా వుండు-" అని.

ఆ అమ్మాయి అలాగే చేసింది. అతన్ని కాదంది. అతడి వలలో మరో అమ్మాయి పడి జీవితాన్ని నాశనం చేసుకుంది - ఇలా ఈ కల ఆ కన్నెపిల్ల జీవితాన్ని కాపాడింది.

## విజయ నిర్ణయం

ఇటీవల ఒక రైతు ఒక పురోహితుని వద్దకువెళ్ళి తనకు వచ్చిన కల చెప్పాడు - సంక్రాంతి పండుగ వచ్చినట్లు, ఊరిబయట తోటలో కోడి పందాలు జరుగుతున్న చోటికి వెళ్ళినట్లు, అప్పటికప్పుడే ఒక కోడి పుంజును కొని పందేనికి దిగినట్లు, పోటీలో మరొక పుంజు చేతిలో ఇది ఓడిపోయి కూలిపోయినట్లు కలవచ్చిందని చెప్పాడు.

ఆ పురోహితునికి ఆ ఊరి పరిస్థితులు బాగా తెలుసు. అందువల్ల ఆయన చక్కగా ఆలోచించి వివరణ చేశాడు - "బాబూ, ...నువ్వు మంచి రైతువే; అయితే మన ఊరికి పంచాయతీ ఎన్నికలు రాబోతున్నాయి. ఆ సందడిలో ప్రెసిడెంట్ పదవికి పోటీ చేద్దామన్న ఉద్దేశం కలుగుతుంది - చెప్పుడు మాటలు వింటావు - నీకున్న ఆస్థి చాలక అప్పుకూడ తెచ్చి ఖర్చుపెట్టి పోటీకి నిలుస్తావు - అందులో ఓడిపోతావు. అన్నిరకాలుగా నష్టపోతావు - జాగ్రత!" అని హెచ్చరించాడు. కాని ఆ రైతు వినలేదు. ఉద్రేకం ఎక్కువై వారి పెద్దలు చెప్పిందికూడా వినకుండా ఎన్నికల్లో పాల్గొన్నాడు. ప్రత్యర్థి చేతిలో చిత్తుగా ఓడిపోయాడు.

ఇలా నిత్యజీవితంలో కలల వలన చక్కని భవిష్యత్తును తీర్చి దిద్దుకోవటానికి అవకాశం వుంటుంది.

సాంకేతికాలు

గణిత శాస్త్రంలోను, విజ్ఞాన శాస్త్రంలోను కొన్ని సాంకేతిక పదాలుంటాయి. అలాగే ఈ స్వప్నశాస్త్రానికి మేధావులైన మానసిక శాస్త్రవేత్తలు కొన్ని సాంకేతిక పదాల్ని (గుర్తుల్ని) సేకరించి వాటి ఫలితాల్ని పరిశోధించి ప్రకటించారు. పదిమంది వైద్యులు ఒక మూలికను వందల మంది రోగులకు వాడి నివారణగా దాన్ని గుర్తించి ప్రకటించినట్లుగా – కొన్నివేలమందికి వచ్చిన కలల్ని సమీకరించి ఫలానా వస్తువు కలలో కనబడితే ఫలానా ఫలితం అవునా కాదా? అని ప్రయోగాలు చేసి నిర్ణయించి ప్రకటించారు. అలాంటి కొన్ని వస్తువులను, చర్యలను, సంఘటనలను కూర్పుచేసి, ఈ 'కలల నిఘంటువు'ను తయారు చేసి తెలుగు పాఠకలోకానికి అందించటం జరిగింది.

ఇలా వ్రాసుకుంటూపోతే ఈ పీఠికయే గ్రంథంగా మారిపోయే ప్రమాదం వుంది గనుక ఇంతటితో విరమిస్తున్నాను.

రచయిత ఆశయం, ప్రకాశకుల వ్యయప్రయాసలు తప్పక జయప్రదం కాగలవని ఆశిస్తూ, తెలుగులో ఇలాంటి కొన్ని ఉత్తమ గ్రంథాల్ని వెలువరించ వలసిందిగా ప్రకాశకులను కోరుతూ సెలవు తీసుకుంటున్నాను.

ఈ పీఠిక రచనలో నాకు సహకరించిన మిత్రులు శ్రీ టి. సత్యనారాయణ M A., B. ED., గారికి, లయన్ కె. రవీంద్ర ప్రసాద్, (తెనాలి) గారికీ కృతజ్ఞతలు.

5–7–1977<br>
మద్రాసు–1

భవదీయుడు,<br>
ముంగర కోటేశ్వరరావు.

# రచనకు పరిశీలించబడిన గ్రంథములు

1. హిజ్ డ్రీమ్ అండ్ సెక్స్ థీరీస్ (ఆంగ్లము) ఫ్రాయిడ్
2. మెంటల్ యాక్ట్స్ ,, పీటర్ థామస్
3. డ్రీమ్ పవర్ ,, అన్‌ఫారడే
4. ది లక్కీడ్రీమ్ అండ్ నంబర్ బుక్ ,, రాబర్ట్ ఆండ్రూ
5. ఎమోషన్ ,, ఫుల్‌మాన్ జేమ్స్
6. ఎనలైసిస్ ఆఫ్ మైండ్ ,, బెర్ట్రండ్ రస్సెల్
7. కన్‌సెప్ట్ ఆఫ్ మైండ్ ,, జిల్బర్ట్ రైల్
8. ది థింకింగ్ మెషీన్ ,, ట్రిస్ బై జాన్
9. ఇంటర్‌పెట్ యువర్ డ్రీమ్స్ ,, మార్ఫ్ ఫ్లాష్ అండ్ పి. రియల్
10. స్వప్న ప్రకాశిక (సంస్కృతం) దత్తరామ ప్రణీతము
11. కణవుగళుక్కు పలమ్ (తమిళం) తమిళ్‌వాణన్

మరికొన్ని పంచాంగ పీఠికలు, పత్రికావ్యాసాలు కూడా పరిశీలించబడినాయి.

# విషయ సూచిక

## 1. అక్షరములు 1–6



## 2. ఆటలు 7–9

## 3. ఆయుధాలు 10–14



## 4. ఆహార పదార్థాలు వగైరా 15–19

## 5. ఇల్లు—వాకిలి—వగైరా 20–25



## 6. కళలు—తత్సంబంధములు 26–30

## 9. చేపలు 44–46



## 10. జంతువులు 47–55

## 11. తంతి–తపాలా 56–58



## 12. నగలు 59–62

## 13. నవరత్నాలు 63–65



## 14. నిత్యావసర వస్తువులు 66–84

## 15. అంకెలు 85–90

## 16. నీరు 91–96

## 17. నెలలు 97–99



## 18. నేరాలు–విచారణలు–తీర్పులు 100–106



## 19. పక్షులు 107–111

## 20. ప్రకృతి–సంపద 112–120

## 21. ప్రయాణ సాధనాలు—వగైరా 121–128



## 22. పాఠశాల—కళాశాల—వగైరా 129–133

## 23. పురుగు, పుట్రా–వగైరా 134–140

# 24. పేకముక్కలు 141–151

## 25. ప్రేమ, పెండ్లి వగైరా 152–156



## 26. పండ్లు 157–163

## 27. బంధువులు 164–172

## 28. మతాలు – ఆచారాలు – వగైరా 173–179



## 29. రంగులు 180–182



## 30. లోహములు 183–185

## 32. వాయిద్యాలు 195–196



## 33. శరీరావయవాలు 197–206

## 34. కరగూర గంప 207–225

## ౩౫. వ్యాధులు - వృత్తులు - వగైరా 226—230





కాల భేదాన్ననుసరించి ఫలితాలు మారుతుంటాయనికూడా బృహస్పతి వివరించారు. ఏ సమయంలో వచ్చిన కలకు ఫలితం ఎంత కాలంలో వుంటుందో క్రింద వివరించబడింది.

| | | |
|---|---|---|
| మొదటి జాము | — | ఒక సంవత్సరం |
| రెండవ జాము | — | ఎనిమిది నెలలు |
| మూడవ జాము | — | మూడు నెలలు |
| నాల్గవ జాము | — | ఒక నెల |
| అరుణోదయ సమయం | — | పదిరోజులు |
| పశువుల్ని తోలేకాలం | — | వెంటనే |

మనుష్యుని అవయవాల్ని భుజించినట్లు కలగంటే ఈ క్రింది విధంగా ఫలితం ఉంటుందని చెప్పారు దేవ గురువు.

| | | |
|---|---|---|
| పాద మాంసం | — | 500 బంగారు నాణేలు దొరుకుతాయి. |
| బాహు మాంసం | — | 1000 బంగారు నాణేలు దొరుకుతాయి. |
| తల మాంసం | — | రాజ్యాధిపత్యం దక్కుతుంది. |
| హృదయ మాంసం | — | మంత్రి పదవి లభిస్తుంది. |

కలలో చెప్పులు, జెండా, చక్రము, పదనుగలకత్తి కనబడినట్లయితే ప్రయాణం చేయవలసి వుంటుందని బృహస్పతి వివరించారు.

పురాణాల్లోని మరికొందరి మహానుభావుల భావాల్ని గురించి తెలుసుకోబోయే ముందు అసలు కలలు ఎలా కలుగుతున్నాయన్న సంగతి చూద్దాం.

## కలలు ఎలా వుంటాయి ?

ఎత్తయిన పర్వతాన్ని సునాయాసంగా ఎక్కినట్లు, అంతులేని అగాధంలోకి సర్రున జారిపోయినట్లు, ఏ యాభై అంతస్థుల మేడమీద

వాదంతో క్రొత్త రికార్డు సృష్టించారు. ఈ క్రింది విధంగా కలకు నిర్వచనం చెప్పారు:

"A Dream is an expression of the 'unconscious', and the 'unconscious' is governed by certain special nerve centres situated at the base of the brain".

కనుక అపస్మారక స్థితిలో కూడా మానవుడు భావప్రకటన చేయగల శక్తీ, మొదడులో గల కొన్ని ప్రత్యేక నాడీ కేంద్రాల ఆధిపత్యంలో ఈ అపస్మారక స్థితి భావప్రకటన చేస్తుందనీ అర్థమవుతుంది.

## కలలు – సరియైనవి – కానివి

ఏ కలలు సరియైనవి–ఏవి కావు–అన్న వివాదానికి మన పూర్వీకులు ఇలా చెప్పారు.

పగటి కలలకు, అతి చిన్నవి లేక అతి పెద్దవియైన కలలకు, మరచిపోయిన కలలకు, వాత పిత్త శ్లేష్మాది దోషాలవల్ల కలిగిన కలలకు ఫలితం ఉండదు. అంటే వాటిని సరియైన కలలుగా స్వీకరించకూడదు. వాటికి ఫలితాలు వర్తించవు.

## బృహస్పతి వివరణ

ఈ క్రింది కలల్ని ఫలితాలు వర్తించని వాటిగా నిర్ణయించారు దేవగురువు బృహస్పతి మహాశయులు.

1. మరచి పోయిన కల.
2. చెడ్డగా ప్రారంభమై క్రమక్రమంగా మంచిగా మారిన కల.
3. వాతపిత్తాది దోషాలవలన కలిగిన కల.
4. అతిగా ఆలోచించిన కారణంగా అదేవిధంగా వచ్చిన కల.
5. పగటి కల.

# 1. అక్షరములు

కొందరికి కలలో ఇంగ్లీషు అక్షరములు కనిపించ వచ్చు. ఒక్కో సారి A, B, C, D.... లతో ప్రారంభ మయ్యే ఓ మాట కనిపించవచ్చు. దాన్ని A, B, C, D గా తీసికొని క్రింది ఫలితాలను చూసుకోవాలి. అంతే కాకుండా తెలుగులో ఏదైనా అక్షరంకాని, మాటకాని కనిపిస్తే ఆ శబ్దానికి దరిదాపుల్లో వుండే ఇంగ్లీషు అక్షరపు ఫలితాన్ని స్వీకరించ వచ్చు.

అనుకున్న పనిని సాధించ గలుగుతారు. అడకోకుండా మీ మిత్రులో, బంధువులో సహకరించి మీ పనిని తమదిగా భావించి, దాన్ని పూర్తిచేసి పెడతారు. వ్రాత అక్షరాల్లోని 'a' కలలో కనబడితే ఇంకా త్వరగా పని పూర్తి అవుతుంది.

మీ దేహానికి నునుపు, మెరుపు ఏర్పడుతాయి. ఏదైనా వ్యాధి ఉన్నట్లయితే అది పోయి స్వస్థత చేకూరుతుంది. ఆరోగ్యకరమైన అలవాట్లు ఏర్పడుతాయి. దుర్వ్యసనా లేవైనా వుంటే మానుకుంటారు.

C

మిమ్మల్ని స్నేహితులు, బంధువులు, సహాయం అడుగుతారు. మీకు చేతనైనంత వరకు మంచి చెడులు ఆలోచించి సహాయ పడతారు. మీ సహాయం మీకు కీర్తిని తెచ్చిపెడుతుంది.

# N

కలసివుంటే కలదు సుఖం. దూరమైతే తీరని దుఃఖం అంటూ మీరు ఐక్యత కోసం పాటుబడి దూరమైన వారిని దగ్గరకు చేర్చి మీ మంచితనాన్ని, సమర్థతను నిరూపించు కుంటారు.

# O

వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. మిత్రులతో కలసి జల్సా చేస్తారు. ప్రేమించిన వారితో సినిమాలకు, షికార్లకు వెళ తారు. ఒకరి మనసు నొకరు తెలుసుకొని ప్రేమను పెంచుకుంటారు.

# P

మీరు ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా కొంపలు అంటుకునే ప్రమాదముంది. తీరని నష్టానికి గురి అవుతారు. చాలా జాగ్రత్తగా వుండాల్సిన కాలము.

# Q

అర్థం పర్థం లేని మాటలతో తగాదాలు పెరుగుతాయి. అను కోని యిబ్బందులు, చికాకులు, చిక్కులు, సమస్యలు ఎదురు అవుతాయి. అయినా ధైర్యంగా నిలిచి వాటిని కాచుకుంటారు.

# R

ఎవరో చేసిన చెడ్డపని మీరే చేశారన్న వదంతి ఏర్పడవచ్చు. అపనిందలతో అపకారము చేయటానికి మీ శత్రువులు సిద్ధపడవచ్చు. జాగ్రత్తగా వ్యవహరించ వలసిన సమయం. చేతనైనంత వరకు తప్పిం చుక తిరగడం మంచిది.

# S

సంఘంలో పరువు, ప్రతిష్ఠలు ఏర్పడుతాయి. కుటుంబంలో కూడా పెద్దరికం, గౌరవం ఏర్పడుతుంది. మీకు సంతానంవల్ల ఎంతో సుఖం కలుగుతుంది.

# T

శ్రేష్ఠమైన కాలం రానున్నది. మీ మంచితనానికి గుర్తింపు, రాణింపు ఏర్పడుతాయి. మీకంటే అన్ని విధాల అధికులైనవారు కూడా మీ ఆశ్రయాన్ని, సహాయాన్ని అర్థించి మీ చుట్టూ చేరుతారు. అన్ని విషయాలలో మీది ముందంజగా వుంటుంది. సఫలీకృతు లౌతారు.

మీ వలన మీ కుటుంబానికి, మిమ్మల్ని నమ్మినవారికి, మీతో స్నేహం చేసినవారికి అందరికీ మేలు జరగటమే గాకుండా వ్యక్తిగతంగా మీకూ మంచి భవిష్యత్తు వెదుక్కుంటూ వస్తుంది.

# V

ఎంతో ఆశగా, శ్రద్ధగా ప్రారంభించిన పనులపైన ఎందుకనో మీకు విరక్తి కలుగుతుంది. ప్రేమించిన వారిపై నిరాశ కలుగుతుంది. ప్రేమ విఫలం కావచ్చు.

# W

సంపదలు పెరుగుతాయి. పాడిపంటలు సమృద్ధిగా లభిస్తాయి. సుఖసంతోషాలు, ప్రశాంతత, సంతృప్తి ఏర్పడి ఆనంద డోలికల్లో హాయిగా వుంటారు.

# X

అకస్మాత్తుగా అనారోగ్యం కలుగవచ్చు. అపవాదులు ఏర్పడ వచ్చు. నమ్మినవారి వల్ల ద్రోహం జరుగవచ్చు.

రానున్నది మంచికాలం కాదు. స్నేహితులకు, ఆప్తులకు, ప్రేమించిన వారికి, ఆఖరుకు కన్నవారికి కూడ దూరము కావచ్చు. చాల జాగ్రత్తగా వుండటం ఉత్తమం.

# Z

మీకు దుఃఖాన్ని కల్గించేట్లు, మీ మనస్సు నొప్పించేట్లు మీ ఆత్మీయుల వద్ద నుండి వార్తలు అందవచ్చు.



# 2. ఆటలు

మీరు రకరకాల ఆటలు ఆడుతూ వుంటారు. చూస్తూ వుంటారు. అవి కలలో రావటమూ సహజమే! ఏ ఆట కలలోవస్తే ఏ ఫలితమో చూడండి!

## క్రికెట్

కలలో మీరు క్రికెట్ ఆడుతున్నట్లు కన్పిస్తే మీ ఆరోగ్యం మెరుగవుతుంది. జీవితాన్ని సవాల్‌గా తీసుకుని బాగుపడటానికి నిరంతరం కృషిచేసి విజయాన్ని పొందుతారు. ఎవరి ఆటనో చూస్తే కుటుంబ సుఖసంతోషాలు పెరుగుతాయి.

## టెన్నిస్

దీన్ని ఆడుతున్నట్లు కలగంటే సంఘంలో మీ పలుకుబడి బాగా పెరుగుతుంది. ఎవరో ఆడుతుంటే మీరు చూస్తే మీ వ్యాపార ఉద్యోగాలలో సత్ఫలితాలు కలుగుతాయి.

## టేబిల్ టెన్నిస్

ఇది ఆడినట్లు కలగంటే క్రొత్త ఉద్యోగం లభించటమో, క్రొత్త వ్యాపారం ప్రారంభించటమో, క్రొత్త ప్రదేశానికి నివాసం మార్చటమో జరుగుతుంది. ఎవరో ఆడుతున్నట్లు చూస్తే బాధ్యతలు పెరుగుతాయి.

## ఫుట్ బాల్

ఫుట్‌బాల్ ఆడుతున్నట్లు కలగంటే పదంటే డబ్బు దొరుకుతుంది. ఎవరి ఆటనైనా మీరు చూస్తున్నట్లు కలగంటే మీచుట్టూ కాకా రాయుళ్లు, కోతలరాయుళ్లు చేరి చిక్కులు తెచ్చిపెడతారు. మిత్రులెవరో, శత్రులెవరో తెలుసుకోగల వివేకం అలవడుతుంది.

## బాస్కెట్ బాల్

ఇది ఆడినట్లు కలగంటే మీ ప్రేమ వ్యవహారాల్లో మీరు గట్టి పోటీని ఎదుర్కొంటారు. మీ ప్రత్యేకతను నిరూపించుకుని విజయం సాధిస్తారు. చూచి నట్లయితే ఆశాభంగం కలుగుతుంది. అనుకున్నవి ఫలించవు.

## జూదం

కలలో జూదం ఆడటం కన్పిస్తే మీ భవిష్యత్తుకు గట్టి పునాది ఏర్పడుతుంది. జూదంలో నష్టం వచ్చినట్లు కలగంటే మీ జీవన విధానంలో మంచి మార్పులు వస్తాయి. జూదంలో గెల్చినట్లు కలవస్తే కష్ట నష్టాలు పెరుగుతాయి. నష్టపోయినట్లు కలగంటే తాత్కాలిక విజయాలు లభిస్తాయి, జూదంలో పందెం కట్టినట్లయితే మీ డబ్బును ఎవరన్నా కాజేయటానికి ప్రయత్నించే పక్షంలో కాపాడు కోలేరు.

## చదరంగం

కలలో ఇద్దరు మగవాళ్లు చదరంగం ఆడితే మీ ఆదాయం తగ్గిపోతుంది. ఆడ, మగ ఆడుతుంటే సాంసారిక జీవితం ఇబ్బందుల పాలవుతుంది. ఇద్దరు ఆడవాళ్లు ఆడుతున్నట్లు కలగంటే కుటుంబంలో అశాంతి ఏర్పడుతుంది.

## రేస్

గుర్రప్పందేలలో డబ్బు కట్టినట్లు కలగంటే చేయబోయే వ్యాపారంలోగాని, ఉద్యోగంలోగాని నష్టం కలుగుతుంది. గెలిచినట్లు, డబ్బు అందుకున్నట్లు కలవస్తే భయాందోళనలు ఏర్పడుతాయి. ఓడిపోయి, డబ్బు పోగొట్టు కుంటే జీవితంలో గొప్పమార్పు వస్తుంది.

## పజిల్

కలలో పజిల్ పూర్తిచేసి పంపినట్లయితే మీరు చవకబారు సుఖాలకు బానిసై ఆరోగ్యం పాడు చేసుకుంటారు. పజిల్ పూర్తిచేయలేక పోయినట్లు కలగంటే ఏదో రహస్యాన్ని ఇంతకాలం మనసులో దాచుకున్నదాన్ని బయటపెట్టి పరువు పోగొట్టుకుంటారు. సరిగా పూర్తి చేసి, గెల్చి, డబ్బు సంపాదిస్తే మీలో ఆత్మవిశ్వాసం, ఆలోచనాశక్తి పెరిగి బాగుపడతారు.

## స్కేటింగ్

మీరు మంచుపైన స్కేటింగ్ చేస్తున్నట్లు కలగంటే మీరు ఎదురుచూసే శుభవార్తలు అతి త్వరలో అందుతాయి. ఎవరో ఆడుతున్నట్లు కన్పిస్తే వినోద కాలక్షేపం చేస్తారు. ఏ చెరువులోని నీరైనా గడ్డకట్టి మంచుగా మారి దానిపై స్కేటింగ్ చేస్తున్నట్లు కలలో కాస్తే మీరు మంచి రచయిత అవుతారు. డబ్బు సంపాదిస్తారు.

## వామన గుంటలు

కలలో వామన గుంటలు ఆడుతున్నట్లు కన్పిస్తే మీకు పలుకుబడిగల వారితో పరిచయం కలుగుతుంది. తద్వారా కొన్ని ఘన కార్యాలు సాధిస్తారు. కాని శాంతి సుఖం వుండవు. ఎవరన్నా ఆడుతున్నట్లు కలగంటే జీవితంలో మార్పుకోసం కృషిచేస్తారు.



# 3. ఆయుధాలు

మీ కలలలో కత్తి, తుపాకీ, బాకు లాంటివి కనిపించవచ్చు. వీటిని ఆయుధ సామగ్రి అంటారు. ఇవి కలలో కన్పిస్తే ఫలితా లెలా వుంటాయో చూడండి.

## కత్తి

ఇది కలలో కన్పిస్తే మీరు వేర్పాటు ధోరణి నవలం బిస్తారు. భార్యాభర్తలు విడిపోవచ్చు. ఉమ్మడి కుటుంబం చీలి పోవచ్చు. వ్యాపారం చేస్తున్న మిగతా భాగస్వాములతో పేచీ పడి విడిపోవచ్చు. కత్తితో పొడుచుకుని ఆత్మహత్య చేసుకున్నట్లు కలగంటే మీరు ఎవరి చేతనైనా మోసగింప బడవచ్చు. కత్తితో పొడుచుకునికూడా చావక పోతే మీరు ఊహిస్తున్న పనిని సక్రమంగా ముగించలేరని అర్థంచేసు కోవాలి. కత్తిని దాచినట్లు కలవస్తే ముందు ముందు మీకు కష్టాలు రావచ్చు. పెద్ద కత్తిని మీరు చూచినా, వాడినా మీచుట్టూ కట్టుకథలు ప్రచార మవుతాయి.

## మంగలి కత్తి

పాతరకం మంగలి కత్తిని మీరు కలగంటే పాతచింతకాయ పచ్చడి భావాలు గల వారితో పెండ్లి జరుగుతుంది. సేఫ్టీ రేజరుతో గడ్డం చేసుకున్నట్లు కలవస్తే మీ చురుకుదనానికి, శ్రద్ధకి పై అధికా రులు ముచ్చటపడి పై పదవికి సిఫార్సు చేస్తారు. మంగలి కత్తితో గాయపరచు కున్నట్లు కలగంటే ఏదో ఒక రహస్యం బయటపడి, అది మీ ద్వారానే జరిగినట్లు ఋజువై ఫలితం అనుభవించ వలసి వస్తుంది. దీనితో ఎవరితోనైనా పోట్లాడి గాయపరచినట్లు కలగంటే మీరు చాలా కాలం కష్టాల్లో మునిగి తేలవలసి వస్తుంది.

### ఖ డ్గ ము

యుద్ధాలలో ఉపయోగించే కత్తిని ఖడ్గం అంటారు. ఇది కలలో కన్పిస్తే శత్రుభయం ఏర్పడుతుంది. దీనితో ఎవరైనా మీ మీదికి వచ్చినా, మీతో యుద్ధంచేసినా మీరు మీ విరోధుల్ని జయిస్తారు. వారు మిమ్మల్ని చూస్తేనే భయపడతారు. మీరు ఖడ్గం చేత ధరించి ఎవరినైనా గాయపరిస్తే కష్టాల పాలవుతారు.

### బా కు

దీన్ని కలలో చూచిన వారికి అనుకోని తగాదాలు వస్తాయి. బాకుతో మీరు పొడవ బడినట్లు కలగంటే చెడువార్తలు వింటారు. మీరు ఎవరినైనా పొడిచి చంపితే పోట్లాటల్లో మీ ప్రత్యర్థులపై మీరు గెలుస్తారు. పోటీల్లో మీరే నెగ్గుతారు.

### క త్తె ర

మీరు కలలో కత్తెరను చూస్తే మీ భాగస్వామి తొందరపాటుతో మీనుండి విడిపోతారు. అవివాహితులకు కన్పిస్తే ప్రేమికులకు దూరమౌతారు. కలలో కత్తెరతో దేనినైనా కత్తిరిస్తే ప్రేమికులు పోట్లాడుకుంటారు. దంపతులు విడాకులు పొందుతారు.

### సు త్తి

ఇది కలలో కన్పిస్తే మీరు ఇన్స్యూరెన్సు చేస్తారు. మీరు సుత్తితో ఏదైనా పని చేస్తున్నట్లు కలగంటే ఎంతటి కష్టాలనైనా లెక్క చేయక, నిర్లక్ష్యంగా ముందుకు సాగి పనులు పూర్తి చేస్తారు.

### కొ డ వ లి

కలలో కొడవలి కన్పిస్తే చాలా కాలంగా పేచీపడి ఆగిపోయిన పనులు పూర్తవుతాయి. అవకాశాల్ని ఉపయోగించుకుని విజయం

సాధిస్తారు. కొడవలితో గడ్డి కోస్తున్నట్లు కలగంటే శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది.

గొ డ లి

కలలో ఇది కన్పిస్తే అకారణంగా అశాంతి ఏర్పడుతుంది. తెలియని దిగులు కలుగుతుంది. గొడ్డలితో పని చేస్తున్నట్లు కలగంటే ఇంట్లోగాని- బయటగాని మీ కృషిని మెచ్చుకుంటారు.. కీర్తిప్రతిష్ఠలు పొందుతారు.

క్ర ర - క ట్టె

నీటిలో తేలుతున్న కర్రను కలలోచూస్తే మీ కోర్కెలు ఫలించవు. కర్రను విరుగ గొట్టినట్లు కలగంటే మీ డబ్బు చేతులు మారుతుంది. ఇతరులు ఏదైనా కర్రను ముక్కలు ముక్కలు చేస్తున్నట్లు కల వస్తే మీకు ప్రాణాపాయం కలుగుతుంది. కట్టెల మోపును మోస్తున్నట్లు కలగంటే వృధా ఖర్చులు కలుగుతాయి. ఎవరైనా మోస్తుంటే దురదృష్టం కలుగుతుంది. కర్రల గుట్టను చూస్తే అదృష్టం వరిస్తుంది.

కొ ర డా

కలలో మీరు కొరడాతో కొట్టబడి దెబ్బలు తింటే మీకు ఏదైనా అవమానం జరుగవచ్చు. ఎవరినైనా కొడుతున్నట్లు కలగంటే అజాగ్రతవల్ల నష్టపోతారు. కోరి కష్టాలు తెచ్చుకుంటారు. కొరడా పట్టుకున్న స్త్రీ కన్పిస్తే అనారోగ్యం ఏర్పడవచ్చు.

బా ణ ము

ఇది కలలో కన్పిస్తే ఏదైనా ఉపద్రవం ముంచుకొస్తుంది. దాన్నుండి మిమ్మల్ని మీరు కాపాడుకోవటానికి తీవ్రంగా ప్రయత్నిస్తారు. బాణం గుచ్చుకున్నట్లు కలవస్తే ఏదైనా ప్రమాదం ముంచుకొచ్చి మీతెలివి తేటలతో దాన్ని సర్దుకుంటారు.

విల్లు

సరిగా గురిచూచి వింటి నుండి బాణాన్ని వదలినట్టు కలగంటే సునాయాసంగా డబ్బు సంపాదిస్తారు. పెట్టుబడి లేకుండానే లాభాలు వస్తాయి. ఏదైనా జంతువును గురిచూచి వింటి నుండి బాణం వదిలితే బాల్యస్నేహితులు మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తారు. గురి తప్పి బాణం వ్యర్థమైతే మీరు ప్రారంభించిన పని ఆగిపోవచ్చు.

అంపము

కలలో మీరు అంపాన్ని చూస్తే ఆస్తి పంపకాల విషయాల్లో మీకు అనుకూలంగా జరుగుతుంది. మీరు అంపంతో ఏదైనా కోస్తున్నట్లు కలగంటే ఏ ఆత్మీయుడో మీనుండి శాశ్వతంగా దూరంగావచ్చు. పదునులేని అంపంతో కోస్తున్నట్లు కలగంటే మీరు మీ శత్రువుల వ్యూహాన్నుండి బయటపడలేరు.

పిస్టల్

ఇది కలలో కన్పిస్తే అనవసరమైన తగవులలో చిక్కుకుంటారు. పేల్చినట్లు కలగంటే మీ శత్రువులు మిమ్మల్ని ఎదిరించలేక మీ వెనుక దుష్ప్రచారం కావిస్తారు. మీ శత్రువుకు గాని, మరెవరికి గాని గురి పెట్టి కాల్చలేకపోతే మీ చిక్కుల్నుండి బయటపడలేరు. కాల్చినట్లు కలగంటే సమస్యలు తీరిపోతాయి.

తుపాకీ

కలలో తుపాకీ కన్పిస్తే ప్రేమలో పడతారు. తుపాకీతో కాల్చినట్లు కలగంటే మీకో, మీవారికో జరుగవలసిన న్యాయం జరుగదు. ఎవరో కాల్చినట్లు కలవస్తే ఎదురు చూచిన ప్రధాన సమాచారం అందుకుంటారు. తుపాకి శబ్దం వింటే అశాంతి ఏర్పడుతుంది. తుపాకీని తీసుకుని వేటకువెళ్తే మిమ్మల్ని ఎవరన్నా ప్రేమిస్తారు.

## ఫిరంగి

ఇది కలలో కనిపించినవారు భయంతోను, ఆందోళనతోను దుఃఖపడతారు. ఫిరంగి ప్రేల్చినట్లు కలగంటే గౌరవము, కీర్తి కలుగుతాయి. ప్రేల్చిన శబ్దం వింటే శుభవార్తలు వింటారు.

## బాంబు

దీన్ని మీరు కలలో చూస్తే మీరు జరుగదు అనుకున్న పని ఊహించని విధంగా జరిగిపోతుంది. బాంబును ఎవరిపైననైనా విసరినట్లు కలగంటే మరికొందరితోపాటు మీరూ అనుమానింపబడి ఖైదుచేయబడవచ్చు. బాంబు ప్రేలినట్లు కలగంటే అనుకోకుండా ప్రమాదంలో చిక్కుకుంటారు. అయినా జాగ్రతగా బయటపడ గలుగుతారు.

## అణుబాంబు

ఇది కలలో ఏ విధంగా కనబడినా అనేక చిక్కు సమస్యలు మిమ్మల్ని చుట్టుముట్టి అశాంతికి గురిచేస్తాయి.

## డైనమైట్

ఇది ప్రేలటం కలలో చూస్తే మీరు ఊహించిన ప్రకారం పనులు జరుగవు. ఎవరైనా దీన్ని రహస్యంగా ప్రేల్చటానికి ఏ రహస్య ప్రదేశంలోనో ఉంచటానికి ప్రయత్నిస్తున్నట్లు కలగంటే మీకు రానున్న ప్రమాదం తప్పిపోతుంది. అది ప్రేలుతున్న శబ్దం వింటే తాత్కాలికంగా అశాంతి ఏర్పడుతుంది. ఆ ప్రేలుడు మందువల్ల ఎవరైనా గాయపడినట్లు కలగంటే సునాయాసంగా బాధల్నుండి బయటపడతారు.

# 4. ఆహారపదార్థాలు - వగైరా

## పాలు

స్వప్నంలో పాలను చూస్తే ఎంతో ఆనందం కలుగుతుంది. మరిగే పాలనుచూస్తే ఏదో అవుతుందని లేనిపోని అనుమానంతో మథనపడ్తారు. పాలు ఒలికిపోయినట్లు కలలో కనిపిస్తే ఫలితం ఇదే. పాలు త్రాగుతున్నట్లు స్వప్నంలో చూస్తే బంధుమిత్రుల అభినందన లభిస్తుంది.

## చేపల పులుసు

కలలో ఈ చేపల పులుసును చూస్తే వ్యాపారంలో అన్నివిధాల అభివృద్ధి లభిస్తుంది. తిన్నట్లు కన్పిస్తే ప్రేమ వ్యవహారాలలో చిక్కులు వస్తాయి. మరొకరు ప్రేమించిన యువతితో సంబంధం పెట్టుకొనుటవల్ల వివాదాలు వస్తాయి. చల్లగావున్న పులుసు తింటున్నట్లు కలగంటే మీపై ఇతరులకు అనాదరణ పెరుగుతుంది. వేడిగా ఉన్నప్పుడు తింటున్నట్లు కలగంటే తీరిక లేకుండా శ్రమించి అనుకున్నది సాధిస్తారు.

## గోధుమలు

కలలో గోధుమ బస్తాలను చూస్తే ఎంతటి కష్టమైన శ్రమతో కూడిన పనైనా మీరు శ్రమించి సాధిస్తారు. పొలంలోని పంటను కలలోచూస్తే మీజీవితం పైలావచ్చేసునుగా సాగిపోతుంది. భోగభాగ్యాలకు లోటువుండదు.

## బియ్యం

కలలో బియ్యం చూచినవారికి నాలుగురకాల సంపాదన ఏర్పడుతుంది. పొలంలోని పంటను చూస్తే వినోద విలాసాలకు ఎక్కువగా

ఖర్చు చేసి ఎక్కడికైనా పోవడానికి సిద్ధపడతారు. తలంబ్రాలు విహార్యాన్ని కలలోచూస్తే మీకుటుంబ సభ్యుల నుండి శుభవార్తలు అందుతాయి.

జనుము

బాగా పెరుగుతున్న జనుపచేను కలలో కన్పించిన వారికి నలుగురిలో ప్రతిష్ఠ, పలుకుబడి పెరుగుతాయి.

ధాన్యం

స్వప్నంలో నిండుగావున్న ధాన్యాగారంచూస్తే మీకు త్వరలో ధనప్రాప్తివుంది. ధాన్యాగారం ఖాళీగా కన్పిస్తే దరిద్రం ఏలాంటిదో త్వరలోమీరు చవిచూడబోతారు. నిండుగా పండినచేనును కలలోచూస్తే వివాహంకాకపోతే వివాహం జరుగుతుంది. అయినవారికి సుఖసంతోషాలు హెచ్చుతాయి. పంట కంకుల నుండి గింజలు తిన్నట్లు కలకంటే వృత్తివ్యాపారాలలో అధికంగా లాభాలు లభిస్తాయి.

పిండి

కలలో ఎవరైనా పిండిని విసురుతున్నట్లు కన్పిస్తే ఇంట్లోవారి కన్నా బయటివారే మిమ్మల్ని ఆకర్షించి ఎక్కువ సంతోషాన్ని కల్గిస్తారు. మీరు పిండిని విసరుతున్నట్లు కలలోచూస్తే మీరు బయటివారిని సంతోషపెడతారని గుర్తు. కలలో కేవలం పిండినేచూస్తే మీరు అల్ప సంతోషులవుతారు. ఏకొద్దిసుఖానికైనా సంతృప్తి పొందుతారు.

రొట్టె

కలలో దీనినిచూస్తే మీకు మిత్రులవల్ల ఎంతోలాభం కలుగుతుంది. రొట్టె గట్టిగావున్నట్లు కన్పిస్తే మీరు ప్రతిదానికి ఎంతో శ్రమించాల్సివస్తుంది. మీకు ఆకలిగా వున్నప్పుడు మరొకరు రొట్టెతింటున్నట్లు కలకంటే మీ వెనుకవచ్చినవ్యక్తి మీకన్నా పైపదవికి చేర్తాడు. మీరు

రొట్టెచేస్తున్నట్లు కలగంటే మీకు త్వరలో శుభవార్తలు అందుతాయి. ఎండిన రొట్టెను చూస్తే మీకు అనారోగ్యమో, విచారకరమైన వార్తలు అందటమో జరుగుతుంది. పుట్టినరోజు కేక్ తయారు చేస్తున్నట్లు కలగంటే మీరు జీవితంలో ఉన్నత శిఖరాలకు చేర్తారు. మరెవరో రొట్టెను చేస్తున్నచోట మీరు వున్నట్లు కలగంటే మీకు ఘనవిజయం కల్గుతుంది.

## భోజనం

అవివాహితురాలైన యువతి హోటల్లో తనస్నేహితురాలితో భోజనం చేస్తున్నట్లు కలగంటే త్వరలో వివాహం జరుగుతుంది. మిగిలినవారు అలా కలగంటే బంధుమిత్రులతో అభిప్రాయభేదాలు వస్తాయి.

## ఇడ్లీ

ఇడ్లీని లేక అవిరికుడుమును తింటున్నట్లు కలలో కన్పిస్తే మీకు భోగభాగ్యాలు కలుగుతాయి.

## మిఠాయి

కలలో దీనిని తింటున్నట్లు కన్పిస్తే మీకు అప్పుల నుండి పిలుపు వస్తుంది. మిఠాయి మీ బంధుమిత్రులకు పంపుతున్నట్లు కలగంటే మీ ఆప్తమిత్రులు మీపైన అకారణంగా నిందలు మోపుతారు. దీనిని తయారు చేస్తున్నట్లు కలగంటే అనవసరపు ఖర్చులు ఎక్కువవుతాయి.

## పాలకోవా

కలలో దీనిని తింటున్నట్లు కన్పిస్తే మీకు సంపూర్ణ ఆరోగ్యం, పనులలో విజయం లభిస్తాయి. దీనిని ముక్కలుగా కోస్తున్నట్లు కలలో కన్పిస్తే మీకు శస్త్రచికిత్స జరిగే సూచన లున్నాయి. పాలకోవాను చేస్తే మీకు ఏపనిలోనైనా విజయం తథ్యం.

O 2

## చాక్లెట్

కలలో దీనిని చూచినా, తిన్నా, మీ దేహారోగ్యం మెరుగవుతుంది. మీరు దీనిని ఎవరికైనా యిస్తే వారితో మీకు స్నేహం వృద్ధి అవుతుంది. ఇతరులెవరు మీకు యిచ్చినట్లు కలగంటే వారు మీ స్నేహం కోసం ప్రాకులాడుతారు.

## పంచదార

పంచదార కలలో కన్పించినా, తిన్నా ఎంతో క్లిష్టమైన కార్యాలలో తల దూర్చాల్సి వస్తుంది. కాని మీ మిత్రుల సహాయంతో వాటిని సాధించ గల్గుతారు.

## కాఫీ

కలలో కాఫీని మీరు త్రాగుతున్నట్లు కన్పిస్తే మీరు వినోద విలాసాలలో పాల్గొంటారు. కాఫీ కలలో ఒలికిపోయినట్లు కన్పిస్తే ఏదో ప్రయత్నం విఫలమై నిరాశ చెందుతారు.

## టీ

కలలో టీని త్రాగుతున్నట్లు కన్పిస్తే వినోద కాలక్షేపం కల్గుతుంది. దీనిని అటు యిటూ కలియ పోస్తున్నట్లు కలలో కన్పిస్తే మీ యింటికి అతిథులు వస్తారు.

## 77 (డబుల్ సెవెన్ డ్రింక్)

కలలో మీరు 77 ను యితరులకు త్రాగడానికి యిస్తే మీకు నమ్మకస్థులైన స్నేహితులు లభిస్తారు. మీరే త్రాగితే ప్రభుత్వ ఆదరణ లభిస్తుంది.

## మంచుగడ్డ

మంచుగడ్డతో చేసిన ఐస్‌క్రీమ్ తిన్నట్లు కలగంటే మీరు బాలబాలికలతో వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. ఎర్రని ఎండలో మంచుగడ్డను కలలో చూస్తే మీరు చేసే పనిలో శ్రమ తప్ప ఏమీ మిగలదు. మంచుగడ్డ మీపై పడితే ఏదో ప్రమాదం ముంచు

కొస్తుంది. మంచంలో జారినట్లు కలగన్నా ఇదే ఫలితం. మంచుగడ్డను పగలకొడుతున్నట్లు కలలోచూస్తే శత్రువులవల్ల భయం ఏర్పడుతుంది. మజ్జిగలో గాని, తీయని పానీయంలో కాని మంచుగడ్డను వేస్తున్నట్లు కలగంటే ఏవో కష్టాలు మీ కోసం ఎదురుచూస్తుంటాయి.
గ్లాసులో వేసుకొని త్రాగినట్లు కలకంటే నరాల బలహీనత ఏర్పడ వచ్చు.

### జంతికలు

కలలో జంతికలు రావటం కష్ట సూచకం. మీరు చేద్దామను కొన్నపనిని మరొకరు చేయటం, లాభం పొందటం జరిగి పోతుంది.

### బతాణీగింజలు

కలలో బతాణీలు తిన్నట్లు కన్పిస్తే మీ దురుసుతనంవల్ల బంధు మిత్రులు దూరం అవుతారు. గింజలపై పొట్టు వొలిచినట్లు కలవస్తే కొత్తలరాయుడితో స్నేహం ఏర్పడుతుంది. బతాణీ గింజలు ఉన్న డబ్బాగాని, సీసాగాని మూత తెరిచి తిన్నట్లు కలగంటే మీ కుటుం బంలో కలహాలు తలయెత్తి శాంతి నశిస్తుంది.

### జీడిగింజలు

కలలో వీనిని చూస్తే అనుకోకుండా మోసపోతారు. వీనిని తిన్నట్లు కలగంటే సాహసంతో కూడిన పనులలో జయం కలుగు తుంది. చెడిపోయిన గింజల్ని కలలో చూస్తే నిరాశ ఎదురవుతుంది. వీనిని పగలగొట్టున్నట్లు కలగంటే పనులు ఆగిపోతాయి.

### షర్బతు

కలలో దీనిని త్రాగినట్లు కన్పిస్తే వృత్తి లేక వ్యాపారాలలో మార్పు రావాలని తపన ఏర్పడుతుంది. మీరు చేస్తున్న పనిలో తృప్తి పడకపోవచ్చు. షర్బతు చేస్తున్నట్లు కలగన్న మీకు అప్పులతో తగా దాలు వస్తాయి.

# 5. ఇల్లు - వాకిలి - వగైరా

ఇల్లు

కలలో మీకు కనిపించిన యిల్లు మీదే అయినా లేదా ఇంటిని మీరు కొన్నట్లు చూచినా మీరు మంచి వున్నత స్థానాన్ని పొందుతారు. బాధలు, కష్టాలు మిమ్మల్ని విడిచి పారిపోతాయి.

కిటికీ

కలలో తెరచివున్న కిటికీ కనిపిస్తే మీకు శాంతి సుఖాలు లభిస్తాయి. అది మూసివున్నట్లు కలగంటే కష్టాలు, బాధలు రోజు రోజుకీ పెరుగుతాయి. కిటికీలోకి ఎక్కినట్లు కలగంటే మీరు డబ్బు నష్టపోతారు. కిటికీ వూచలగుండా ఎక్కడో చూస్తున్నట్లు కలగన్నచో క్రొత్త వ్యక్తులతో స్నేహానికి ఎదురు చూస్తారు. కిటికీ చువ్వల వెనుక నిల్చినట్లు కలలో కన్పిస్తే మీరు విదేశాలకో, దూరప్రాంతాలకో ప్రయాణం అవుతారు.

గోడ

ప్రహరీగోడ కలలో కన్పిస్తే మీ పనులకు ఆటంకాలు కలుగుతాయి. దానిమీద నిల్చినట్లు కలగంటే మీ పనులు నిర్విఘ్నంగా సాగిపోతాయి. ఎక్కినా ఇదే ఫలితం. గోడమీదనుండి పడినట్లు కలగన్నచో మీ పనులు కుంటినడక నడుస్తాయి. ఎన్ని రోజులు శ్రమించినా ఫలితం ఉండదు.

తలుపు

కలలో యింటి తలుపులు మూసివున్నట్లు కన్పిస్తే మీరు చేజేతులా అవకాశాలు జారవిడుస్తారు. తలుపులు బార్లా తెరచినట్లు కన్పిస్తే

లభించిన అవకాశాలు సద్వినియోగం అవుతాయి. మీకు మంచి అవకాశాలు లభిస్తాయి.

## గేటు

గేటు మూసినట్లు దానిలోనుండి మీరు బయటకు రావటానికి ప్రయత్నిస్తున్నట్లు కలవస్తే మీ పనులు కష్టసాధ్యా లవుతాయి. గేటు తెరచి ఉన్నప్పుడు మీరు బయటకు వచ్చినట్లు కలగన్నచో మీ భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది. కలలో గేటు దూకి మీరు రహస్యంగా లోపల ప్రవేశిస్తే రహస్య ప్రేమకలాపం సాగిస్తారు.

## అలంకరణ

ఇంటిని అలంకరిస్తున్నట్లు కలలో కనిపించిన వారికి శుభాలు కలుగుతాయి.

## మేడ

మేడపై కూర్చొని ఉన్నట్లు కలగంటే స్నేహితులవల్ల లాభాలు పొందుతారు. అది కూలిపోయినట్లు కలగంటే మీ ఆశలు నెరవేరవు. మేడ మీదనుండి పడినట్లు కలగన్నా ఫలితం ఇదే. మేడ క్రింది భాగాలలో మీరు కాపురమున్నట్లు కలకన్నచో మీరు అధికంగా డబ్బు సంపాదిస్తారు. మేడమెట్లు ఎక్కి పైకిపోయినట్లు కలగంటే మీ కుటుంబానికి సుఖశాంతులు వుంటాయి. పైనుండి మెట్లు మీదుగా దొర్లిపడితే కుటుంబ కలహాలు ఏర్పడుతాయి. మెట్లు తుడుస్తున్నట్లు లేక కడుగుతున్నట్లు కలవస్తే మీరు చేపట్టినదంతా బంగార మవుతుంది. ఎన్నో విధాల అభివృద్ధి సాధిస్తారు.

## ఇంటికప్పు

మీ యింటికప్పు గాలికి లేచిపోయినట్లు కలగన్నచో అశుభ వార్తలు రాగలవు. కప్పుమీదికి ఎక్కినట్లు కలగంటే మీరు ప్రమా

దంలో చిక్కుకుంటారు. దానిమీద నిల్చున్నట్లు కలవస్తే పదిమంది మన్నన కలుగుతుంది. ఇంటికప్పుమీద పనిచేయటం కలలో కన్పిస్తే మీ కుటుంబములో సుఖశాంతులు లభిస్తాయి. దానిమీదనుండి క్రిందకు పడి మీకు గాయాలు తగిలినట్లు కలగంటే మీకు ప్రమాదం ఏర్పడినా చెక్కుచెదరకుండా బయటపడతారు. దెబ్బలు తగిలినట్లు కలగంటే మీకు అనారోగ్యం కలుగుతుంది.

## గ ది

కలలో మీరు చిన్న యిరుకైన గదిలో వున్నట్లు కన్పిస్తే మీ బంధు మిత్రులతో కలహాలు వస్తాయి. అదే పెద్ద గదిగా ఉంటే సకల శుభాలు కలుగుతాయి. మీ ధన సంపాదన పెరుగుతుంది. గదిలోకి వెళ్తున్నట్లు కలగంటే స్త్రీకి పురుషునితోను, పురుషునికి స్త్రీతోను మాట పట్టింపులు వచ్చి వివాదాలు కలుగుతాయి. గది గుండ్రంగా ఉండి తిరుగుతున్నట్లు కనిపిస్తే మీ అదృష్టం పారిపోతుంది.

## ప డ క గ ది

మీ పడకగది కలలో కన్పిస్తే మీ కోర్కెలు ఫలించవు. ఆ గది అద్భుతంగా, వింతగా వుంటే అనుకోని విధంగా క్రొత్త వ్యక్తులతో స్నేహం పెరుగుతుంది. పరులు మీ పడక గదిలో మాట్లాడుకొంటూ వున్నట్లు కలగంటే మీ పనులు వృథాశ్రమకు గురి అవుతాయి. చికాకులు కలుగవచ్చు. ఎవరో మీ పడకగదిలో మాట్లాడుకుంటున్నట్లు మీరు దూరంనుండి విన కలిగినట్లు ఉంటే మీ పైఅధికారులవలన నష్టం కలుగుతుంది. పరుల పడక గదిలోకి వెళ్ళినట్లు మీరు కలగంటే అనారోగ్యం కలుగుతుంది. మీ పడకగదిలో నేలమీద మీ దంపతులు నగ్నంగా దొర్లుతున్నట్లు కలగంటే సత్సంతానం కలుగుతుంది.

## భ వ న ం

ఆకాశాన్ని అంటుతున్నట్లున్న
మీరు దురాశతో ఏదో కానిపని చేస్తారు. భవనాన్ని నిర్మిస్తున్నట్లు కలగంటే నలుగురిలో మీకు గౌరవం లభిస్తుంది. దాన్ని కలలో చూస్తే ధనలాభం కలుగుతుంది. పాడుబడిన భవనం కలలో కన్పిస్తే మీకు విచారం కలిగే సంఘటనలు జరుగుతాయి. మీరు పెద్ద భవనంలో కుటుంబంతో వున్నట్లు కలగంటే మీకు ఆనందం కలిగించే సంఘటనలు ఎదురవుతాయి. అది కూలినట్లు కలగంటే మీ ఆశలు ఫలించవు.

## ఇ సు క

స్వప్నములో ఇసుకను చూడటం మంచిది కాదు. మీ జీవితములో ఒడుదుడుకులు ఏర్పడతాయి. దానితో ఆడుతున్నా, దానిపై పడుకొన్నా మీ వృత్తి వ్యాపారాలు తల్లక్రిందు లయ్యే పరిస్థితి ఏర్పడ వచ్చు.

## ఇ టు క లు

ఇవి కలలో కన్పించటం మంచిది. చూడటంవల్ల వృత్తి వ్యాపారాలలో ప్రశాంతత ఏర్పడుతుంది. ఇటుకల్ని తయారుచేయటం కలలో చూస్తే వృత్తి వ్యాపారాలలో అధిక లాభాలు వస్తాయి.

## పొ గ గొ ట్టం

పొగగొట్టాన్ని శుభ్రం చేస్తున్న మనిషిని మీరు కలలో కల్సి కాని మాట్లాడితే సుఖసంతోషాలు లభిస్తాయి. ప్రేమికుల ఆశలు ఫలిస్తాయి. పొగ గొట్టం కలలో కన్పించినా ఫలితం ఇదే. నల్లటి పొగ దానిలోనుండి వస్తున్నట్లు కలగంటే విచారకరమైన వార్తలు వింటారు. అదే తెల్లగా ఉంటే సుఖాలు లభిస్తాయి. నల్లటి, తెల్లటి పొగలు

మరెక్కడి నుంచయినా వస్తున్నట్లు కలగన్నా పై ఫలితాలే కలుగుతాయి.

## చ లి మ ం ట

కలలో చలిమంట చూస్తే మీ విచారాలు దూర మవుతాయి. ఆరిపోయిన బూడిద చూస్తే మీకు బాధలు, దుఃఖము ఎక్కువవుతాయి. చలికాచుకుంటూ ఏ పత్రికో, పుస్తకమో చదువుతున్నట్లు కలగన్నచో మీకు దూరప్రాంతాలనుండి వచ్చిన బంధు దర్శన మవుతుంది.

## కా గ డా

కలలో కాగడాను చూస్తే కలహాలు రాగలవు. దాన్ని వెలిగిస్తే వృత్తి వ్యాపారాదులలో మంచి ఉన్నతి లభిస్తుంది కాగడాను చేతపట్టి నడుస్తున్నట్లు కలగంటే ఎదురుచూడని మీ ప్రేమ ఫలిస్తుంది.

## క న్న ము

ఇంటికి కన్నము వేస్తున్నట్లు కలగంటే జాగ్రత్తగా ఉండటం మంచిది. దానిగుండా వచ్చినట్లు కలగంటే మీ మీద ఎవరో కుట్రచేసి మీకు కష్టం కలిగిస్తారు. మీరు కన్నం వేసినట్లు కలగంటే చెడ్డపేరు తెచ్చుకుంటారు.

## భూ గృ హ ం

మీరు భూ గృహంలోనికివెళ్ళి కూర్చునట్లు కలగంటే మీకు జయం లభించదు. విచారం కలుగుతుంది. దాని మధ్య నిలిచినట్లు, దాన్ని ఏవో వస్తువులతో నింపినట్లు కలగంటే మీ వృత్తి వ్యాపారాదులపై మీకు నమ్మకం పోతుంది. నష్టాలు వస్తాయి.

## కు టు ం బ ం

ఒక కుటుంబాన్ని సంతోషంగా ఉన్నట్లు కలగంటే మీకు విదేశాలకో, దూరప్రాంతాలకో ప్రయాణం తప్పదు. కుటుంబములోని

వారు బాధల్లో ఉన్నట్టు కలగన్నచో మీకు కష్టాలు వస్తాయి. రాజకీయ వాదులకు పతనం కలిగి విచారం అధిక మవుతుంది.

## ఇరుగు పొరుగు

ఇరుగు పొరుగు వారితో వివాదాలకు దిగినట్లు మీరు కలగంటే మీ పనులలో చికాకులు కలిగి నష్టపోతారు. వారికి సహాయం చేసినట్లు కలగంటే ఎక్కడినుండో ఆస్తి వచ్చి కలుస్తుంది. అనుకోని ఆదాయం పెరుగుతుంది.

## రోడు

ఇళ్ళ మధ్యగా నేరుగా పోతున్న రోడ్డును కలలో చూస్తే మీకు అదృష్టం కలుగుతుంది. అదే వంకర టింకరగా ఉంటే శ్రమపడి మీరు మీ పనిని సాధిస్తారని సూచన. ఎన్ని వంకరలుంటే అన్ని కష్టాల్ని ఎదుర్కోవాల్సి వస్తుంది.

## ఇనుప ముళ్ల తీగె

కలలో యినుపముళ్ళ తీగెను పురుషులు చూస్తే వారి చుట్టూ అందాల బాలలు తిరుగుతారు. ప్రేమను పొందుతారు. ఆడవారు కలలో చూస్తే వారిని చాలామంది ప్రేమిస్తారు. చెంగు తగిలినా చా లని ఎగబడతారు. కాని వారిలో ఒక్కర్నే ఎన్నుకోవటం జరుగుతుంది.

# 6. కళలు - తత్సంబంధములు

మనకు అరువది నాలుగు కళలున్నాయి. మనసుకు ఉల్లాసాన్ని కలిగించే కళల్ని లలిత కళలు అన్నారు. సంగీతము, సాహిత్యము చిత్రలేఖనం ఇలాంటివి లలిత కళలు. ఏ రకమైన కళ కలలోకి వచ్చినా, ఏ కళాకారుణ్ణి కలగన్నా, లేక ఆ కళకు సంబంధించినవి కలలో కన్పించినా ఫలితాలు ఎలా వుంటాయో చూడండి!

## సంగీతం

కలలో వీనుల విందైన సంగీతాన్ని వింటే మీకు మంచి రోజులు వస్తాయి. అపశ్రృతులతోను, అపస్వరాలతోను కర్ణకఠోరంగా వున్న సంగీతాన్ని విన్నట్లు మీకు కలవస్తే పదే పదే మీకు సమస్యలు తెచ్చి పెట్టే స్నేహితులు తటస్థపడతారు. వారివల్ల మీకు అసంతృప్తి, వృధా ప్రయాసలు తప్పనిసరి అవుతాయి. మీరు ఒక పాటకు స్వర కల్పన చేసుకుని శాస్త్రీయంగా గానం చేసినట్లు కలగంటే మీ కుటుంబంలో సుఖ శాంతులు నెలకొంటాయి. అర్థం పర్థంలేని సంగీతాన్ని కలలో వింటే అనవసర ఖర్చులు చేస్తారు.

## గీతం (పాట)

వాయిద్య సంగీతం లేకుండా కేవలం ఎవరో పాటను పాడు తున్నట్లు కలగంటే సాధారణంగా ఆ పాటనుబట్టే ఫలితంకూడా వుంటుంది. అది సంతోష గీతమైతే సంతోషం కలుగుతుంది. విషాదగీతమైతే విచారం కలుగుతుంది. మీరే పాట పాడుతున్నట్లు లేదా కూనిరాగం తీస్తున్నట్లు కలగంటే మిమ్మల్ని ఎవరో సాధించటానికి

ప్రయత్నిస్తారు. నలుగురితోపాటు మీరూ కలసి బృందగానంలా పాట పాడినట్లు కలవస్తే ప్రతివాడూ మీకు ఏదో ఒక సలహా ఇస్తాడు. మీ మనసుకు నిలకడ లేకుండా పోవచ్చు.

## మే ళ తా ళా లు

కల్యాణ మంటపంలోనో, దేవాలయంలోనో, భజనమందిరం లోనో లేదా వీధిలోనో మేళతాళాలు మ్రోగిస్తున్నట్లు కలగంటే శుభం గలుగుతుంది. కళాకారులతో పరిచయం అవుతుంది. మీరే, కలలో మేళం తాళం మ్రోగిస్తుంటే మీరు సన్మానింపబడతారు.

## న టీ న టు లు

నటుని కాని, నటీమణిని కాని కలలో చూస్తే మీకు స్వార్థం ఎక్కువవుతుంది. అందుకోసం పరులను బలి చేయటానికికూడా వెనుకాడరు. మీరే నటీ నటులుగా కలలో కనిపిస్తే మీ చుట్టూ తిరిగే వారికి మీ పై నమ్మకం సన్నగిల్లుతుంది. వారు మిమ్మల్ని హేళనచేయటానికి ప్రయత్నిస్తారు.

## వా యి ద్య బృ ం ద ం

కలలో మీకు ఆర్కెస్ట్రా (వాయిద్య బృందం) రకరకాల వాయిద్య సాధనాలతో సంగీతం సమకూర్చుతున్నట్లు కలగంటే మీరు వినోద కాలక్షేపం చేస్తారు. పిక్నిక్‌ల లాంటి వాటికి వెళ్ళి వస్తారు.

## నృ త్య ం

మీరు ఎవరిద్దైనా నృత్యాన్ని చూస్తున్నట్లు కలగంటే ఇంతవరకు పెండింగ్‌లో వుంచిన కొన్ని విషయాల్లో అటో ఇటో తేల్చుకోవాల్సిన

పరిస్థితి ఏర్పడుతుంది. పెండ్లి విషయమైనా, ప్రేమ సంబంధమైనా లేదా అక్రమ కామ కలాపమైనా పూనుకుని ముగించటమో లేదా మానుకోవటమో ఏదో ఒకటి చేస్తారు. మీరే నృత్యం చేస్తున్నట్లు కలగంటే మీ ఎన్నిక లేక నిర్ణయం తప్పుగా మారి ఇబ్బందుల్ని గలిగిస్తుంది.

## నృ త్య నా టి క

కలలో మీరు ఏదైనా నృత్య నాటికను చూస్తే మీకు వ్యాపారంలో నష్టం కలుగుతుంది. ఉద్యోగంలో చిక్కులు కలుగుతాయి. మీపైన ఇతరులకు అసూయ కలుగుతుంది. మిమ్మల్ని ప్రతివారూ మోసగించటానికి ప్రయత్నిస్తారు. శివతాండవంలాంటి క్లైమాక్స్ నృత్యాన్ని సంగీతంతో సహా కలగంటే అప్పులుచేసి ముప్పులు తెచ్చుకుంటారు.

## న ర్త కు లు

నాట్యంచేస్తున్న నర్తకిని చూస్తే అందమైన స్త్రీలతో పరిచయమై ప్రేమగా మారి శారీరక సుఖాలు అనుభవిస్తారు. నాట్యం చేస్తున్న మగవాడిని చూస్తే స్త్రీలకు పురుష సాంగత్యం లభిస్తుంది. పురుషులకు సన్మానాలు జరుగుతాయి.

## న ర్త న శా ల

ఖాళీగావున్న నర్తనశాలను కలలో చూస్తే ఏమైనా చెడు వార్తలను వినవలసి వస్తుంది. డాన్స్ ప్రోగ్రాం జరుగుతూ హౌస్‌ఫుల్‌గా వున్న డాన్స్ హాల్‌ను చూస్తే శుభవార్తలు వింటారు. మీ జీవితం సాఫీగా సాగిపోతుంది.

## నాటకం

స్టేజిపైన నాటకాన్ని ప్రదర్శిస్తున్నట్లు కలగంటే అశుభం జరుగుతుంది. మీరు ఏదైనా నాటక రచన చేస్తున్నట్లు కలగంటే బంధుమిత్రులవల్ల అవమానాల పాలవుతారు. మీరు నాటకాన్ని డైరెక్ట్ చేస్తున్నట్లు కలగంటే నలుగురిలో మంచి పేరు తెచ్చుకుంటారు. నాటకానికి అయ్యే పూర్తి ఖర్చును మీరే భరించి నాటకాన్ని వేయించినట్లు కలగంటే ధననష్టం, వృథా ప్రయాస కలుగుతాయి.

## నాటకశాల

ఖాళీగావున్న స్టేజి మీకు కలలో కనిపిస్తే మీ మిత్రులు మిమ్మల్ని ఒంటరివాణ్ని చేసి వెళ్ళిపోతారు. స్టేజిపై నాటకం జరుగుతూ, హాలంతా ప్రేక్షకులతో నిండి వున్నట్లు కలగంటే అందరిచేత మీరు ఆకర్షింపబడి అనేక లాభాలుకూడా పొందుతారు.

## గాయకుడు

మీ రొక్కరే పాట కచ్చేరీ కార్యక్రమాన్ని చేస్తున్నట్లు కలగంటే జీవితంలో గొప్ప గౌరవాన్ని పొందుతారు. ఒంటరిగా కూర్చుని మీ రొక్కరే పాడుకుంటుంటే ఒంటరి జీవితం ఏర్పడుతుంది.

## గాయని

ఏ గాయనీమణి కచ్చేరిని కలగన్నా ప్రేమ కలాపాలు ప్రారంభిస్తారు. ఆమె పాటకు ప్రేక్షకులు సంతోషంతో చప్పట్లు కొట్టితే మీ ప్రేమ సఫలమవుతుంది. మీరు పాడుతున్నట్లు, ప్రేక్షకులు లేనట్లు కలవస్తే ప్రేమ విఫలమవుతుంది.

## విచిత్ర వేషధారణ

ఏ ఉత్సవంలోనో మీరు విచిత్ర వేషధారణ చేస్తే అతి సాహస కార్యక్రమాలు అధిక వ్యయ ప్రయాసల కోర్చి ముగిస్తారు. స్త్రీలు పురుషుని విచిత్ర వేషధారణ చూస్తే శుభం కలుగుతుంది. పురుషులు స్త్రీల అభినయం చూస్తే ప్రేమకలాపాలు సాగిస్తారు. కొత్త వస్తువులు, బట్టలు లాంటివి కొంటారు.

## ఏకపాత్రాభినయనం

స్త్రీ ఏక పాత్రాభినయనాన్ని పురుషులు కలలో చూస్తే స్త్రీలోలు రవుతారు. పురుషుని అభినయాన్ని స్త్రీలు కలగంటే అక్రమ సంబంధాలకు లోనవుతారు. మీరే చేస్తున్నట్లు కలగంటే సౌందర్యారాధకులై చక్కని విలాస జీవితాన్ని సాగిస్తారు.



# 7. కూరగాయలు - వంట ఇల్లు - వగైరా

## బంగాళాదుంప

కలలో బంగాళాదుంప తిన్నట్లు కన్పిస్తే మీ జీవితంలో సుఖ సంతోషాలతోపాటు సంతృప్తి ఏర్పడుతుంది. మీరు చాలా అభివృద్ధిలోకి వస్తారు. దీని తోలు తీసినట్లు కలగంటే మీ యింట్లో ధనలక్ష్మి తాండవ మాడుతుంది. బంగాళాదుంపలను రాశిగా పోస్తున్నట్లు కలలో చూస్తే మీ కుటుంబంపై మీకు అంతులేని శ్రద్ధ కలుగుతుంది. పగటివేళ దుంపలు పండే పొలంలోనికి వెళ్ళినట్లు కలగంటే మీకు మంచి జీవిత భాగస్వాములూ, సంతానం లభిస్తారు. వర్షంలో పొలంలోనికి వెళ్ళి నట్లు కలగంటే మీ కుటుంబ జీవితం దుర్భరంగా సాగుతుంది.

## చిక్కుడు

చిక్కుడుకాయ కూర తిన్నట్లు కలవస్తే మీకు ఇతరులతో అనవసరమైన గొడవలు వస్తాయి. మార్కెటునుంచి దీనిని తీసుకువచ్చినట్లు కలలో చూస్తే మీ పనులు విజయవంతంగా పూర్తి అవుతాయి. వాటిని వండినట్లు కలగంటే ఫలితం ఇదే. చిక్కుడుకాయల్ని పందిరిపై ఉన్నట్లు కలలో చూస్తే మీరు తలపెట్టిన పనులు సక్రమంగా కావు.

## రామములగ (టొమాటో)

దీనిని తిన్నట్లు కలలో కన్పిస్తే ఎప్పుడూ ప్రయాణాలు చేసే ఉద్యోగం లభిస్తుంది. దీని రసం త్రాగినట్లు కలగంటే విమానంలో ప్రయాణంచేసే అవకాశం వస్తుంది.

## ముల్లంగి

కలలో దీనిని తిన్నవారికి శరీరారోగ్యం మెరుగవుతుంది. ముల్లంగి చెట్లను పెంచినటు కన్పిస్తే ధనలాభంతోపాటు ఆరోగ్యాభివృద్ధి పొందుతారు.

## కారెట్

కారెట్‌ను కలలో చూస్తే అంతులేని లాభం, ఆరోగ్యం లభిస్తాయి.

## దోసకాయ

కలలో దోసకాయలు తిన్నట్లయితే అర్థంపర్థం లేని పనులు చేస్తూ అనారోగ్యం పొందుతారు. దీని కూరవండినట్లయితే అనారోగ్యం అంతరించి ఆరోగ్యం లభిస్తుంది.

## కొబ్బరి

మీరు కలలో కొబ్బరికాయను పగులగొట్టినట్లు చూస్తే కొద్దిపాటి లాభంతో తృప్తిచెందటం మంచిది. కొబ్బరి తిన్నట్లు చూస్తే ఏ పనినైనా మీరు అతి ఓర్పుతో చేసి ముగించగల సామర్థ్యం ఏర్పడుతుంది.

## బాదంకాయ

మీరు బాదంకాయను తిన్నట్లు కలలో కన్పిస్తే మీరు దిగ్విజయం పొందుతారు. కేవలం ఈ కాయలను చూడటం మాత్రం తటసిస్తే మీకు అనేకరంగాల్లో లాభాలు కల్గుతాయి. బాదం పప్పుల్ని అమ్మినట్లు కలగన్నట్లయితే త్వరలో విమ్మల్ని అదృష్టం వరిస్తుంది. కొన్నవారికి కూడా ఫలితం ఇదే.

## బీట్ రూట్

దీనిని పెంచినట్లుగాని, తిన్నట్లుగాని కలవస్తే చిక్కులనుండి విముక్తి పొందుతారు.

## ఉల్లిపాయ

మీరు ఉల్లిపాయను కలలోచూస్తే ఏవో విచారకరమైన వార్తలు వినాల్సి వస్తుంది. కోసినవారికి కూడా ఇదే ఫలితం లభిస్తుంది. దీనిని తిన్నట్లు కలగంటే మీరు కష్టాల్ని ధైర్యంతో ఎదుర్కొంటారు. అంతిమ విజయం మీదేనని గ్రహించాలి.

## గుమ్మడికాయ

స్వప్నంలో గుమ్మడికాయ కన్పించటం అంటే మీరు శుభాలు చేరువలోనే ఉన్నట్లు భావించాలి. దాన్ని వండుకొని తింటే మీరు, మీ కుటుంబంలోని సభ్యులకు సుఖశాంతులు కుదురుకుంటాయి.

## కొత్తిమీర

కలలో దీనిని తిన్నవారికి మంచి పొరుగు లభిస్తుంది. వారితో స్నేహం పెరుగుతుంది. దీన్ని తక్కువ వెలకు కొన్నట్లు కలగంటే తీరని కోర్కె అనుకోకుండా తీరుతుంది.

## బచ్చలికూర

దీనిని తిన్నట్లు కలలో కనిపిస్తే మీ ఆరోగ్యం అభివృద్ధి చెందుతుంది. కూర విత్తనాలను చల్లినట్లు కలగంటే మీ అయినవాళ్లు చేసిన తప్పుడు పనుల ఫలితం మీమీద పడుతుంది. దాన్ని భరించక తప్పదు.

## ఆకుకూర

సాధారణంగా ఆకుకూరల్ని తిన్నట్లు కలగంటే మీరు అందరికీ

O 3

అవసర్షప్రాయు లౌతారు. ప్రతివారు మిమ్మల్ని పొగడుతారు. కలలో దీన్ని చూస్తే అస్పృష్టదేవత మిమ్మల్ని వరిస్తుంది.

రాచవుసిరి

దీన్ని తిన్నట్లు కలవస్తే చిన్న తప్పుకుకూడా మీరు నలుగురిచేత తీవ్రంగా అవమానించబడతారు. దీన్ని ఊరగాయగా తిన్నట్లు కల గంటే మీకు అజాగ్రత్తవల్ల ప్రమాదం కలిగే సూచన లున్నాయి. కనుక ప్రయాణాలలో జాగ్రత్తగా ఉండటం మంచిది.

అల్లం

కలలో దీనిని తిన్నట్లు కన్పిస్తే మీరు అనుకోకుండా తీయని ప్రేమ వ్యవహారంలో పడ్తారు.

కూరగాయలు

సాధారణంగా కూరగాయలు పచ్చివే తింటున్నట్లు కలగంటే పాత నేరాలు బయటపడి శిక్ష అనుభవించవలసి రావచ్చు. కూరల పాదులు పెట్టున్నట్లు కలవస్తే మీ కుటుంబం అన్నివిధాల పైకివస్తుంది.

మాంసం

మాంసాన్ని కలలో కొనటం అశుభం. ఎంతో కాలంగా ఎంతో వస్తుందని ఆశించి చేసిన శ్రమకు తగిన ఫలితం లభించదు. దీన్ని తింటున్నట్లు కలగంటే వృత్తి వ్యాపారాలలో మీ నిర్లక్ష్యంవల్ల నష్టం వస్తుంది. కోపంతో అన్నీ వాడుచేస్తారు.

గుడ్లు

బాతు, కోడి, పావురం వగైరాల గుడ్లు కలలో కన్పిస్తే మీరు డాక్టరో, వ్యాపారో, కళాకారులో అయితేమాత్రం మంచి ధనార్జన వుంటుంది. మిగతా వారికి బాధలు ఎదురు అవుతాయి. కోర్టు వ్యవహా

రాల్లో యిరుక్కోవచ్చు. పగిలిన గ్రుడ్లు కన్పిస్తే మీరు ఎక్కువగా నష్టపోతారు. కుళ్ళిన గ్రుడ్లను మీరు ఎవరిపైనైనా విసిరితే శత్రువులు ఎక్కువవుతారు. గ్రుడ్లు తిన్నట్లు కలగంటే ప్రేమించిన వారితో పెళ్లి జరుగుతుంది. వివాహితులకు అనురాగం లభిస్తుంది.

## వెన్న

కలలో మీరు వెన్నతింటే మీ ఆరోగ్యం తృప్తికరంగా వుంటుంది. ...... మీ ప్రేమకు సంబంధించిన కొన్ని రహస్యాలు బయటపడవచ్చు.

## నూనె

కలలో నూనెను చూస్తే సుఖశాంతులు లభిస్తాయి. నూనెను త్రాగుతున్నట్లు చూచిన, మీకు యిష్టంకాని వ్యక్తులతో పనిబడుతుంది. వారితో వారిపై మరింత అసహ్యం పెరుగుతుంది. నూనెను వాడుతున్నట్లు కలగంటే చిక్కులనుండి బయటపడతారు. కాలుతూ వెలుగునిస్తున్న నూనెను చూస్తే మీకు ఎక్కడినుండో విలువైన వస్తువులు ఒహూమానంగా లభిస్తాయి, వానివల్ల మీకు ఆనందం లభిస్తుంది. అదే నాగతో మండుతున్నట్లు కన్పిస్తే కష్టాలు, బాధలు మీపైన పడగలవు.

## గసగసాలు

చెట్టుపై వీటిని కలలో చూస్తే మీకు గొడవలు వచ్చే సూచన ఉన్నాయి. విడిగా గసగసాలు చూస్తే అనారోగ్యం కల్గుతుంది. తిన్నట్లు కలగంటే ఆశలు నిరాశలవుతాయి.

## మిరియం

కలలో మిరియాలు వాడినట్లు కన్పిస్తే బంధుమిత్రుల ముందు అసహ్యంగా ప్రవర్తించి చెడ్డపేరు తెచ్చుకొంటారు. కలహాలు వస్తాయి.

## అగ్గిపుల్ల

కలలో అగ్గిపుల్లను గీచినట్లు చూస్తే త్వరలో మీరు ప్రేమ కలాపాలలో పడగలరని సూచన.

## దీపము

స్వప్నంలో దీపాన్ని వెలుగుతున్నట్లు చూస్తే అంతులేని అదృష్టం మిమ్మల్ని వరిస్తుంది. మినుకు మినుకు మంటూన్న దీపం కలలో కనిపించి నట్లయితే మీరు తలచినవి జరుగవు. మిరిమిట్లు కొలిపే కాంతిని చూస్తే ఎవరినో ఆనందపరచటానికి ప్రయత్నిస్తారు. వెలుగుతున్న దీపాన్ని ఆర్పినట్లు కలవస్తే ఇతరులను చూసి ఓర్వలేక వారి సంతోషాన్ని మీరు పాడుచేస్తారు. వెలిగే దీపాన్ని పగలగొట్టి నట్లు కలగంటే మీ నిర్లక్ష్యంవల్ల కష్టాలను కోరి తెచ్చు కొంటారు.

## పొయ్యి

మండే పొయ్యిని కలలో చూస్తే మీకుటుంబానికి సుఖశాంతులు లభిస్తాయి. ఆరిపోతున్న పొయ్యిని చూస్తే మీకు ఎటు చూసినా నిరాశే ఎదురవుతుంది. పొయ్యిని వెలిగించినట్లు, అది మండుతున్నట్లు కలగంటే మీ యింటిలో శుభకార్యాలు, విందులు లాంటివి జరుగుతాయి. వెలిగించిన పొయ్యి మండకుండా ఉండినట్లు కలగంటే కుటుంబ కలహాలు ఏర్పడుతాయి. పొయ్యివద్ద కూర్చొని మీరు చలినికాచు కున్నట్లు కలవస్తే ప్రేమవ్యవహారాలవల్ల మీకు కష్ట నష్టాలు వస్తాయి. పొయ్యిలోని బూడిద తీసివేసి శుభ్రంచేసినట్లు కలవస్తే మీరు చవుకబారు ప్రేమలో పడి నవ్వుల పాలవుతారు.

## ఆవిరి

కలలో ఆవిరినిచూస్తే శ్రమవల్ల బాధపడ్తారు. పాత్రలలో నుండి ఆవిరి వస్తున్నట్లు కలవస్తే గృహ కలహాలతో అవస్థపాలవుతారు. ఏదో

ఒక యంత్రం నుండి వస్తూన్న ఆవిరిని చూస్తే మీరు మిడిసిపాటుతో నలుగురిలో గల పలుకుబడిని చెడగొట్టు కొంటారు.

## మంటలు

ఉజ్వలంగా వెలుగుతున్న మంటల్ని కలగనటం శుభసూచకం. మంట, పొగ రెంటిని చూస్తే మంచిజరుగదు. వెలిగే మంటను ఆర్పినట్లు కలగంటే ఎవరితోనో సంబంధం తెగ తెంపులు చేసు కొంటారు. పెద్దగా ఆకాశాన్ని అంటుతూన్న మంటలను కలలో చూస్తే కష్టాల నుండి విముక్తులవుతారు. వాటిలో నుండి చిటపట మంటూ నిప్పురవ్వలు వస్తున్నట్లు కలలో చూస్తే విసుగు, చికాకులు ఏర్పడుతాయి. మంటల చుట్టూ మీరుకాని, మరొకరుకాని నాట్యం చేస్తున్నట్లు కలగంటే మంచిరోజులు వస్తాయి. సంతోషంగా బ్రతుకు తారు. ఇంటిలోని పొయ్యిమంటను కలలో చూస్తే చిన్న పిల్లలతో సరదాగా గడుపుతారు. ఏదైనా పెద్ద భవనాన్ని ఎవరన్నా అంటిం చటం కలలో చూస్తే మీరు నిందల పాలవుతారు. మీ ఇల్లు పెద్ద వెలుతురుతో మండుతూంటే మీ స్థితిగతుల్లో శుభకరమైన మార్పులు వస్తాయి. ఆ మంటలు పొగతో నిండినట్లు కలవస్తే మీరు కష్టాల పాలుగావచ్చు.

## దీప స్తంభం

ఇంటిలోని దీపస్తంభాన్ని కలగంటే మీరు వృత్తి వ్యాపారాలలో దిగ్విజయం సంపాదిస్తారు. అది పడిపోతున్నట్లు కలలో కనిపించటం మీకు కష్టనష్టాలు తప్పవని సూచన. పగలు మీరు నడుస్తూ రోడ్డు మీదనున్న దీపస్తంభాన్ని చూస్తే మీరు కొన్ని పనుల్లోకి సాహసంగా దిగి చాతుర్యంతో ముగిస్తారు. అదే రాత్రులలో మీరు చూచినట్లు కలగంటే వృత్తి వ్యాపారాలలో అదృష్టం కలసివస్తుంది.

## కిరసనాయిలు

కిరసనాయిల్ని దీపంలో పోస్తున్నట్లు కలగన్న మీకు చీకాకులు హెచ్చి సంతోషం లేకుండా పోతుంది.

## ఉప్పు

ఉప్పును కలలో చూస్తే మీ పనులు నిర్విఘ్నంగా కొనసాగుతాయి. ఉప్పును చిందర వందరచేయటం కలలో చూస్తే మీకు కొద్ది రోజులలో అదృష్టం దూరమవుతుంది. దీనిని ఉపయోగిస్తున్నట్లు కలగన్నట్లయితే, ఎప్పుడో జరగవని ఆపివేసిన పనులు ముందుకుసాగి ఉత్సాహాన్ని ఇస్తాయి.



# 8. చెట్లు - చేమలు, లతలు - వగైరా

### తాటి చెట్టు

కలలో దూరంగా తాటిచెట్టు కన్పిస్తే మీరు తలచిన పనులు నిర్విఘ్నంగా జరుగుతాయి. తోటలోని చెట్టును కాని, యింటి లోని చెట్టును కాని కలలో చూస్తే తీరని అసంతృప్తి కలుగుతుంది. తాటిచెట్టును నరికి నట్లు కలగంటే మీ మిత్రులవలన మోసపోతారు. దీన్ని ఎక్కినట్లు కల గంటే మీరు అనుకొన్న పని జరుగదు.

### గంగరావిచెట్టు

కలలో ఇది కనిపించినవారు చాల సులభంగా మోసగించబడు తారు. ఈ చెట్ల ఆకులు ఏరినట్లు కలగన్నచో మీరు చేసే స్నేహం మంచిదికాదు. ఆకులు ఎవరన్నా మీకిచ్చినట్లు కలగన్నచో తెలివిలేని వారి ప్రేమకు పాత్రులవుతారు. మీరు ఎవరికన్నా ఆకులు ఇచ్చినట్లు కలగంటే మీరు ప్రేమించే వ్యక్తులు ఉత్త బుద్ధిహీనులు. అవి ఎండి పోయినట్లు వుంటే ఆ ప్రేమవల్ల మీకు అధిక నష్టాలు వస్తాయి.

### నిద్రగన్నేరు చెట్టు

ఇది కలలో కన్పిస్తే మీకు కష్టాలు వస్తాయి. అవి కొద్దికాలంలో తొలగి పోవచ్చు.

### వెదురు పొద

నిటారుగా పెరిగిన వెదురుచెట్ల పొదను కలలో చూచినయెడల వినోద కాలక్షేపాలు కలిగించే స్నేహితులు మీకు లభిస్తారు. వారివల్ల మీకు అంతులేని ఆనందం కలుగుతుంది.

## సిం ధూ ర చె ట్టు

సింధూరచెట్టు కలలో కన్పిస్తే మీ ఆరోగ్యం కుదుటబడుతుంది. దానిక్రింద కూర్చుంటే మీరు ఆపదలలో నున్నచో ఎవరో రక్షిస్తారు. శ్మశానంలో ఆ చెట్టుక్రింద కూర్చున్నట్లు కలగంటే మీరు గట్టి ప్రమాదానికి లోనయినా తప్పించుకో గలుగుతారు. ఎండిన చెట్టును కలలో చూస్తే బంధుమిత్రులలో ఎవరికో హాని కలుగవచ్చు, లేక వారు తగాదాలవల్ల మీకు దూరం కావచ్చు.

## మ ల్బె రీ చె ట్టు

కలలో ఈ చెట్టు కన్పిస్తే అధిక సంతానం కలుగుతుంది. సిరి సంపదలు పుష్కలంగా కలుగుతాయి.

## జ మ్మి చె ట్టు

ఈ చెట్టును కలలో చూచినయెడల మీకు మంచి కీర్తి, గౌరవం లభిస్తాయి. జమ్మి ఆకుల్ని చూచినా ఫలితం ఇదే.

## పూ ల చె ట్టు

కలలో తెల్లని పూలచెట్టు కన్పిస్తే మీరు ప్రేమించేవారు విశ్వసించ దగినవారు కాదని భావించాలి. వివాహితులైతే మీ ప్రియతమమైనవారు మిమ్ములను దగా చేస్తున్నారని తెలుసుకోండి.

## ల త లు

గోడపైకి పూల తీవెలను ప్రాకిస్తున్నట్లు కలగంటే, మీ భవిష్యత్తు బాగుంటుంది. గోడమీదికి ప్రాకిఉన్న లతలను కలలోచూస్తే మీకు నలుగురిలో ఆదరణ, గౌరవం లభిస్తాయి. వాటిని తెంపినట్లు కలగంటే మీ కోర్కెలు నెరవేరవు.

## ముళ్ళ చెట్లు

కలలో ముళ్ళచెట్టుమీద కాలువేసినట్టు, ముళ్ళు గుచ్చుకొన్నట్టు కన్పిస్తే మీ మిత్రులలో ఎవరితోనో ఒకరితో స్నేహాన్ని వదులుకో వాల్సి వస్తుంది. ముళ్ళచెట మధ్యపడితే మీ జీవితం చిక్కులలో పడుతుంది.

## బొమ్మ జెముడు

బొమ్మజెముడు పొదల్లోకి మీరు తోయబడినట్టు కలగంటే మీరు కష్టాలపాలై సతమత మవుతారు. తోట్లలో పెరిగే వాటిని కలలో చూస్తే మీకు అదృష్టం కలసి వస్తుంది. పూలతోటలో ఈ చెట్టును చూసి నట్లు కలగంటే మిమ్మల్ని అందరూ ఆడిపోసు కుంటారు.

## పొదలు

మీకు దట్టంగావున్న పొదలు కలలో కన్పిస్తే మీ కష్టాలు తీరి పోయే కాలం దగ్గరబడినట్లు తెలుసుకోండి. పొదలను చక్కగా కత్తి రిస్తున్నట్లు కలలో చూస్తే ఎల్లప్పుడు యవ్వనవంతునిలా కనిపించాలనే తాపత్రయం కలుగుతుంది.

## పొలం

పొలంలో జంతువులు మేస్తున్నట్టు కలగంటే మీకు సుఖశాంతులు లభిస్తాయి. ఎవరో పొలానికి అడ్డంగాబడి పరుగులు తీస్తున్నట్టు కల గంటే మీ అదృష్టము తరగిపోతున్నట్టు గుర్తు. సారవంతమైన పొలం కలలో కన్పిస్తే మీ ఆరోగ్యం బాగుపడుతుంది. సిరిసంపదలు లభిస్తాయి. బీడుగానున్న పొలాన్ని చూస్తే మీ ఆదాయం తరుగుతుంది.

## చెట్లు

పూతపూస్తున్న చెట్టును కలలో చూస్తే మీరు అదృష్టవంతు లవు

తారు. చెట్టు ఎండిపోయినట్లు గాని, చచ్చిపోయినట్లు గాని కలలో కన్పిస్తే మీ అదృష్ట దేవత దూరంగా పోతుంది. చెట్టు ఎక్కినట్లు కల గంటే మీ జీవితం మూడుపూలు ఆరుకాయలు కాస్తుంది. వృత్తివ్యాపారాలలో మంచి ఉన్నతి లభిస్తుంది. చెట్టుక్రింద కూర్చున్నా ఫలితం ఇదే. చెట్టుమీదనుంచి జారిపడినట్లు కలగంటే మీరు నలుగురిలో తలెత్తుకోలేరు. దాన్ని నరుకుతున్నట్లు కలగంటే మిమ్మల్ని దురదృష్టం ఆవహిస్తుంది.

## మొక్కలు

కలలో మొక్కల్ని నాటుతున్నట్లు కన్పిస్తే మంచి హోదా, వివాహం, సంతానం లభిస్తాయి. వాటిని పీకి వేసినట్లు కలగంటే దురదృష్టం కల్గుతుంది. ఆకులు, పూలతో పచ్చగా వున్న మొక్కలు కనిపిస్తే మీకు ఆర్థికంగా ఎక్కువ లాభాలు కలుగుతాయి. అవి చెల్లాచెదరైనట్లు కలగంటే మీరు మోసగించబడుతారు.

## మంచె

మంచెను కలలో చూస్తే మీరు చేసే పనులలో ఎన్నో ప్రమాదాలున్నాయని తెలిసికూడా వాటిని ప్రారంభిస్తారని సూచన. మంచెపైన కూర్చొని ఏదో పనిచేస్తున్నట్లు కలగంటే ఎంతటి నష్టాన్నయినా ఎదుర్కొని మీ పనులను సాధిస్తారు. మంచెమీదనుండి పడినట్లు కలగన్నట్లయితే మీ పనులలో అనుకోని అపదలను ఎదుర్కోవాల్సి వస్తుంది.

## కంచె

కంచెను కలలో చూస్తే మీకు ఏవో ఇబ్బందులు కలుగవచ్చు. కంచెను ఎక్కినట్లు కలగన్నచో అడ్డంకులు తొలగిపోయి విజయం సాధిస్తారని సూచన. కలలో కంచె ఎక్కటంలో అపజయం లభిస్తే

నిత్యజీవితంలో అపజయాలు తప్పవు. కంచె ఎక్కుతూ గాయపడినట్లు కలగంటే కష్టపడి సాధించిన పనిలో నష్టం తప్ప లాభం ఉండదు.

బ్రహ్మచారి కలలో తోటలో కన్పిస్తే త్వరలో మీరు అందాల రాణిని పెండ్లి చేసుకోబోతున్నారు. అవివాహిత తోటను కలలో చూస్తే త్వరలో కథానాయకుని లాంటి యువకుని వివాహం చేసుకొని సంతోషంగా జీవించగలదు. తోటలో విహరిస్తున్నట్లు కలగంటే ఆపదలు సంభవిస్తాయి.

### చెట్ల నడుమ దారి

కలలో చెట్ల నడుమ ఉన్న దారిలో నడుస్తూ పోతున్నట్లు కన్పిస్తే; మీ అప్పులవారు మిమ్ములను బాధించరు. ఆ దారిలో ఏ కారో, సైకిలో ఎక్కిపోతున్నట్లు కలగన్నా ఇదే ఫలితం. దీపం వెలుగు సహాయంతో ఆ దారిలో ప్రయాణం చేస్తున్నట్లు కలగన్న మీకు ఎక్కడికో ప్రయాణం తగులుతుంది. ఆ దారి చీకటిగా, యిరుగ్గా వున్నట్లు కలలో కన్పిస్తే మీ కోర్కెలు చెదిరిపోతాయి. ఆశలు ఫలించవు.

### దిష్టి బొమ్మ

దిష్టి బొమ్మను కలలో చూస్తే మీరు ఎవరి గురించో ఏవో వూహించుకొని గోరంతలు కొండంతలుగా చేసుకొన్నారని, అది నిజం కాదని గ్రహిస్తారు.

# 9. చేపలు

రకరకాల చేపలు మనకు కలలో కనబడుతాయి. ఏ చేప ఎలా కనబడితే ఏ ఫలితమో చూడండి!

## ఉప్పు చేప

కలలో ఉప్పు చేప కనిపిస్తే కడుపు నొప్పికి సంబంధించిన జబ్బు వస్తుంది. దాన్ని కాల్చుకుని తింటే మీకు సంతోషము కలుగుతుంది. కూరగా తింటే మంచి కబుర్లు వింటారు.

## ఎండు చేప

ఎండుచేపను కలలో చూచిన వారు, తమను చూచి అసూయ పడి తిట్టు కొనేవారు కొందరున్నారని తెలుసుకోవాలి. దీన్ని తింటే ద్రోహులు మీ చుట్టూ చేరే ప్రమాదం వుంది. జాగ్రత్త పడండి.

## బంగారు చేప

కలలో బంగారు చేపను చూస్తే కలవారితో వియ్యమందుతారు, లేదా ప్రేమలో పడతారు. పట్టుకుంటే బంగారమయ్యే అదృష్టం మిమల్ని వెతుక్కుంటూ వస్తుందన్నమాట. బంగారు చేపను తింటే పేదరికం మిమ్మల్ని చుట్టుకుంటుంది.

## ఇసుక దంతం

కలలో చూస్తే సంతోషం కలుగుతుంది. పట్టుకుంటే సంతాన ప్రాప్తి కలుగుతుంది. తింటే ఆరోగ్యము పెరుగుతుంది. దీనిని కలలో పెంచుతున్నట్లు కనిపిస్తే మిత్రులవల్ల మీరు సహాయం పొందుతారు.

## బురదమట్ట

కలలో బురదమట్టను చూస్తే అనారోగ్యం కలుగుతుంది.

పట్టుకుంటే మీసంపద ఎన్నోరెట్లు అభివృద్ధి చెందుతుంది. తింటే మీరు సుస్తీ నుండి కోలుకుంటారు.

## బొమ్మిడాయి

దీన్ని స్వప్నంలో చూచిన, వారి పనులు పూర్తిగాకుండా ఆటంకాలేర్పడుతాయి. పట్టుకుంటే పరులకు మీ పైన అసూయ కలుగుతుంది. మీ చేతిలో నుంచి జారిపోతే అవస్థలు పడతారు. తింటే బాధల నుండి విముక్తి లభిస్తుంది.

## కొరమేలు

కలలో దీన్ని చూచినవారు పోటీలలో ప్రథములుగా వస్తారు. దీన్ని పట్టుకుంటే, మీకు సంతాన ప్రాప్తి వుందని సూచన. తింటే మీ ఆరోగ్యం అభివృద్ధి పొందుతుంది.

## చేప

మీరు కలలో చూచినవి పై రకాలవి కాకపోతే యీ ఫలితాలు కలుగుతాయి. ఆ చేపనుచూస్తే మీరు దగాపడే ప్రమాదముంది. వల వేస్తే మనస్సుకు శాంతి లభిస్తుంది. చేతులతో వెదికి పట్టుకుంటే మీ వూహలు నిజంకావచ్చు. స్త్రీలు కలలో దీన్నితిన్నట్లు కలగంటే నెల తప్పుతుంది. పురుషులు తింటే స్త్రీలను వశంచేసుకునే సామర్థ్యం ఏర్పడుతుంది. పెద్దవి తింటే ధనలాభం కలుగుతుంది. చిన్నవితింటే అసంతృప్తి ఏర్పడుతుంది. పట్టి దాచుకుంటే అనారోగ్యం కలుగుతుంది. చేపల్ని పట్టటానికి ఎంతో శ్రమించి, చేపల్ని పట్టలేకపోవటం కలలో కనిపిస్తే మీకు ఎంతో అవసరమైనవి సమయానికి దొరకవని అర్థం. పెద్ద చేపనుపట్టినట్లు కలగన్న వారికి వృత్తివ్యాపారాదులలో ఎంతో లాభం కలుగుతుంది. చచ్చినచేపను పట్టినట్లు కలగంటే వృత్తి

వ్యాపారాదులలో నష్టం వస్తుంది. గర్భిణీ స్త్రీలు బిడ్డకు బదులు చేపను ప్రసవించినట్లు కలగంటే ఆమెకు పుట్టే బిడ్డ యెక్కువ రోజులు బ్రతకదని అర్థం. చనిపోయినచేప నీళ్ళలో తేలుతూ పోతున్నట్లు కలలో కనిపిస్తే, ఎండమావులలోని నీటికోసం ప్రయత్నించి నట్లు వృధా శ్రమలుపడతారు. చిన్నచిన్న చేపలను పట్టినట్లు కల గన్నచో అనవసరమైన పనులుచేస్తూ కాలం వ్యర్థం చేస్తున్నారని సూచన. ఎర్రటిచేప కలలో కనిపిస్తే జబ్బు చేస్తుంది. రంగు రంగుల చేపల్నికలలో చూచినచో, మీకోసం జబ్బుగాని, గాయాలుగాని, విచార వార్తలుగాని సిద్ధంగా వున్నాయని హెచ్చరిక.

## తిమింగలం

కలలో తిమింగలాన్ని చూస్తే ఊహించుకున్న భయం మిమ్మల్ని కలవరపెడుతుంది. దాన్ని పట్టుకుంటే మీరు శత్రువులమీద ఘన విజయాన్ని సాధిస్తారు.



# 10. జంతువులు

జంతువులు అనగా ఆవు, గుఱ్ఱం, మేక, పంది, వగైరా - వగైరా - ఇవి కలలో కనిపించినపుడు కలిగే ఫలితాలు ఎలావుంటాయో చూడండి !

## ఆవు

ఆవు హిందువులకు చాలా పవిత్రమైంది. దీన్ని కలలో చూస్తే ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. చావిట్లో కట్టివేసిన ఆవును చూస్తే మీకో, మీ ఇంట్లో మరెవరికో చాలా కాలంగా కుదురకుండా వున్న వ్యాధి కుదిరిపోతుంది. ఆవు పాలను పితుకుతున్నట్లు కలగంటే శ్రమ లేకుండా సునాయాసంగా బోలెడంత డబ్బు సంపాదిస్తారు. ప్రతిరోజూ ఏదో ఒక విధంగా డబ్బు అందుతుంది. ఆవును, దూడను రెంటినీ చూస్తే మీకు వున్న భయాలు పోయి మనశ్శాంతి ఏర్పడుతుంది. చనిపోయిన ఆవును చూస్తే సంపాదన తగ్గుతుంది.

## ఆవు దూడ

కలలో ఆవు దూడ మేస్తున్నట్లు కన్పిస్తే దుష్టులతో స్నేహం కలుగుతుంది. వారితో సంబంధాలు పెరిగి చిక్కుల్లో పడవచ్చు. ఆవు దూడతో ఆడుకుంటున్నట్లు కలగంటే మీ ప్రయత్నాలు ఫలించవు. వృథా ఖర్చులు పెట్టవలసి వస్తుంది.

## గుఱ్ఱము

గుఱ్ఱపు శాల బయట కట్టివేయబడివున్న గుఱ్ఱాన్ని కలలో చూస్తే మీరు తలవంచని వీరు లవుతారు. స్వతంత్ర జీవనం గడుపుతారు. ఎవరి సహాయాన్నీ అంగీకరించరు. గుఱ్ఱపు శాలలో వున్న గుఱ్ఱాన్ని

చూస్తే సుఖ సంతోషాలకు కొఱత వుండదు. అది పారిపోతూ కన్పిస్తే తెలియని కష్టాలు అనుభవించవలసి వస్తుంది. మేస్తున్న గుఱ్ఱం కలలో కొస్తే మంచి మిత్రులు లభిస్తారు. అది జారిపడి గాయమైతే దురదృష్టం మీ కోసం సిద్ధంగా వుందని గ్రహించాలి. గుఱ్ఱం ఎక్కినట్లు కలగంటే గౌరవం పెరుగుతుంది. దిగినట్లయితే అగౌరవం కలుగుతుంది. గుఱ్ఱం మీద నుండి క్రింద పడినట్లయితే ప్రమాదాలు సంభవిస్తాయి. మీ గుఱ్ఱం మీద మీరే స్వారీచేస్తే, దాంపత్యం చక్కగా కొనసాగుతుంది. ఎవరైనా స్వారి చేస్తున్నట్లు మీరు కలగంటే మీ భాగస్వామి అవినీతికి లొంగి పోవచ్చు. తెల్ల గుఱ్ఱం కనిపిస్తే శుభ కార్యాలు, నల్ల గుఱ్ఱం కన్పిస్తే అశుభాలు జరుగుతాయి.

కోతి కలలో కన్పిస్తే మీ చుట్టూ మోసగాళ్లు చేరి మిమ్మల్ని నట్టేట్లో ముంచవచ్చు. అది చెట్టు ఎక్కుతున్నట్లు కన్పిస్తే అండ దండలు గలవారితో స్నేహమో, వియ్యమో ఏర్పడుతుంది. కోతిని పెంచుతున్నట్లు కలగంటే దుష్టులతో స్నేహం ఏర్పడి నష్టాల్ని పొందుతారు. పెద్ద కోతిని గాని, ముసలి కోతిని గాని కలలో చూస్తే చేయని నేరానికి శిక్ష అనుభవించ వలసి రావచ్చు. తోకలేని కోతి కలలో కన్పిస్తే మీరు నవ్వుల పాలవుతారు. కోతి మీ వెంటబడితే అజాగ్రతవల్ల నష్టపోతారు. అది మిమ్మల్ని కరచినట్లు కలగంటే మీ పరిస్థితి అధమంగా మారుతుంది.

పిల్లి

పిల్లి కలలో కన్పిస్తే స్నేహితులవల్ల దగా పడతారు. తెల్ల పిల్లిని చూస్తే బాధలు పడవలసి వస్తుంది. దాన్ని పెంచుకోవటానికి ఎవ రైనా మీ కప్పగిస్తే శుభం కలుగుతుంది. పిల్లికూన మీ ఒడిలో చేరి

'మ్యావ్ .... మ్యావ్ ....' అంటూ అరిస్తే నీచురాలైన స్త్రీతో పరిచయమై మీ పేరు చెడుతుంది. పిల్లిని మీరు తరుముతున్నట్లు కలగంటే మీ కష్టాలు తీరిపోతాయి. పిల్లి కక్కినట్లుగాని, కరచినట్లుగాని కలలో కన్పిస్తే శత్రుభయం ఏర్పడుతుంది. పిల్లికి పాలుపోసి పెంచితే మీకు తెలియకుండానే దుర్మార్గులైన వారిని చేరదీయవచ్చు - దానివల్ల మున్ముందు నష్టపోవచ్చు. పిల్లితోపాటు పిల్లికూనలు కూడా కన్పిస్తే మీ పిల్లల ప్రవర్తన మిమ్మల్ని బాధ పెట్టవచ్చు.

## మేక

మేక కలలో కన్పిస్తే పెడదారులు పట్టి పేరు చెడగొట్టుకుంటారు. అధిక ప్రసంగాలు చేసి తగాదాలు పెంచుకుంటారు. మేక పాలను పితికి త్రాగితే అనవసరంగా కోపం, అందరిపైన చిరాకు ఏర్పడుతాయి.

## మేకపిల్లలు

తెల్లని మేక పిల్లల్ని కలలో చూస్తే చక్కని సంసార సుఖం లభిస్తుంది. నల్లని వాటిని కలగంటే క్షణిక సుఖాలకు అలవాటు పడి ఆరోగ్యం పాడు చేసుకుంటారు.

## గొఱ్ఱె

కలలో గొఱ్ఱెల గుంపు కన్పిస్తే సుఖ సంతోషాలు కలుగుతాయి. గొఱ్ఱెను దగ్గరకు తీసుకుని లాలిస్తే చెమటోడ్చి మంచి స్థితిని పొందుతారు.

## తోడేలు

తోడేలు మిమ్మల్ని తరుముతున్నట్లు కలవస్తే మీరు అప్పుల పాలవుతారు. దాన్ని చంపినట్లు కలగంటే అప్పులు తీరుతాయి. సంపాదన మిగిలి, జీవితం సుఖప్రదమవుతుంది.

కుక్క

కలలో నల్లకుక్క కన్పిస్తే మీరు నమ్మిన మిత్రుడు మిమ్మల్ని మోసం చేస్తాడు. తెల్ల కుక్కగాని, తెల్లని మచ్చలున్నదిగాని కన్పిస్తే మీ స్నేహితుల సాయంతో మీరు జీవితంలో నిలద్రొక్కుకో గలుగుతారు. పిచ్చిన కుక్క కన్పిస్తే ఏదో విషవలయంలో చిక్కుకునే ప్రమాదం వుంది. కుక్కపిల్లలతో ఆడుకుంటున్నట్లు కలవస్తే మీరు ప్రేమకు, అభిమానానికి దూరమౌతారు. అసంతృప్తి కలుగుతుంది. కుక్కను ఉసిగొలిపితే శత్రువులు పెరుగుతారు. కుక్కమొరిగితే పనులు సక్ర మంగా జరగవు. కరిస్తే మంచికిపోయి చెడు తెచ్చుకుంటారు. సీమ కుక్కను చూస్తే మేధావులతో, విదేశీయులతో పరిచయం ఏర్పడు తుంది. కుక్కను పెంచుతున్నట్లు కలగంటే ఆచరణకు రాని ఆలోచ నలతో ఉక్కిరి బిక్కి రవుతారు. పరుగెత్తే వేటకుక్కను చూస్తే అకస్మా త్తుగా మీ పరిస్థితి తలక్రిందులు కావచ్చు.

పులి

కలలో పులిని చూస్తే భయాందోళనలు కలుగుతాయి. శత్రువుల వల్ల ఆపద ఏర్పడుతుంది. పులి తరుము తున్నా, మీద పడినా, మీ శత్రువువల్ల ప్రాణభయం కలుగుతుంది. పులి మిమ్మల్ని చంపితే దీర్ఘ వ్యాధి సంభవిస్తుంది. పులిని మీరు చంపితే శత్రువుల్ని జయిస్తారు. జగదేక వీరులని పేరు పొందుతారు.

చిరుత పులి

చిరుతపులిని కలలో చూస్తే చెడు స్త్రీల వల్ల చెడుపు జరుగు తుంది. మీరుదానిని ఎదుర్కొంటే సమస్యల్ని పరిష్కరించుకోగల సామర్థ్యం ఏర్పడుతుంది. మీరు దాన్ని చంపితే తలపెట్టిన పనుల్ని జయప్రదంగా ముగిస్తారు.

## సింహం

అడవిలో స్వేచ్ఛగా తిరుగుతున్న సింహం కలలో కన్పిస్తే మీరు దేహ పరిశ్రమచేసి బలాఢ్యులవుతారు. శత్రువుల్ని జయించే శక్తిని సంపాదిస్తారు. బోనులోని సింహాన్నిగాని, కట్టివేయబడిన సింహాన్నిగాని కలలో చూస్తే మిమ్మల్ని ఎవరూ ఏమీ చేయలేరు. మీరు దానితో పోట్లాడితే చిక్కుసమస్యలు ఎదురౌతాయి. సింహాన్ని చంపినట్లు కలగంటే ఏదైనా మహత్తర కార్యం సాధిస్తారు. చచ్చిన సింహం కన్పిస్తే మీ శత్రువుల ఆట కట్టిస్తారు.

## సీవంగి

అడవి కుక్కను సివంగి అంటారు. ఇది కలలో కన్పిస్తే దొంగల భయం కలుగుతుంది. వస్తువుల్ని కూడా పోగొట్టుకోవచ్చు. ఇది మీ మీద పడితే ప్రమాదాల్లో ఇరుక్కోవచ్చు. దాన్ని మీరు చంపితే ఎలాంటి ప్రయాసా లేకుండా పనులు ముగిస్తారు.

## నీటిగుఱ్ఱం

'జూ' (జంతుప్రదర్శనశాల)లో వున్న నీటి గుఱ్ఱాన్ని కలలో చూస్తే మీ చుట్టూ వున్నవారు మిమ్మల్ని విసిగిస్తారు. స్వేచ్ఛగా తిరుగుతున్న దాన్ని చూస్తే అతిత్వరలో మీరు మీ కష్టాల్నుండి ఒడ్డున పడతారు.

## వింతమృగం

ఎప్పుడూ చూడని, ఊహించని వింత మృగమేదైనా కలలో కన్పిస్తే మీ బంధువులనుండో, మిత్రుల నుండో విషాదవార్త వింటారు.

## ఖడ్గమృగం

అడవిలో స్వేచ్ఛగా తిరిగే ఖడ్గమృగాన్ని మీరు కలగంటే.

అనుకోని ఖర్చులు చేయవలసి వస్తుంది. 'జూ' లో వున్న దాన్ని చూస్తే మీకు అత్యంత ప్రియమైన వారి దర్శనం లభిస్తుంది.

పంది

కలలో పంది కనబడితే పందేల్లో నెగ్గుతారు. జూదాల్లో గెలుస్తారు. ప్రతిపనిలోను అదృష్టం కలసివస్తుంది. దాన్ని చంపినట్లు కలగంటే ధనలాభం కలుగుతుంది. కాని సంతోషం వుండకపోవచ్చు. పంది మాంసం తింటే ఉద్యోగంలో హోదా పెరుగుతుంది. బాధ్యతలూ పెరుగుతాయి.

ముళ్లపంది

ఇది కలలో కన్పిస్తే మీ చుట్టూ అసూయా పరులు చేరతారు. చంపితే కష్టాలనుండి విముక్తి లభిస్తుంది. శత్రువుల బాధ తగ్గుతుంది. హాయి కలుగుతుంది. మిమ్మల్ని అది తరిమితే ఎవరైనా మీ అసూయ తత్వాన్ని ఆసరాగా తీసుకుని మోసగించవచ్చు.

గాడిద

కలలో తెల్లగాడిద కన్పిస్తే తలచిన కార్యాలు నేరవేరుతాయి. దానిమీద నుండి క్రిందబడితే నలుగురిలో నగుబాట్లు, తగాదాలు సంభవించవచ్చు. అది తన్నినట్లు కలగంటే మీ రహస్య ప్రేమకలాపం రచ్చకెక్కుతుంది.

కంచరగాడిద

దీనిని కలలో చూచిన వారు, జోలిమాలిన పనులకు పోయి అనవసర బాధలకు లోనవుతారు. దీనిపై నెక్కిన వారికి అప్రతిష్ఠకలుగుతుంది. తన్నినట్లయితే వ్యాపారంలో నష్టం కలుగుతుంది. చనిపోయిన గాడిద కలలో కొస్తే మీ స్నేహితులెవరైనా నేరంచేసి, పట్టుబడి, జైలు కెళ్తారు.

ఏనుగు

మామూలు ఏనుగును కలలో చూస్తే ముఖస్తుతి మాటలకు లొంగిపోయి, చేయరాని పనులు చేస్తారు. దాన్ని ఎక్కినట్టు కలగంటే పెండ్లి జరుగుతుంది. ఇప్పటికే వివాహమైతే మాజీ ప్రేమలో పడతారు. అయినా కుటుంబంలో కలతలు రావు. సర్కస్‌లోని ఏనుగును చూస్తే ఇతరులు మిమ్మల్ని ఎగతాళి చేయటానికి ప్రయత్నిస్తారు. ఏనుగు గున్నల్ని చూస్తే సత్సంతానంతో ప్రశాంత సాంసారిక జీవితం ఏర్పడుతుంది. ఏనుగు దంతాన్ని కలలో చూస్తే కళాకారులవుతారు. దంతపు వస్తువులు బహుమతిగా పొందితే ప్రజల్లో మీకు అభిమానులెక్కువవుతారు.

ఎద్దు

దీన్ని కలలో చూస్తే భాగ్యవంతులతో స్నేహం లభిస్తుంది. ఎద్దును కొన్నట్టు కలగంటే స్థిరాస్థిని పెంచుతారు. అమ్మినట్లో, లేక ఎద్దు చచ్చినట్లో కలగంటే కీడు కలుగుతుంది. మంచి మిత్రుడ్ని పోగొట్టుకుంటారు. పోట్లగిత్త మిమ్మల్ని పొడవటానికి వస్తే మిత్రులూ మీ మంచితనాన్ని వాడుకుంటారు. తెల్ల ఎద్దును కలగంటే తలచిన తలపులు ఫలిస్తాయి. గిత్తల పోట్లాటను కలలో చూస్తే కుటుంబంలో కలతలు ఏర్పడవచ్చు. పోట్లగిత్తను మీరు లొంగదీసుకుంటే మీ రేదైనా ఘనకార్యాన్ని సాధించుతారు.

పచ్చిక మేస్తున్న లేడి కలలో కనిపిస్తే ప్రేమలో పడతారు. అది పారిపోతుంటే మీకు మీ మిత్రులతో అభిప్రాయ భేదాలేర్పడుతాయి. చంపినట్లు కలగంటే భాగస్వామితో పేచీ ఏర్పడి, విడిపోయే ప్రమాదం వుంది.

## నక్క

కలలో నక్క కన్పిస్తే మీకు శత్రువులు ఎక్కువవుతారు. వారి వల్ల మీకు కష్టాలు కలుగుతాయి. నక్కను మీరు వేటాడినట్లు కల గంటే వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. నక్కను చంపినట్లు కలగంటే అనారోగ్యం కలుగుతుంది.

## ఒంటె

దీన్ని కలలో చూస్తే కష్టాల పాలవుతారు. ఒంటెల గుంపు కన్పిస్తే, ముందు కాలం మీకు ఆనంద దాయకంగా వుంటుంది. ఒంటెను ఎక్కినట్లు కలగంటే మీస్వార్థానికి ఇతరుల్ని బలిచేస్తారు.

## ఎలుగుబంటు

ఇది కలలో కనబడితే కష్టాలపై కష్టాలు వచ్చి పడతాయి. ఎలుగుబంటు మిమ్మల్ని పట్టి బాధిస్తే కష్టాలు తీరిపోతాయి. దీనితోలు కన్పిస్తే సమస్యలు తొలగి శాంతి ఏర్పడ వచ్చు.

## కుందేలు

తెల్ల కుందేలు కలలో కనిపిస్తే సుఖ సంతోషాలు కలుగుతాయి. నల్లని కుందేలు కన్పిస్తే దురదృష్టం కలుగుతుంది. కలలో దీన్ని పట్టు కుంటే వయసు వారితో స్నేహం కలసి ప్రేమగా మారుతుంది. కుందేలు మాంసం తింటే సంపన్నులవుతారు.

## మొసలి

నీటిలోని మొసలి కలలో కన్పిస్తే మీ మిత్రులు మీ సహాయంతో పైకి వస్తారు. అభినందనలు తెల్పుకుంటారు. 'జూ' లో వున్న దాన్ని చూస్తే సముద్ర ప్రయాణం చేస్తారు. మిమ్మల్ని మొసలి పట్టుకున్నట్లు కలగంటే కష్టాల పాలవుతారు. దాన్ని చంపితే శత్రు సంహారం

చేస్తారు. లేదా మీ శత్రువులు తలపెట్టి సాధించలేని దాన్ని మీరు సాధించి పలుకుబడి సంపాదిస్తారు.

## రాకాసి మొసలి

భయంకరమైన రాకాసి మొసలి మీ కలలోకొస్తే అనుకోని ఆపదలు మిమ్మల్ని చుట్టుముట్టుతాయి. దీని వల్ల మీరు గాయపడితే శత్రువుల వల్ల నష్టం కలుగుతుంది. మీరు దాన్ని చంపితే పనులన్నింటా జయప్రదులవుతారు. పదిమందీ సాయపడమని మీ వెంట బడతారు.

## పశువులు

బలంగావున్న పశువుల మంద మీ కలలో కొస్తే మీ బంధు మిత్రులతో విహారయాత్రలు చేస్తారు. ప్రేమికులు 'పిక్నిక్' లకు వెళ్తారు. బక్కచిక్కిన పశువులు కన్పిస్తే దండగమారి పనులు చేస్తారు. రకరకాల పశువులు మందగా కన్పిస్తే సుఖశాంతులూ, సంపదా లభిస్తాయి. పాలు పితికినట్లు కలగంటే ఆదాయం దినదినాభివృద్ధి చెందుతుంది.



# 11. తంతి - తపాలా

## ఉత్తరం

మీకు ఉత్తరం వచ్చినట్లు కలగంటే వృత్తి వ్యాపారాలలో విజయం లభిస్తుంది. దానిలో అశుభ వార్త ఉన్నట్లు కలగంటే మీరు చేయబోయే పనులలో నిరాశ ఎదురవుతుంది. ఎవరికైనా మీరు ప్రేమ లేఖ వ్రాసినట్లు కలగంటే నిర్లక్ష్యంవల్ల పొరపాట్లు చేసి ఆ తరువాత బాధపడతారు. దీవిస్తూ మీకన్న చిన్నవారికి ఉత్తరం వ్రాయటం కలలో చూస్తే క్రొత్త వస్తువులు కొంటారు. దీవెన ఉత్తరాలు మీకు వచ్చినట్లు కలగంటే లాటరీల్లో ప్రైజు వస్తుంది. ఉత్తరం చింపి తగులబెట్టినట్లు కలగంటే ధననష్టం కలుగుతుంది.

## కవరు

కలలో కవరును గంటే మీ కుటుంబానికి సుఖం కల్గుతుంది. కవరుపైన అడ్రసు వ్రాసినట్లు కలగంటే మీ కుటుంబ సభ్యుల్ని త్వరలో కలుస్తారు.

## కార్డు

పోస్టుమాన్ మీకు పోస్టుకార్డును బట్వాడా చేస్తున్నట్లు కలగంటే మీ పనులు కుంటుపడుతాయి. కావున నిరాశను ఎదుర్కోవాలి. మీరు కార్డు వ్రాసినట్లు కలగంటే మీ కిష్టంలేని బరువైన బాధ్యతలు తీసుకొంటారు. మీరు కార్డును పోస్టు డబ్బాలో వేసినట్లు కలగన్నా ఫలితం ఇదే.

## స్టాంపు

ఉత్తరానికి స్టాంపును అంటించినట్లు కలలో చూస్తే మీకు అప్పగించిన పనిని జాగ్రత్తగా చేస్తారు. బాగా లాభం వస్తుంది. తపాలా

ఫీసులో వాటిని కొన్నట్లు కలగంటే మీ వ్యాపారం అన్ని విధాల అభివృద్ధి అవుతుంది. రకరకాల స్టాంపులను కలలో మీరు సేకరిస్తే పెద్దవారి స్నేహంతో మీరు అభివృద్ధిలోనికి వస్తారు. ఎక్కడా లభించని అపురూపమైన స్టాంపుల్ని ప్రోగుచేసినట్లు కలగంటే మీ సంపాదన రెట్టింపవుతుంది.

టెలిగ్రాం

ఇది పంపినట్లు కలగంటే మీరు చేతికందిన అవకాశాన్ని జారవిడుచుకుంటారు. టెలిగ్రాం వచ్చినట్లు కలగంటే మీరు చలిబాధతో అవస్థపడుతారు.

టెలిఫోను

మీరు కలలో టెలిఫోనును చూస్తే పరిచయం లేనివారిని కలుస్తారు. దాని సంఖ్యలు డయలు చేస్తున్నట్లు కలలో కన్పిస్తే మీ పేరును ఏదో ఒక విషయంలో రహస్యంగా ఉంచేందుకు ప్రయత్నిస్తారు. మీరు ఎవరికైనా ఫోను చేసి అవతలివైపునుండి జవాబు లేకపోయినట్లు కలగంటే మీ వ్యాపార వ్యవహారాలలో మీతోటి భాగస్థుడు ముఖం చాటు చేస్తాడు. మీరు రాంగ్ నంబర్ డయిల్ చేసినా ఫలితం ఇదే. మీరు ఫోనులో ఇంకా చెప్పాలనుకొంటున్నపుడు అవతలివ్యక్తి లైనును కట్ చేస్తే ఒక వ్యవహారంలో మీరు యిష్టంలేని షరతులకు లొంగి రాజీ పడాల్సి వస్తుంది.

రేడియో

ఇది కలలో కన్పించటం ఎంతో మంచిది. కలలో దీనిలో పాటలు లేక వార్తలు వింటున్నట్లు కన్పిస్తే మీకు ఎంతో లాభం చేకూరుతుంది. రేడియోలో మీరు ప్రసంగం చేస్తున్నట్లు కలగంటే యితరులు మీ భావాలకు జోహార్లు అర్పిస్తారు. రేడియోకు ఏరియల్ను

కట్టుతున్నట్లు కలగంటే ధనలాభం. ఏరియల్‌ను లాగి పారేసినట్లు కలగంటే వారివారి పనులు సామర్థ్యాన్ని బట్టి ఫలిస్తాయి. ఏరియల్‌ను రెండుగా త్రుంచినట్లు కలవస్తే విచారకరమైన వార్తలు రావచ్చు. ఏరియల్‌ను కలలో చూస్తే మిత్రులనుండి క్షేమసమాచారాలు అందుతాయి.

### టెలివిజను

దీనిని కలలో చూస్తే మీకు రోజురోజుకు పనుల భారం ఎక్కువవుతుంది. ఆదాయంకూడా పెరుగుతుంది.

### గ్రామఫోను

కలలో దీనినుండి పాటలు వింటున్నట్లు కన్పిస్తే వినోద కాలక్షేపాలు లభిస్తాయి. ఎవరైనా దీన్ని మీకు కలలో బహుమానం క్రింద యిస్తే క్రొత్తవారితో పరిచయం, స్నేహం పెంపొందుతాయి. చనిపోయినవారి గొంతును దీనినుండి వింటున్నట్లు కలగంటే వ్యాపారంలో కాని, వుద్యోగంలో కాని అనుకోని మార్పులు వస్తాయి. మీరే అందులో నుండి పాడుతున్నట్లు కలగంటే అనుకోకుండా వుద్యోగాలపై మోజు కలిగి చేస్తున్న పనిని మానివేస్తారు.

### పోస్ట్‌మాన్

మీ కలలో పోస్ట్‌మాన్ కన్పిస్తే మీ బాల్య మిత్రుడు కన్పించి మీకు శుభవార్తలు అందజేస్తాడు.

# 12. నగలు

సాధారణంగా కొందరికి నగలు కుప్పలు కుప్పలుగా కలలో కనిపిస్తాయి. అంటే అది దరిద్రానికి సూచన అన్నమాట. నగలు దొరికి నట్లు కలగంటే కష్టాలను కొనితెచ్చు కుంటారు. నగలు పోగొట్టు కున్నట్లు స్వప్నం వస్తే అకస్మాత్తుగా ఏదో మార్పువచ్చి, జరగదను కున్నది జరిగితీరుతుంది. విలువైన నగలను ఖరీదు చేసినట్లయితే మీరు దుబారా ఖర్చులు బోలెడు చేస్తారు. అంతఃకలహాలు వస్తాయి.

విడివిడిగా ఒక్కో నగ కనిపిస్తే ఫలితా లేమిటో చూడండి.

## పాపిడిగొలుసు

కలలో ఇది కనిపిస్తే మీకు, మీ మిత్రులతో కలహం వస్తుంది ధరించినట్లయితే నిందలు మోయవలసి వస్తుంది. పోగొట్టుకుంటే సంపదలు చేకూరుతాయి.

## దుద్దులు

మీకు స్వప్నములో దుద్దులు కనబడితే సహృదయులతో స్నేహం కలుగుతుంది. కొంటే ధన నష్టం కలుగుతుంది. పోగొట్టు కుంటే అనారోగ్యంనుండి విముక్తి కలుగుతుంది. మీరు స్త్రీలయితే కలలో దుద్దులు (మరో పేరు కమ్మలు) ధరిస్తే సంఘంలో చెడ పేరు కలుగవచ్చు.

## నాగరం

నాగరాన్ని కలలో చూస్తే సిరిసంపదలు కలుగుతాయి. ధరిం చితే అనుమానం పెనుభూతంలాగ పెరుగుతుంది. అందరిపైన సందేహం ఏర్పడుతుంది. పోగొట్టుకుంటే శుభం కలుగుతుంది.

## ముక్కు పుడక - పోగు

కలలో దీన్ని చూస్తే నలుగురిలో మీకు పేరు ప్రఖ్యాతులు కలుగుతాయి. మగవారికి ముక్కుపోగు ధరించితే వారికి ఉద్యోగం దొరుకుతుంది. స్త్రీలు ముక్కుపుడక ధరించితే వివాహాది శుభకార్యాలు జరుగుతాయి. ముక్కు కుట్టుకుని పెట్టుకుంటే మగవారికి ఉన్నత పదవి, స్త్రీలకు భాగ్యవంతులతో వివాహమో, వియ్యమో అందుకోగల యోగం పడుతుంది.

## నెక్ లెస్

నెక్ లెస్ స్వప్నంలో చూచినవారికి ప్రేమికులతో పరిచయం పెరిగి పెళ్ళివరకు వెళ్ళగల అవకాశాలు ఏర్పడుతాయి. దీన్ని బహుమానంగా అందుకున్న వారికి సరసం విరసమయ్యే ప్రమాదముంది. పోగొట్టుకున్నట్లు కలగంటే ప్రేమికులమధ్య అనుమానాలుపోయి శుభం జరుగుతుంది.

## తాళిబొట్టు

ఇది కలలో కనిపిస్తే స్త్రీకి మంచిపేరు లభిస్తుంది. ధరిస్తే దీర్ఘాయువు కలుగుతుంది. పోగొట్టుకుంటే అశుభం జరుగవచ్చు. దొరికితే వివాహం జరిగితీరుతుంది.

## రక్షరేకు

రక్షరేకు (లేక తాయెత్తు) ను స్వప్నంలో చూచిన వారికి ఏదో శుభం కలుగుతుంది. ధరించితే అపజయం, అవమానం కలుగుతాయి. పోగొట్టుకుంటే కష్టాలనుండి విముక్తి కలుగుతుంది. దొరికితే దారిద్ర్యం వచ్చే సూచన లున్నాయని అర్థం.

## మెడల్

కలలో దీన్ని చూస్తే ఏదో రకమైన లాభం కలుగుతుంది.

బహుమతిగా అందుకుంటే ఉన్నతపదవి నందుకోగలరు. ధరించితే అనుకున్న పని అలక్ష్యంగా జరుగుతుంది. మెడల్సు ఎక్కువగా కన బడితే, నిందలు మోయవలసి వస్తుంది. పనులు నిదానంగా పూర్తి అవుతాయి.

### గాజులు

వెండి గాజులు కలలో కనిపిస్తే భవిష్యత్తు ఆశాజనకంగా కని పిస్తుందేకాని, కొన్ని చిక్కులు ఏర్పడే ప్రమాదం వుంది. బంగారు గాజులు కనిపిస్తే సుఖసంతోషాలు కలుగుతాయి. చేతినిండా గాజులు ధరించితే కనీస అవసరాలకు యిబ్బంది లేకుండా జీవితం గడచి పోతుంది. బహుమానంగా అందుకుంటే మీకు ఉజ్జ్వల భవిష్యత్తు వున్నదన్న మాట.

### ఉంగరం

స్వప్నంలో ఉంగరాన్ని చూస్తే మంచివారితో పరిచయం స్నేహం లభిస్తాయి. ధరించితే ప్రమాదాలు ఏర్పడవచ్చు. కొన్నట్లు కలగంటే మంచిరోజులు వస్తాయి. బహుమతిగా అందుకుంటే మీ స్నేహితులలో, బంధువులలో మిమ్మల్ని చిక్కులలో పెడతారు. ఉంగరాన్ని పోగొట్టుకుంటే అశుభం కలుగుతుంది. గుర్తు వుంచుకోవలసినవారే మిమ్మల్ని మరచిపోతారు. ఇది కలలో దొరికితే లాభం కలుగుతుంది, సంపదలు పెరుగుతాయి.

### కళ్యాణపు టుంగరము

దీన్ని కలలో చూచినయెడల ప్రేమకలాపాల్లో పాల్గొంటారు. అవివాహితులకు వివాహం జరుగుతుంది. ధరిస్తే కళ్యాణ గడియలు దగ్గఱ పడతాయి. మీరు వివాహితులైతే సత్సంతానము కలుగుతుంది.

కాలిమెట్టెలు

కాలిమెట్టెల్ని కలలో చూచినవారికి సంతోషం కలుగుతుంది. ధరిస్తే విచారాన్ని పోగొట్టుకుంటారు. వీని శబ్దం వింటే అశుభం కలుగుతుంది. పోగొట్టుకుంటే అనారోగ్యంతో బాధపడతారు. దొరికితే సుఖసంతోషాలతో బాటు సంతృప్తి లభిస్తుంది.

గజెలు

కలలో చూస్తే ప్రేమకలాపంలో దిగ్విజయం కలుగుతుంది. వీటిని ధరించినట్లు కలగంటే మీ ప్రేమ విఫలం అయ్యే సూచన లున్నాయి. గజ్జెలమోత వింటే మొద్దు నిద్రపోయి, ఆరోగ్యం పెంచు కుంటారు. అనారోగ్యంనుండి విముక్తి కలుగుతుంది.

మొలత్రాడు

దీన్ని కలలో చూస్తే శుభం కలుగుతుంది. ధరిస్తే కార్యసాధనలో ఆలస్యము అవుతుంది. పిల్లల మొలత్రాడును చూస్తే మంచి భవిష్యత్తు వుంటుంది. పెద్దల మొలత్రాడు కనిపిస్తే మీరు పీడింపబడతారు.

# 13. నవరత్నాలు

## వజ్రం

వజ్రం కలలో కనిపిస్తే మీకు త్వరలో వివాహం జరుగుతుంది. ఎంతో కాలంగా జరగని పని యిటే అయిపోతుంది. ఎలాంటి పనులలో నైనా విజయాన్ని సాధించటం జరుగుతుంది.

## వైఢూర్యం

కలలో వైఢూర్యం కనిపిస్తే మిత్రులకు మీ అభిప్రాయాలను నచ్చజెప్పి వారిచేత శభాష్ అనిపించుకుంటారు. ధరిస్తే మీరు అందర్నీ ఆకర్షించకలుగుతారు. వైఢూర్యం కలలో దొరికితే లాటరీ లాంటి వాటిల్లోగాని, రేసుల్లోగాని పెద్ద మొత్తం లభించవచ్చు.

## మరకతం

కలలో దీన్ని చూచినట్లయితే భాగ్యవంతులైన వారితో పరిచయమై, అది పెండ్లికి దారి తీయగలదు. మీరు వివాహితులైతే భాగ్యవంతులతో వియ్య మందుతారు. ఆకు పచ్చరంగుగల మరకతం చూస్తే భాగ్యవంతులవుతారు. పాలరంగులో వున్నదాన్ని చూస్తే సంపదలు పెరిగి పేరు ప్రతిష్టలు తెచ్చిపెడతాయి.

## మాణిక్యం

స్వప్నంలో దీన్ని చూస్తే ప్రతి పనిలో విజయం మీదే! ధరించినట్లయితే ఉద్యోగ సంప్రాప్తి కలుగుతుంది. దీన్ని బహుమతిగా అందుకుంటే బంధువర్గంలో మీకు పేరు ప్రతిష్టలు కలుగుతాయి. పోగొట్టుకుంటే కీడుకలిగే సూచన లున్నాయి.

## పుష్యరాగం

ఇది కలలో కనిపించిన యెడల కుటుంబంలో అనవసరమైన మనస్పర్థలు ఏర్పడతాయి. దీన్ని ధరిస్తే పుత్ర సంతానం కలిగే యోగం వుందన్నమాట. కలలో దీన్ని పోగొట్టుకున్న వారికి వ్యాపారంలో నష్టము వస్తుంది.

## గోమేధికం

గోమేధికమును కలలో గాంచిన వారికి త్వరలో వున్నతపదవి లభిస్తుంది. ధరించితే స్థలమార్పు జరుగుతుంది. దొరికితే కుటుంబంలో సుఖ సంతోషాలు ఏర్పడుతాయి. పోగొట్టుకుంటే రోగపీడ కలుగ వచ్చు.

## ముత్యం

దీన్ని సప్నములో చూచిన వారికి విషాదం కలుగుతుంది. అనుకోని విధంగా విచార వార్తలు వింటారు. బహుమతిగా అందుకుంటే అనుకోని ఆపదలు చుట్టు ముట్టుతాయి. ధరించితే ఇంట్లో కలతలు రేగతాయి. పోగొట్టుకుంటే ఆపదల నుండి ముక్తి కలుగుతుంది. ముత్యం కలలో దొరికితే ఎటునుంచో నిందలు వచ్చి మీ మీద పడుతాయి.

## రత్నం

రత్నాన్ని మీరు కలలో చూచిన యెడల జీవితం పైన అంతు లేని ఆశను పెంచుకుంటారు. దీన్ని ఎక్కడో దాచివుంచినట్లు కల గన్నచో, మీ పేరు ప్రతిష్ఠలు దాదాపు ప్రపంచమంతా మారుమ్రోగే ఘనకార్యాన్ని ఏదో మీరు చేయబోతున్నారు. రత్నాన్ని బహుమతిగా అందుకుంటే ఆస్తి హోదా పెరుగుతుంది. దీన్ని ధరిస్తే అహంకారం

గర్వం ఏర్పడతాయి. దొరికితే మీకు త్వరలో దరిద్రం చుట్టుకుంటుందనే హెచ్చరిక చేయబడిందని భావించాలి.

## పగడం

కలలో మీకు పగడాలు కనబడితే, ప్రభుత్వపు ధనం అందుకునే యోగం మీకు కలుగుతుంది. ధరిస్తే పట్టినశని వదిలి పారిపోతుంది. బహుమతిగా అందుకుంటే సమస్యల నుండి మీకు విముక్తి లభిస్తుంది. పగడం కలలో దొరికితే దూరప్రయాణాలవల్ల భోగభాగ్యాలు కలుగుతాయి.



# 4. నిత్యావసర వస్తువులు

## కళ్ళజోడు

మీకు కంటి అద్దాలు పెట్టుకోవటం అలవాటు లేనప్పుడు కలలో కళ్ళజోడు పెట్టుకొన్నట్లు కన్పిస్తే మీ దారిలోని అడ్డంకులను తప్పించుకుని జీవితంలో శుభం పొందుతారు.

## గడియారం

గడియారం టిక్ టిక్ మన్న శబ్దం విన్నట్లు కన్పిస్తే మీ పనులకు అనుకూలత తక్కువ. ఆలస్యం ఎక్కువ. గడియారం గంటలు కొట్టున్నట్లు కలగంటే మీకు పది మందిచే పనిచేయించే శక్తి సామర్థ్యాలు కలుగుతాయి. దానికి కీ యిచ్చినట్లు కలగన్న మీ ప్రేమ వ్యవహారాలలో లాభం కల్గుతుంది. అలారం గడియారం అలారం కొట్టున్నట్లు కలలో కన్పిస్తే మీకు నచ్చని వార్తలు వినాల్సి వస్తుంది. చేతి గడియారం ధరించినట్లు కలగంటే ప్రతినిమిషం ఏదో పనిచేస్తున్నట్లే ఉంటుంది. ఎవరైనా దానిని బహూకరించితే సుఖసంతోషాలు ఎక్కువవుతాయి. దాన్ని యితరులు ధరించినట్లు కలలో చూస్తే మీకు ప్రతి విషయంలో విజయం కల్గుతుంది.

## కాగితాలు

కాగితాలు కొంటున్నట్లు కలగంటే మీ వ్యాపారం వృద్ధిలోకి వస్తుంది. తెల్ల కాగితాలను కలలో చూస్తే మీరు దస్తావేజు వ్రాయించుకొనే లావాదేవిలో పడతారు. వ్రాసిన కాగితాలు కాని, అచ్చు అయిన కాగితాలు కాని కలలో చూస్తే లాభంలేని పనులు చేస్తారు. బొమ్మ లున్న కాగితాలు కలలో కన్పిస్తే కుటుంబ కలహాలు వస్తాయి. ఎవ

రైనా కాగితాలమీద వ్రాయటం కలలో కన్పిస్తే మీరు ఎవరో ఒకరిపై మోజు చూపుతారు. కాగితాల్ని చూచినట్లు కాని, కోసేసినట్లు గాని కలగంటే మీరు ఎవరితోనో విడిపోయేందుకు ప్రయత్నిస్తారు. కాగితాల్ని తగలబెట్టినా ఇదే ఫలితం. చుట్టివున్న కాగితాల్నిగాని, న్యూస్‌ప్రింటు రోల్స్‌గాని కలలో కన్పిస్తే, మీరు కోర్టు వ్యవహారాలలో ఎక్కువ కాలం అవస్థలు పడ్తారు. అవి తెల్లని కాగితాలు అయితే మీరు దిగ్విజయం పొందుతారు. మరో రంగులో వుంటే కోర్టు కేసులలో మీకు ఓటమి తప్పదు. కాగితం దీపానికి రక్షణగా వున్నట్లు కలలో కన్పిస్తే మీ కష్టాలు త్వరలో తొలగిపోతాయి.

### పత్రిక

కలలో వార పత్రికను కాని, మాసపత్రికను కాని చూసి చదవటం ప్రారంభించినట్లు అయితే మీకు మంచి స్నేహితులు దొరుకుతారు. మీరు ఏదో కథను పత్రికకి వ్రాసి పంపినట్లు కలగంటే మీకు విజయము, ఆనందాలు కల్గుతాయి. కలలో దిన పత్రిక కన్పించి మీరు చదివినట్లు అయితే మీరు ఏదో విషయంలో గొడవలు పడ్తారు. ఆ విషయం అనేకులకు సంబంధించినది అవటంవల్ల ప్రతిమనిషీ మిమ్మల్ని బాధిస్తాడు. దినపత్రిక కొన్నట్లు కలగంటే మీరు దిగ్భ్రమ చెందే సంఘటనో వార్తో జరుగుతుంది.

### కొవ్వువత్తి

కొవ్వువత్తి వెలుగుతున్నట్లు కలగంటే మీ యింటిలో శుభ కార్యాలు జరుగుతాయి. దేవాలయంలోనో, చర్చిలోనో ఇది వెలుగుతున్నట్లు కలలో కన్పిస్తే మీ చర్యలవల్ల పరులు చెడిపోతారు. దీనిని వెలిగించి తీసుకొని వెళ్ళుచున్నటు కలగంటే మీ యింటిలో ఎవరిదో

వివాహం జరుగుతుంది. దీన్ని మీరు తయారు చేస్తున్నట్లు కలగంటే క్షణం తీరిక లేదు, పైసా ఆదాయం లేదన్నట్లుంటుంది జీవితం.

## టార్చిలైటు

వెలుగుతున్న టార్చిలైటు కాంతిలో మీరు నిల్చినట్లు కలగన్నచో మీరు చేస్తున్నపనిలో ఎక్కువ కష్టపడినా శ్రమకు మించిన ఫలితం వుంటుందని సూచన.

## రిబ్బను

కలలో రిబ్బను చూచిన వారికి మిత్రలాభం కల్గుతుంది. దీనిని గాలిలో ఎగురుతున్నట్లు కలగంటే శుభములు, సంతోషం ఎక్కువ అవుతాయి. కలలో కన్పించిన రిబ్బను ఎఱ్ఱగా వుంటే శుభాలు కల్గుతాయి. ఆకుపచ్చని రిబ్బను కన్పిస్తే మీ మంచి ఆశలు ఫలిస్తాయి. అది నీలంరంగులో ఉంటే ప్రేమవ్యవహారాలు సాగిస్తారు. తెల్లరిబ్బను కన్పిస్తే మీ ప్రేమబంధం పవిత్ర మవుతుంది. నలుపు రంగులో ఉంటే బంధుమిత్రులవల్ల దుఃఖం కల్గుతుంది.

## ఇస్త్రీ పెట్టె

దీనితో గుడ్డల్ని యిస్త్రీ చేస్తున్నట్లు కలగంటే మీకు అతిగా శుభాలువస్తాయి. చేస్తున్నప్పుడు గుడ్డ కాలితే మీకు అనుకూల వాతావరణం లభిస్తుంది.

## నవరం

కలలో దీనిని చూస్తే మీరు సులభంగా మోసపోయే ప్రమాదం ఉంది. ఏపనీ తొందరపడి చేయవద్దు. మీరు దీనిని తలలో పెట్టుకొన్నట్లు కలలో కన్పిస్తే మీ గురించి మీరు తక్కువగా అంచనా వేసుకొని హీనత పర్చుకొంటారు.

## మేకు

ఇనుముతో తయారైన మేకును కలగంటే మీకు పోటీ ఏర్పడుతుంది. మీ ప్రత్యర్థి మిమ్మల్ని ఓడిస్తాడు. గోడకో, చెక్కకో, మరే వస్తువుకో మేకును దిగేసినట్లు కలగంటే మీ విరోధి తీరని హాని కల్గిస్తాడు. నష్టం పూడ్చటం చాలా కష్టం. శవపేటికకు తగిలించే మేకును కలలో చూస్తే మిమ్ములను అదృష్టం వరిస్తుంది.

## గొడుగు

దీనిని కలలో చూచిన వారు జాగ్రత్తగా ఉండాలి. అనుకోని నష్టం ఏదో కలుగవచ్చు. ఎండలో గొడుగును వేసుకోటం కలలో చూస్తే మీ జీవితంలో మంచి మలుపు తెచ్చే అవకాశాన్ని వదలుకొంటున్నారు. వర్షంలో గొడుగుతో నడవటం కలలో చూస్తే అనుకొన్న పనికాదు. నిరాశ ఎదురవుతుంది. ఎక్కడన్నా గొడుగును మర్చిపోయినట్లు కలగంటే మీకు శాంతి వుండదు. ఏదో వేదనతో నిరంతరం చింతిస్తూ ఉంటారు.

## చెప్పులు

క్రొత్త చెప్పులు ధరించినట్లు కలగన్నట్లయితే వృత్తి వ్యాపారాలలో లాభం ఎక్కువగా ఉంటుంది. పాతవి కలలో కన్పిస్తే మీకు విచారం కలుగుతుంది. ఎప్పుడూ తీరికలేక బాధ పడుతూంటారు. బిగువుగా ఉన్న చెప్పుల్ని వేసుకున్నట్లు కలలో చూస్తే మీ పనులు అతికష్టం మీదగాని జరగవు. చెప్పులు పోయినట్లు కలవస్తే మీరు ఏవో క్రొత్త పనుల్లోకి దిగుతారు. పోయాయనుకున్న చెప్పులు దొరికినట్లు కలగంటే పలువురితో పరిచయాలు అవుతాయి. కర్ర చెప్పుల్ని కలలో చూడటం తటస్థిస్తే మీరు వక్రమార్గాలు త్రొక్కి చెడిపోయే వీలుంది. వాటితో నడిచినట్లు కలగంటే మీరు మంచి మార్గంలో కన్నా

చెడ మార్గాన పోవడమే హాయి అన్పిస్తుంది. మీరు త్వరలో పతన మౌతారు. చెప్పులకు చక్రాలున్నట్లు కన్పిస్తే మీరు చేసేపనులు నిర్విఘ్నంగా సాగుతాయి. వానిని ఎవరైనా వాడుతున్నట్లు కలగంటే మీ వల్ల ఇతరులు లాభం పొందుతారు. అరు చెప్పుల్ని కలలో చూస్తే మీకు కష్టాలు వస్తాయి. వానిని బహుమానంగా పొందితే మీకు వివాహం అవుతుంది. మీకు ఇంతకు ముందే వివాహం అయివుంటే మీరు మీ జీవిత భాగస్వామి చెప్పినట్లే చేస్తారు. వానిని బజారులో కొన్నట్లు కలగంటే మీ తెలివి తక్కువ తనమువల్ల కార్యాలు చెడతాయి. అరు చెప్పుల్ని మీరు ధరించినట్లు కలలో చూస్తే మీరు వూహించని గొడవలు వస్తాయి. చెప్పుల మడమ వూడిపోయినట్లు కలగన్నట్లయితే మీ మిత్రులతో గొడవలు వస్తారు. ఊడిపోయిన చెప్పుమడమను చెప్పుకు చేర్చి మేకో, సీలో కొట్టినట్లు కలగంటే ఏదో అసభ్యకరమైన పనిచేసి సంఘంలో పేరు పొగొట్టు కొంటారు. అలవాటైన కాళ్లకు చెప్పులు లేకుండా నడిచినట్లు కలగంటే ఆరోగ్యాభివృద్ధి. చల్లని నీటిలో గాని మంచుగడ్డ పైనగాని నడచినట్లు కన్పిస్తే మీవృత్తి వ్యాపారాలలో మంచి సంపాదనవుంటుంది. రాళ్లు, రప్పలలో నడిచినట్లు కలగన్నట్లయితే కష్టాలు తప్పవు. క్రొత్త చెప్పులు వేసుకొన్నందువల్ల పుండు పడినట్లు కలగంటే అధికప్రయాస-అల్పాదాయం కలుగుతాయి.

## సబ్బు

సబ్బును కలలో చూస్తే ఎక్కడో ఒకచోట గర్వభంగం అవుతుంది. సబ్బురుద్దు కొన్నట్లు కలగాంచినచో మీరు అనవసరంగా అమానుషంగా అవమానించ బడుతారు కలలో సబ్బును ముక్కలు ముక్కలుగా కోసినా, తరిగినా ఎంతో శ్రమపడిగాని మీ జీవితాన్ని ఒక దరికి చేర్చుకోలేకపోతారు. సబ్బు బుడగల్ని కలలో చూచిన

వారు అత్యాశలకుపోయి గాలిమేడలు కట్టారు. అది మంచిదికాదని గుర్తు. జాగ్రత్తగా ఉండకపోతే చాలనష్టపోతారు.

మందు

మీరు ఏదైనా మందు త్రాగినట్లు కలగంటే మీ విరోధి మిమ్మల్ని అపఖ్యాతి పాలుచేస్తాడు. మందు రుచిగా ఉన్నట్లు కలలో మీరు అనుభూతి పొందితే నష్టాలు ఎదురౌతాయి. అది చేదుగా ఉన్నట్లు అన్పిస్తే మీ ప్రత్యర్థిని చావుదెబ్బ తీసి విజయాన్ని పొందుతారు. మీరు యితరులకు మందు ఇచ్చినట్లు, అది తీపిగా ఉనట్లు మీరు అనుభూతి పొందినట్లు కలగంటే మీ సలహాలు పొంది ఇతరులు బాగుపడ్తారు. అది వారికి చేదుగా వున్నట్లుంటే మీ ప్రత్యర్థి మిమ్మల్ని మించిపోతాడు. ఏదైనా మాత్ర లాంటిది మ్రింగితే మీకు బదిలీరావచ్చు లేదా యిల్లు మార్తారు.

సంచి

(సంచి అంటే గోనెసంచికాని, ప్లాస్టిక్ సంచి కాని, గుడ్డసంచి గాని అయి ఉండవచ్చు.) చిన్నచేతి సంచిని తెరిచినట్లు కలలో చూస్తే యితరుల యెడల మీకు జాలి ఎక్కువగా ఉంటుంది. కాగితంతో చేసిన సంచిని కలలో చూచిన యెడల ఏదో ప్రమాదానికి గురౌతారు. గుడ్డ సంచిని కలలో చూస్తే వృత్తి వ్యాపారాలలో విజయం, ధనార్జన ఎక్కువ అవుతుంది. తోలుసంచి కలలో కన్పిస్తే ఎక్కడికో ప్రయాణం అవుతారు. పెద్దఖాళీ సంచిని చూస్తే ఇరుకైనచోట మీరు పనిచేయాల్సి వస్తుంది. నిండుగా వున్న సంచిని కలలో చూస్తే మీ పనులు త్వరగా అవుతాయి. మీ సంచిని ఎవరైనా మోసుకొని మీతోపాటు వస్తున్నట్లు కన్పిస్తే మీ స్నేహితులవల్ల లాభాలు కలుగుతాయి. నిండుగావున్న సంచిని మీరే మోసుకొని పోతున్నట్లు కలవస్తే లాభంలేని పనులను

కష్టపడి చేయాల్సివస్తుంది. ఖాళీ సంచిని మీరు మోసుకొని పోతున్నట్లు కలలో కన్పిస్తే పైసాకూడా లాభంలేని పనులలో యిరుక్కొంటారు. సంచిలోని వానిని చూడకుండా చేతితో తడుముతున్నట్లు కలగంటే దురదృష్టం మిమ్మల్ని వరిస్తుంది. నిరాశలు నిష్టూర్పులు ఎదురవుతాయి. మీ పనులు జరుగవు.

## పెట్టెలు

క్రొత్తగా కొన్న చిన్న పెట్టె (బ్రీఫ్‌కేస్)ను తీసుకెళ్లుచున్నట్లు కలగన్న మీ పనులు జరుగవు. అదే పాత పెట్టెలాగుంటే, మీ కార్యాలు అనుకూలంగా నెరవేరుతాయి. పెద్ద పెట్టెల్ని కలలో చూచిన వారికి ధనం లభిస్తుంది. బహుమతిగా పొందినా, అవి నిండుగావున్నా ఇదే ఫలితం. ఖాళీగావున్న పెద పెట్టెల్ని కలగంటే అన్నింటా దరిద్రమే ఎదురవుతుంది.

## పింగాణీ పాత్రలు

ఇవి ప్రమాదవశాత్తు పగిలినట్లు కలగన్నట్లయితే మిమ్మలను దురదృష్టంవరిస్తుంది. ఎత్తి విసిరికొట్టినట్లు కలగంటే ఎంతో అదృష్టం. కలలో పింగాణీ పాత్రల్ని చూచినట్లయితే మీ కుటుంబం సుఖసంతోషాలలో మునిగి తేలుతుంది. వానిని ఉపయోగించినట్లు కలగన్నా ఇదే ఫలితం. పగిలిపోయిన ముక్కల్ని కలలో చూస్తే ఎంతో అదృష్టం.

## సీసా

నిండుగావున్న సీసాను కలలో చూస్తే అతిగా లాభాలు పొందుతారు. ఖాళీగా ఉన్నట్లు కలగంటే డబ్బును పోగొట్టు కొంటారు. విచారకరమైన వార్తలు వింటారు.

## మంచం

స్వప్నంలో ఖాళీగావున్న మంచాన్ని చూస్తే మీ ఆప్తబంధువు

లలో ఎవరో మరణించవచ్చు. మంచం పైన ఒంటరిగా పడుకొన్నట్లు కలగంటే మీకు అనారోగ్యం సంభవించవచ్చు. పిల్లలతో పడుకొన్నట్లు కలగంటే మీరు అనుకొన్నవన్నీ జరుగుతాయి. మంచాన్ని అలంకరిస్తున్నట్లు లేక సర్దుతున్నట్లు కలగంటే ప్రేమకోసం ఎదురుచూస్తున్నట్లు సూచన. మీరు పురుషులైతే స్త్రీతో మంచంపై పడుకొని వున్నట్లు కలగంటే మీ మనస్సు కామవాంఛతో వురకలు వేస్తుందని గుర్తు. మీరు స్త్రీలై పురుషునితో పడుకొని వున్నట్లు కలగన్నా అదే అర్థం. నగ్నంగా ప్రేమికులతో కలసి పడుకొని శృంగారకేళిలో తేలినట్లు కలగంటే అనారోగ్యం, వృధా ఖర్చులవుతాయి.

## ఊయల

ఖాళీగావున్న ఊయల కలలో కొస్తే మీకు ఏదో రోగంరావచ్చు. పిల్లలకు కష్టం కలుగవచ్చు. పసిబిడ్డను వుయ్యాలలో వూపినట్లు కలగంటే వృత్తి వ్యాపారాలలో ఘనవిజయం. కుటుంబంలో శాంతి సౌఖ్యాలు లభిస్తాయి.

## పరుపు

హాయిగా పరుపు మీద పవళించినట్లు కలగన్నట్లయితే ఏదో వెధవపనిచేసి మీ పరువు ప్రతిష్ఠల్ని పోగొట్టు కొంటారు. జాగ్రత్తగా ఉండటం మంచిది.

## తలగడ

మెత్తగా ఉన్న తలగడపై కూర్చున్నట్లు కలగంటే మీ జీవితంలో ఎన్నో సుఖాలు లభిస్తాయి. దానిమీద పడుకొన్నట్లు కలగంటే నిశ్చింతగా సాగిపోయే జీవితం లభిస్తుంది. గట్టిగా వున్న దిండుపై పడుకొన్నట్లు కలగన్నట్లయితే మీ జీవితంలో ఎన్నో కష్టాలు ఎదురు అవుతాయి. దిండును ఎవరిమీదికైనా విసిరినట్లు కలలో చూస్తే తప్పు చేసి క్షమాపణ చెప్పుకోవాల్సి వస్తుంది.

## దుప్పటి

కలలో క్రొత్తగావున్న తెల్లటి దుప్పటి కన్పిస్తే మీరు నిరాశ చెందిన పనులే మీకు ఘనవిజయాన్ని చేకూరుస్తాయి. అవిమాసిపోయి నట్లు కన్పిస్తే మీపై ఎవరో కుట్రపన్న గలరు. అవి చినిగినట్లు కనబడినా ఫలితంఇదే. క్రొత్తగా కొన్న దుప్పటిపై నడిచినట్లు కలలో చూస్తే మీదాయాదుల ఆస్తి లభిస్తుంది. అదే చినిగిన లేక మాసిన దుప్పటి అయితే మీది వృధాశ్రమగామారే ప్రమాదం ఉంది. దుప్పటిలో చుట్టుకొనిపోయి వున్నట్లు కలగంటే మీరు ప్రేమవ్యవహారాలలో పడుతారు. గొడవలు అవుతాయి.

## నిచ్చెన

నిచ్చెన జారవేసినట్లుకాని, క్రిందవాల్చి ఉన్నట్లు కాని కలలో కన్పిస్తే మీకు మంచి అవకాశం వస్తుంది. దాన్ని సద్వినియోగం చేసుకోడం మంచిది. నిచ్చెనను ఎవరో తీసుకొని పోతున్నట్లు కలగంటే మీకు కలగబోయే మంచి అవకాశాన్ని ఎవరో వినియోగించు కొంటారు. మీరు నిచ్చెనను మోసుకొని పోతున్నట్లు కలగంటే అంచె లంచెలుగా జీవితంలో ఉన్నత దశలను పొందుతారు. నిచ్చెనను ఎక్కుతున్నట్లు కలగన్నట్లయితే మీకు అంతులేని విజయాలు త్వరలో లభిస్తాయి. నిచ్చెన నుండి క్రిందికిదిగుతున్నట్లు కలగన్నట్లయితే మీకు అదృష్టపు రోజులు వెనక్కు వెళ్ళిపోతున్నాయి. దానిమీద నుండి పడిపోయినట్లు కలవస్తే మీ పనుల్లో ఘోర పరాజయం పొందుతారు.

## అద్దం

స్వప్నంలో అద్దంకన్పించిన వారు తమ తప్పులు తామే తెలుసుకొని మసలగలరు. దానిలో మీ రూపాన్ని చూచుకున్నట్లు కలగంటే మీలోని లోపాలను యితరులు వెలికితీ స్తారు. కలలో అద్దం

పగిలినట్లు కన్పించినా మీరుదాన్ని పగలగొట్టినట్లు కన్పించినా మీరు తల బిరుసుతనంతో చెడును మీదవేసు కొంటారు. గదిగోడల నిండా అద్దాలను కలలో చూచిన వారికి మంచి ఉజ్వల భవిష్యత్తు కలుగుతుంది. చిన్న అద్దాన్ని చూచి దానిలో మీ ప్రతిబింబాన్ని కంటే మీరు పురుషులైతే స్త్రీలతో తగాదాలువస్తాయి. మీరు స్త్రీలైతే పురుషులతో వివాదాలు వస్తాయి. అద్దం మీ చేతిలో పగిలినట్లు కలగంటే మరొకరు కోరిన సహాయాన్ని పరిస్థితులవల్ల చేయకతప్పదు. కిటికీకి అద్దాన్ని బిగించినట్లు కలగంటే మీ జీవితం సాఫీగా సాగిపోతుంది.

## దువ్వెన

కలలో దువ్వెనతో తలదువ్వుకున్నట్లు కన్పిస్తే మీ జీవితంలో ఒడుదుడుకులు ఏర్పడుతాయి. దాన్ని పోగొట్టుకొన్నట్లు కలగంటే మీరు ఎంత జాగ్రత్తగావున్నా మిత్రులతో గొడవలు వస్తాయి. దువ్వెనను కలలో కొన్నట్లు చూస్తే, చెల్లా చెదురుగావున్న మీపనులన్నిటినీ ఒకదారికి తెచ్చుకొంటారు.

## త్రాడు

త్రాడుతో ఏదైనా కడుతున్నట్లు కలగంటే మీకు అనవసర శ్రమ కల్గుతుంది. కట్టిన త్రాటిని విప్పినట్లు కలలో చూస్తే మీకు స్నేహితులవలన లాభాలు కలుగుతాయి. దానిని పట్టుకొన్నట్లు కలగంటే మీరు కోరినదే తడవుగా సహాయంచేసే స్నేహితుడు దొరుకుతాడు. త్రాడుకట్టి దానిమీద మీరు నడుస్తున్నట్లు కలగంటే మీ నిర్ణయాలు అవకతవకలుగా వుంటాయి. దానిమీద నడుస్తూ జారిపడినట్లు కలగన్నట్లయితే వారి మనస్సుకు శాంతివుండదు. ఎవరన్నా తాటిమీద నడుస్తున్నట్లు కలలో కన్పిస్తే మీరు చేయబోయే సాహసకార్యాలలో జాగ్రత్తపడటం మంచిది. అతడు దానిమీద నడుస్తూ జారిపడిపోతే సాహసకార్యాలలో మీరు నష్టపడ్తారు.

బాల్చీ(బొక్కెన)

కలలో బాల్చీని చూస్తే మీరు కష్టాలలో వుంటే ఆదుకుని ఓదార్చేవారు లభిస్తారు. నిండుగా వున్న బాల్చీని మోసుకెళ్తున్నట్లు కలగన్న మీకు త్వరలో లాభాలు కల్గుతాయి. బాల్చీమీదకు తూలిపడి నట్లు కలవస్తే మీకు ఏదో కీడు జరుగుతుంది. లేదా మరణం సంభ వించవచ్చు. బాల్చీ బావిలో పడినట్లు కలవస్తే ప్రారంభించిన పనులు ఆగిపోతాయి. బావిలోపడి పోయిన బాల్చీని ఎవరైనా పైకి తీస్తే ఆర్థిక ఇబ్బందులు తీరిపోతాయి.

కాగు

మీకు కాగు కలలో కన్పిస్తే శుభసూచకం, దానిలో నీళ్లు బాగా మరుగుతున్నట్లు కన్పిస్తే మీకు, మీ కుటుంబానికి ఎన్నో లాభాలు కలుగుతాయి.

బాన (కుండ)

స్వప్నంలో బాన కన్పిస్తే దేనినో మర్చిపోయి హాయిగావుండా లన్న మీ ప్రయత్నం సఫలంకాబోదు. దాన్ని కలలో బ్రద్దలు కొట్టినట్లు చూస్తే మీరు బంధుమిత్రులతో చాలా అసహ్యంగా ప్రవర్తించి, వారి మనస్సును గాయపరుస్తున్నారని తెలుసుకోండి.

గిన్నె

ఖాళీగావున్న గిన్నె కలలో కన్పిస్తే మీ యింటికి ఎవరో రాబందులాంటి బంధువులు వస్తున్నట్లు గుర్తు. గిన్నె నిండుగా వున్నట్లు కలగంటే మీకు గొప్ప వారితో విందు భోజనాలు చేసే యోగముంది. అది జారినట్లు కలగన్నట్లయితే ఫలితం ఇదే. కప్పులాంటి దానిలో ఏదైనా త్రాగినట్లు కలలో కన్పిస్తే ఘనవిజయం, అదృష్టం కలుగుతాయి.

## పెనం

పొయ్యిమీద పెట్టబడిన పెనాన్ని కలలో చూస్తే లాభాలు కలుగుతాయి. ఖాళీగా క్రింద పెట్టబడినట్లు చూస్తే మీరు ఆశించిన పనులు పూర్తికావటం కష్టం. నల్లబడిపోయిన పెనాన్ని తోముతున్నట్లు కలగంటే మీరు చేసే ప్రతి ప్రయత్నం ఫలించి లాభం చేకూరుతుంది.

## గ్లాసు (లోటా)

ఖాళీగావున్న గ్లాసును లేక లోటాను కలలో చూస్తే మీరంటే అసూయపడి ఏడ్చేవారు తయారవుతారు. అది నిండుగా వున్నట్లు కలగంటే మీకు మంచి కీర్తి లభిస్తుంది. ఖాళీగ్లాసును నీటితో నింపినట్లు కలగన్న మీకు మంచి ఆరోగ్యం కలుగుతుంది. దాన్ని బ్రాందీ వగైరా మత్తు పానీయాలతో నింపినట్లు కలవస్తే మీకు వినోదకాల క్షేపాలు అతిగా లభిస్తాయి. గ్లాసును కొన్నట్టు కలగంటే మీ చేయి ధారాళమైనదని అతిగా ఖర్చు పెట్టున్నారని గుర్తు. దాన్ని పగులగొట్టినా చితుకగొట్టినా మీకు మీ స్నేహితులతో తగాదాలువచ్చి విరోధులు అవుతారు. పగిలిపోయినగ్లాసును గాని, లోటానుగాని కలలో చూస్తే మీకు అనేక శుభాలు కల్గుతాయి.

## సీసా

నిండుగావున్న సీసాను స్వప్నంలో చూస్తే మంచి భవిష్యత్తు కల్గుతుంది. సుఖశాంతులు లభిస్తాయి. ఖాళీగా వున్న సీసాను కలలో చూస్తే ఒక పనివల్ల మీకు నష్టాలు కల్గుతాయి. పగిలిన సీసాను కలలో చూస్తే ఏవో కష్టాలు వస్తాయి.

## ఫ్లాస్కు

ఇది కలలో కన్పిస్తే మీరు మీ స్నేహితునితో కలసి మెలసి తిరుగకపోతే మీ స్నేహం భంగం అవుతుందని, అది కష్టాలకు దారి

తీస్తుందని తెలుసుకోండి. దీనిని పగులగొట్టినట్లు కలగంటే మీరు మంచి మిత్రులను దూరంచేసు కొంటారు.

గరిటె

దీనిని కాని, పోర్కును కాని పట్టుకొన్నట్లు కలగంటే మీరు అతిగా మోసగించబడతారు. చేతిలోని గరిటెను క్రింద పారవేస్తే బంధు మిత్రులతో తగాదాలు వచ్చి ఆవేశాలు పెరుగుతాయి. దానితో ఎవరినన్నా చూపిస్తున్నట్లు కలగంటే మీ చుట్టు ప్రక్కల నున్నవారు మీ మంచి తనాన్ని అలుసుగా తీసుకొని కలతల్ని సృష్టిస్తారు. ప్రజా నాయకులు జాగ్రత్తగా ఉండటం మంచిది.

చీపురుకట్ట

ఇది కలలో కన్పిస్తే మీకు ఎందుకూ కొరగాని వారితో పరిచయాలు వృద్ధి అవుతాయి. దీనితో చిమ్ముతున్నట్లు కలగంటే మిమ్మల్ని వెంటాడుతున్న కష్టాలు తొలగిపోతాయి. చీపురుకట్ట పోయినట్లు కల వస్తే గృహనిర్వహణలో మీరు పనికిరానివారు అవుతున్నారని గుర్తు.

సామాను

కలలో చిందర వందరగా పారవేసిన సామానులు చూస్తే మీరు ఎక్కడికో ప్రయాణం చేస్తారు. మీ సామానులను కూలీ మోసు కొస్తూవుంటే మీకు వృత్తి వ్యాపారాలలో ఘనవిజయం లభిస్తుంది. అవి జారిపడిపోతున్నట్లు కలగంటే మీకు సుఖశాంతులు దూరమవుతాయి.

తాళం

తలుపుకు వేసిన తాళం కన్నంలోనుండి చూస్తున్నట్లు కలగంటే మీ పనులవల్ల మీకు అపఖ్యాతి లభిస్తుంది. తాళం కన్నంలో

తాళం చెవిని పెట్టున్నట్లు కలగంటే మీరు ప్రేమ వ్యవహారాల్లో పడ్తారు.

తా ళం చె వి

కలలో తాళంచెవిని చూస్తే మీరు రహస్యమైన పనులలో పాల్గొనవలసి వస్తుంది. దాన్ని పోగొట్టుకొన్నట్లు కలవస్తే మీరు ఆశించిన పనులు జరుగవని ఆలస్యంగా తెలుస్తుంది. పోయిందను కొన్న తాళంచెవి దొరికినట్లు కలలో కన్పిస్తే మీకు తెలిసిన విషయాలు నలుగురికి చెప్పటంవల్ల మీకే నష్టం. పారవేసుకొన్న తాళంచెవి ఎంత వెదకినా దొరకనట్లు కన్పిస్తే మీ రహస్యాలన్ని బయటకు లాగాలని ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతాయి. ఎవరిదో పోయిన తాళంచెవి మీకు దొరికినట్లు కలలో కన్పిస్తే వారి రహస్యాలు మీ గుప్పిటిలోనికి వస్తాయి.

సూ ది

స్వప్నంలో సూది కన్పిస్తే మీ వెనుక గోతులు తీసేవారు అనేకు లున్నారని తెలుసుకోండి. సూదితో ఏదైనా కుట్టుతున్నట్లు కలలో కన్పిస్తే మీ అర్థంలేని పనులవల్లనో, మాటలవల్లనో మీకు ఎందరో విరోధులు ఏర్పడతారు. సూదిలోకి దారం ఎక్కించినట్లు కలగన్న మీకు కష్టాలు కలిగి బాధలు కొంతకాలం తప్పవు. సూదితో చేయి గుచ్చుకొన్నట్లు కలలో చూస్తే మీ మిత్రులతో విరోధం వస్తుంది.

దా ర ం

దారం బంతిగా కలలో కన్పిస్తే మీకు చికాకులు కలిగించే వ్యవహారాలు జరుగుతాయి. దారం చిక్కుబడినట్లు కలలో కన్పిస్తే మీకు ఎవరితోనో గొడవలు వస్తాయి. చిక్కుదారాన్ని సరిచేసినట్లు కలగంటే ఎన్ని కష్టాలు వచ్చినా మీరు మనోనిబ్బరాన్ని కోల్పోరు. పార్శిలుకు

కట్టిన దారాన్ని వూడదీస్తే మీకు సంతోష సుఖాలను యిచ్చే పనులు జరుగనున్నాయి. దారాన్ని తెంపినట్లు కలగంటే మీ ఆశలు నెరవేరవు. దారాన్ని కోసినా, కత్తిరించినా ఇదే ఫలితం. రంగురంగుల అల్లిక దారాల్ని చూస్తే సరసం తెలిసినవారితో పరిచయం కలిగి సంతోషం పొందుతారు.

గుండుసూది

దీన్ని కలలో చూచినవారిని ఇరుగు పొరుగులు అకారణంగా హేళన చేస్తారు. దీన్ని దేనికైనను గుచ్చినట్లు కలగంటే మీ ఆశలు నెరవేరవు. అది మీ చేతిలో గుచ్చుకొన్నట్లు కలలో కన్పిస్తే గతంలో జరిగినవి గుర్తుకొచ్చి విచారం కలుగుతుంది. గుండుసూది కోసం వెతికి అది కనిపించకపోయినట్లు కల గన్నట్లయితే మీకు శుభాలు కలుగుతాయి.

తివాసీ

తివాసీని కలలో చూస్తే మీ కుటుంబంలో కలతలు ప్రారంభమవుతాయి. వాటివెంట కష్టాలు వస్తాయి. దాన్ని శుభ్రం చేస్తున్నట్లు కలగంటే మీకు కష్టాలు కలిగించేవారు తారసపడతారు. తివాసీమీద దర్జాగా నడుస్తూన్నట్లు కలగన్నచో మీరు అధిక వ్యయంచేస్తూ జల్సాలు చేస్తారు. ఎవరికైనా రెడ్ కార్పెటు పరచినట్లు కలలో చూస్తే మీకు అధికార హోదా ఏదైనా కలుగుతుంది.

నోట్లు

కలలో కరెన్సీ నోట్లు చూస్తే ఆర్థికంగా నష్టపోతారు. వాటిని లెక్కపెస్తున్నట్లు కలగంటే మీ భోగభాగ్యాలు తరగిపోతాయి. ఆ నోట్లు క్రొత్తగా వున్నట్లు కన్పిస్తే మీకు ధనలాభం కల్గుతుంది. పాత నోట్లు కలలో కన్పిస్తే మీకు కష్టాలు ఎక్కువవవుతాయి.

## చిల్లర

స్వప్నంలో చిల్లర డబ్బులు చూచినవారు తమ వృత్తి వ్యాపారాలలో జాగ్రత్తపడకపోతే బాగా నష్టపోతారు. ఇతర దేశాల నాణెములు కలలో కన్పిస్తే మీకు లాభాలు ఎక్కువగా వస్తాయి. పాతగా వున్న విదేశ నాణాలు కలలో చూస్తే ఏదో పెద్ద ప్రయత్నం చేసి ఘనవిజయం సాధిస్తారు.

## డబ్బు

మీరు కలలో డబ్బును (చిల్లర, నోట్లుకటలగాపులగంగా) చూస్తే ఎదురుచూడని ఖర్చులు ఎక్కువగా వచ్చిపడతాయి. డబ్బు సంపాదించినట్లు కలగంటే ప్రేమ వ్యవహారాలలో మీకు విజయం కలుగుతుంది. డబ్బు పోయినట్లు కలగన్న కొద్ది రోజులపాటు కష్టాలు పడాల్సివస్తుంది. డబ్బు దొరికినట్లు స్వప్నంలో చూస్తే వృత్తి వ్యాపారాలలో కష్ట నష్టములు తొలగి లాభాలలోకి వస్తారు. బిచ్చగానికి డబ్బు యిచ్చినట్లు కలగంటే మీకు ఎంతో లాభం కలుగుతుంది. పట్టినదంతా బంగారం అవుతుంది. విదేశ ధనం కలలో చూస్తే మీరు ప్రారంభించబోయే పనుల్లో నష్టం కలుగవచ్చు.

## చెక్కు

మీరు స్వప్నంలో చెక్కును చూస్తే మీ స్నేహితుడు మీ అవసరానికి మొండిచేయి చూపిస్తాడు. కలలో మీకు ఎవరన్నా చెక్కునిచ్చినా అదే ఫలితం. చెక్కును మీరు వ్రాస్తున్నట్లు కలగన్న మీ స్నేహితునికి యిచ్చిన మాటను నిలుపుకోలేరు.

## బ్రష్

కలలో దీన్ని చూస్తే అనవసరంగా మీరు నలుగురిలో అవమా

చాల పాలవుతారు. బట్టల్ని బ్రష్‌తో శుభ్రం చేస్తున్నట్లు కలరావటం. అంటే మీకు చీకాకులు వస్తున్నాయని గుర్తు. చెప్పులు, బూట్లు పాలిష్ చేస్తున్నట్లు కలగంటే మిమ్మల్ని ఎవరో అవమానిస్తారు. పాత బ్ర వాడినట్లు కలగంటే మీ ఆశలు అణగారిపోతాయి.

## చొక్కా

చొక్కాను విప్పుతున్నట్లు కలగంటే మీరు ఆశించింది జరుగదు. మాసిన చొక్కాను వేసుకొన్నట్లు కలలో కన్పిస్తే మీరు పనిని త్వరగా చేయలేరు. చిరిగిన చొక్కాను వేసుకొన్నట్లు కలగంటే మీ శత్రువులు మిమ్మల్ని ఏమీ చేయలేరు. దాన్ని ఇస్త్రీ చేసినట్లు కలలో కన్పిస్తే మీకు కీర్తిప్రతిష్ఠలు కలుగుతాయి. సిల్కుతో తయారైన గుడ్డతో కుట్టిన చొక్కాను కలలో చూస్తే ఆర్థిక ఇబ్బందులు ఎక్కువ అవుతాయి. మీ చొక్కా ఎక్కడో పోయినట్లు కలగంటే రాబోయే కాలం మీకు చెడ్డదిగా పరిణమిస్తుంది.

## లా

మీ స్వప్నంలో ఎవరన్నా లాల్చీని ధరించినట్లు కన్పిస్తే పిక్నిక్ లోనో, ఉత్సవంలోనో, సభలలోనో మీకు ఒకరితో పరిచయమై, ప్రేమగా వృద్ధిపొంది, వివాహం జరుగుతుంది. మన్ను కొట్టుకొనిపోయి నట్టున్న లాల్చీ కలలో కన్పిస్తే మీరు అసభ్యమైన, అసహ్యకరమైన ప్రేమ కలాపాన్ని జరుపుతారు. దాన్ని మీ జీవితాంతం తల్చుకుంటూ అసహ్యించుకొంటుంటారు.

## పాంటు (పంట్లాం)

కలలో దీన్ని చూస్తే మీకు జీవితంలో ఒక నిశ్చిత పరిస్థితి ఏర్పడుతుంది. సుఖశాంతులు కలుగుతాయి. పాంటు ధరించినట్లు కల

గన్నా ఫలితం ఇదే. దీన్ని ఇస్త్రీ చేసినట్లు కలగంటే మీకు ధనార్జన పెరుగుతుంది. పంట్లామును పోగొట్టుకొన్నట్లు కలలో కన్పిస్తే మీరు అవమానించ బడతారు. బెల్ బాటమ్ పాంటు ధరిస్తే తియ్యని కబుర్లు వింటారు. టైటు పాంటు ధరిస్తే ప్రేమకలాపం స్త్రీ ధరించినట్లు కలగంటే కామ సంతృప్తి కల్గుతాయి.

## చెడ్డీలు

స్త్రీలు కలలో చెడ్డీలను చూస్తే పురుషులతో స్నేహంచేసి విజయాన్ని సాధిస్తారు. పురుషులు చూస్తే అతివాగుడువల్ల గొడవలు తెచ్చుకొంటారు. నల్ల చెడ్డీల్ని కలలో చూస్తే మీరు ప్రేమలో పడతారు.

## కోటు

కలలో పెద్ద కోటును ధరించి దాని బొత్తాములు సరిచేసుకుంటున్నట్లు చూస్తే వృత్తి వ్యాపారాలలో కొద్దిగా అలజడి ఏర్పడుతుంది. కొద్ది రోజుల తరువాత సాఫీగా మారినా వానికి సంబంధించిన గొడవలు సమసిపోవు.

## బొత్తాము (బటన్)

మీ చొక్కా, పాంటు, కోటుల తాలూకు బొత్తామును కలలో చూస్తే ధనలాభం కల్గుతుంది. అది వూడిపోయినట్లు కలగంటే మీ మిత్రులు ద్రోహం తలపెడ్తారు. ఊడిపోయిన చోట బొత్తాము కుట్టుకున్నట్లు కలలో కన్పిస్తే మీ జీవితం ఓ దరికిచేరి శాంతి భద్రతలు ఏర్పడుతాయి.

## పైగుడ్డ (పైకండువా)

స్వప్నంలో పైగుడ్డను వేసుకొన్న మొగవారిని చూస్తే మీకు సంబంధించిన స్త్రీలనోటి అహంకారంవల్ల మీకు కష్టాలు వస్తాయి. అదే ఆడది ధరించినట్లు కలలో చూస్తే వారిని అదృష్టం వరిస్తుంది.

### తువాలు

ఇస్త్రీ చేసిన లేక తెల్లగా వుతికిన తువాలును కలలో చూస్తే మీరు విచారవార్తలను వినాల్సి వస్తుంది. మాసిపోయిన తువాలు కన్పిస్తే మీ కుటుంబంలో గొడవలు ప్రారంభమవుతాయి. మీ శరీరాన్ని దానితో తుడుచుకొంటున్నట్లు కలగంటే మీకు భోగభాగ్యాలు కలుగుతాయి. మీ ఆరోగ్యం పెంపొందుతుంది.

### శాలువా

స్వప్నంలో శాలువా ధరించినట్లు కన్పిస్తే మీకు యిష్టమైన వారితో ప్రేమ వ్యవహారాలు ఏర్పడి తగాదాలు వస్తాయి, కాని విజయం మీదే. నల్ల శాలువా కన్పిస్తే మీకు అనారోగ్యం కలిగే ప్రమాదం వుంది.



# 15. అంకెలు

కలలలో కొందరికి అంకెలు కనిపిస్తాయి. ముఖ్యంగా లాటరీలలో, రేసులలో పాల్గొనే వాళ్ళకు యీ అంకెలు కనిపించి గారడీ చేస్తుంటాయి. అంకెలుగా గాని, అవే అక్షరాలుగా కనిపించవచ్చు. అంటే "1" లాగ కాని, "ఒకటి" అని అక్షరాలుగా గాని కనిపిస్తే వాటి ఫలితాలు ఏమిటి? చూడండి :—

**1** పెళ్ళి స్కీములు కాని, చిట్‌ఫండ్స్‌గాని, లాటరీలు గాని, వేరే ఏవైనా అలాంటి స్కీములే ప్రారంభిస్తారు. లాభాలు విపరీతముగా వుంటాయి. అయితే మీరుగా, లాటరీలలో గాని రేసులలో గాని పాల్గొంటే నష్టం రావచ్చు.

**2** అనుకోకుండా సుఖ సంతోషాలు లభిస్తాయి. దూరపు బంధువుల నుండి ఆస్తి సంక్రమిస్తుంది. అపరిచితులు అకస్మాత్తుగా పరిచయమై మిమ్మల్ని వారసుల్నిగా ప్రకటించి తమ ఆస్తిపాస్తుల్ని మీకు వ్రాసి యిస్తారు.

**3** ఆశ్చర్యకరమైన శుభవార్తలను వింటారు. మీరు ఆశ వదలుకున్న కార్యక్రమాలు అదృష్టంకొద్దీ ఫలిస్తాయి. ఇంటర్వ్యూలో పెదవి విరిచి కాదన్నవారే మిమ్మల్ని పిలిచి మరీ ఉద్యోగమిస్తారు.

**4** మిత్రుల బలవంతం మీదకాని, బంధువుల ప్రోద్బలం మీదకాని మీకు ఇష్టములేని పనులు మీరు చేయాల్సివస్తుంది. వాటిని గురించి మీరు విచారపడినా, అవి చేయక తప్పనిసరి అవుతుంది.

**5** మీ వ్యక్తిత్వానికి మురిసిపోయి, మంచి హోదా, అంతస్తుగల పెద్దలు మీతో స్నేహాన్ని కలుపుకుంటారు. మీరు స్త్రీలు అయితే ఏ భాగ్యవంతుల బంగళాలలోనో శాశ్వ

తంగా నివసించే అంతస్థును అందుకో గలుగుతారు. శుభ యోగంపడుతుంది.

**6** మీకు సంక్రమించవలసిన సొమ్ములు. ఆస్తులు అన్యాక్రాంతం కావచ్చు. మీ రెంత ప్రయత్నించినా మీకు మరలా దక్కకపోవచ్చు.

**7** మీ రెంత బుద్ధిమంతులుగావున్నా, మంచి ప్రవర్తనతో మెలగి లేనిపోని నిందల పాలవుతారు. విచారాన్ని కలిగించే వింత వ్యాఖ్యలు మీపై లేవదీయటానికి తీవ్ర ప్రయత్నాలు జరుగుతాయి. మీ రెన్నడూ మాట్లాడి ఎరుగని వ్యక్తితో మీకు లైంగిక సంబంధాన్ని అంటకడతారు.

**8** ఇంత క్రితం మీరెంత ప్రయత్నించినా కానిపనులు అనుకోకుండా నెరవేరుతాయి. అంతేకాదు మీ పేరు చెప్పుకుంటేకూడా మరి కొందరికి లాభించే యోగం వున్న కాలం మీకు వస్తుంది. జాగ్రత్తగా మీకు అనుకూలంగా మల్చుకుంటే మీ పలుకుబడి ఎన్నో రెట్లు సునాయాసంగా పెరుగుతుంది.

**9** వివాహం కానివారికి వివాహం అవుతుంది. నిరుద్యోగులకు ఉద్యోగం లభిస్తుంది. వివాహితులకు మగ సంతానం ప్రాప్తిస్తుంది. పెళ్ళిచూపులు అయి, ఎటు తెగక వున్న సంబంధాలు ముడివడి వైభవంగా పెళ్ళి అవుతుంది.

**0** సున్న కలలో కనబడితే అశుభం జరుగవచ్చు. సున్నాలు పెరిగినకొద్దీ ప్రమాద స్థితి పెరుగుతుంది. త్వరితంగాను ఆ ప్రమాదం జరగవచ్చు. జాగ్రత్తగా వుండటం మంచిది. ఆత్మీయులలో ఒకరికి ప్రాణాపాయం ఏర్పడవచ్చు.

**10** జీవితంలో అనుకోకుండా మంచి మలుపు ఏర్పడుతుంది. ఈ మలుపులో వలపుల రాణి లభించవచ్చు. తలచిన ప్రియుడు దొరకవచ్చు. ఇల్లు, నేల వంటి స్థిరాస్తుల్ని కొనవచ్చు.

**11**

మంచి జరిగే సూచనలున్నాయి. అనుకూల వార్తలు వింటారు. బంధువులు కానుకలతో మీ యింటికి వస్తారు.

**21**

మీ నగలో, భూములో, ఇల్లో కుదువబెట్టి డబ్బు తెచ్చుకొని అవసరాన్ని గడుపుకోవలసిన గడ్డు పరిస్థితి ఏర్పడవచ్చు. ప్రతి పని స్థిమితంగా చేయవలసిన కాలం.

**22**

వ్యాపారంలో గాని, ఇంట్లోగాని భాగస్వాములతో పేచీలు వస్తాయి. విడిపోయే పరిస్థితి కూడా దాపురించవచ్చు. విరక్తితో అఘాయిత్యానికి కూడ పాల్పడవచ్చు. నిగ్రహాన్ని పాటించవలసిన సమయం.

**30**

దిక్కులేని పిల్లలు మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తారు. వారికి మీరు మనసారా ఆశ్రయాన్ని ఇస్తారు. వారు పెరిగి పెద్దవారై మీకు కీర్తి ప్రతిష్ఠలు తెచ్చి పెడతారు.

**31**

మీ తెలివితేటలకు గుర్తింపురావటానికై ఎవరూ చేయని, చేయలేని పని, మీరు పూనుకొని సాధిస్తారు. అతి ప్రయాసతో కూడుకున్నా ఓ క్రొత్త విషయాన్ని కనిపెట్టి జగద్విఖ్యాతి పొందగలుగుతారు.

**32**

గుర్రపు పందేలలోను, లాటరీలలోను, అలాంటిదే మరికొన్ని స్కీములలోను డబ్బు సంపాదించాలని ఆశపడతారు. కాని దానివలన మీ చేతిలోవున్న డబ్బును మీరే పాడుచేసుకుంటారు. అంతేకాని మీరు లాభమును పొందలేరు.

**33** అనుకోకుండా ఏ గుళ్ళోనో పెళ్ళవుతుంది. ఏ స్నేహితుడో డబ్బిచ్చి వ్యాపారం చేయమంటాడు. ఏ అమ్మాయో వలచి వచ్చి ఒళ్ళో వాలుతుంది. అంతు లేని డబ్బూ, నగలు తెస్తుంది. ఆడవారైతే ఏ కోటీశ్వరుని కుమారుడో అదృష్టంకొద్దీ కౌగిల్లోకి తీసుకుంటాడు. మీరు కాలు క్రింద పెట్టకుండా సేవలు చేయిస్తూ తన కౌగిలిలోనే కరిగించుకుంటాడు. ఏదైనా బ్రహ్మాండమైన మంచే జరుగుతుంది.

**40** మీతో బాగా అనుకూలంగా వుంటూనే మీ మిత్రులు మీకు ద్రోహం చేస్తారు. మీతో కల్లబొల్లి కబుర్లు చెబుతూనే, మీతో తిరుగుతూనే మిమ్మల్ని ప్రేమించినవారు మోసం చేస్తారు. మీ కోపానికి గురి అవుతారు. అయినా మీరు శాంతం వహించటంవల్ల మీకు మంచిజరుగుతుంది.

**41** అప్పుల బాధ ఏర్పడుతుంది. ఇంట్లో చిన్నా పెద్దా సంగతులకు వాదాలు, తగాదాలు వస్తాయి. అపార్థాలు, అనర్థాలు, ఒకటి తరువాత ఒకటి సంభవిస్తాయి. జాగ్రత్తగా వుండవలసిన సమయం.

**42** పురుషులకు స్త్రీ లంటే భయం కలుగుతుంది. స్త్రీలకు పురుషులంటే ద్వేషం ప్రబలుతుంది. సుఖం తక్కువై, తృప్తి పొందలేక చింతించవలసి రావచ్చు.

**43** అబద్ధపు మాటలతో, పొగడ్తలతో మీ చుట్టూ చేరినవారు మీ మనస్సును పాడుచేయటానికి ప్రయత్నిస్తారు. చెప్పుడు మాటలు, ఇచ్చకాల కబుర్లు వినటం వల్ల మీకు నష్టం కలుగుతుంది.

**44** దూరదేశాలనుండి శుభవార్తలు అందుతాయి. దూరపు బంధువులనుండి విందు భోజనానికి ఆహ్వానాలు రావచ్చు. అపరిచితులు కూడా ఆదరంగా శుభ కార్యాలకు పిలిచి గౌరవిస్తారు.

**50** చెడువార్తలు అందుతాయి. దూరపు బంధువులలో ఒకరికి ప్రాణాపాయం కలుగవచ్చు.

**51** అర్థంకాని బాధ. శారీరకంగా గాయాలయ్యే ప్రమాదం. మానసికంగా అస్థిమితం కలుగుతాయి.

**52** రకరకాల పదార్థాలతో మంచి విందుభోజనం లభిస్తుంది. జాతి మత భేదాలులేని సమూహ వన భోజనాలలో పాల్గొంటారు. మీతోబాటు మిగిలినవారూ ఆనందపడతారు.

**53** పెద్దలు మీ ఇంటిని వెతుక్కుంటూ వస్తారు. చిన్ననాటి స్నేహితులు కలుస్తారు. మీతో చదువు కున్నవారు వచ్చి పలుకరించి ఏవో బహుమతులు మీకు యిచ్చిపోతారు.

**54** అదృష్టం కలిసివచ్చే కాలం. మీలోని నిరాశ తొలిగిపోతుంది. అన్నిటిలో మీదే పైచేయిగా వుంటుంది.

**55** ప్రభుత్వం ద్వారా మీకు సహకారం, గౌరవం లభిస్తాయి. ఆ గౌరవంతో మీరు ఎన్నో ఇతర ప్రాలాభాలు పొందుతారు.

**60** రౌడీలు మీవెంట బడతారు. వారిని పంపించిన వారు ఎవరో మీరు తెలుసుకుంటారు. తగిన శాస్తి చేస్తారు. అయినా జాగ్రత్తగా వుండటం మంచిది. అజాగ్రత్తవలన అపాయం జరగవచ్చు.

**61** క్రొత్త పరిచయాలు ఏర్పడుతాయి. అవి స్నేహంగా మారుతాయి. స్నేహం వివాహంవరకూ సాగుతుంది. అంతా శుభంగా జరిగి ఆనందాన్ని కలిగిస్తుంది.

**62** పట్టు బట్టలు లభిస్తాయి. పండితులకు శాలువలు, నటీనటులకు అవార్డులు, విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు శాంక్షన్ అవుతాయి.

**63** ప్రయాణాలంటే మీకు చికాకు వుండేమాట నిజం. కాని తప్పనిసరిగా ప్రయాణం చేయవలసి వస్తుంది. అదే చాల పెద్ద ప్రయాణంగాను, చాల కాలం పట్టేదిగానూ వుంటుంది. విదేశాలకే వెళ్ళాల్సి వచ్చినా ఆశ్చర్యపడ నవసరంలేదు.

**64** కోర్టు వ్యవహారాల్లో మీకు జయం లభిస్తుంది. మీతో తగాదా పడినవారే రాజీకి వస్తారు. అది మీకు లాభదాయకంగానే వుంటుంది.

**65** షికార్లు, సినిమాలు లాంటి వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. మీరు ఎవరిని వెంటబెట్టుకొని వెళ్ళినా వారి ద్వారా మీకు మంచి పేరే లభిస్తుంది.

సూచన :—పై అంకెలలో వరుస క్రమంలో కొన్నిటిని ఇచ్చి మరికొన్నిటిని వదలివేయటం జరిగింది. ఇందుకు కారణం మనస్తత్వ శాస్త్రవేత్తలు ఆ మిగతావాటికి ఇంకా ఇదమిద్ధమైన ఫలితాల్ని నిర్ణయించక పోవటమే.

# 16. నీరు

## నీటికి సంబంధించిన ఇతర కలలు

సముద్రంలోను, నదిలోను, కాలువలోను, సరస్సులోను నీరు వుంటుంది. అంతేకాదు, నీరు ఒక ప్రదేశాన్నుండి మరో ప్రదేశానికి పారుతుంది. ఈ నీటికి సంబంధించిన అనేక కలలకు ఫలితాలు ఎలా వుంటాయో చూడండి!

### సముద్రము

నిర్మలంగా వున్న సముద్రాన్ని కలలో చూస్తే తలపెట్టిన కార్యక్రమాలు సాఫీగా సాగిపోతాయి. తీరాన నిలబడి సముద్రాన్ని చూస్తున్నట్లు కలగన్నా, లేదా అలలు మిమ్మల్ని చుట్టుముట్టినట్లు కలగన్నా అనుకోని విధంగా ఆపదలు చుట్టుముట్టుతాయి. ఓడలో ప్రయాణంచేస్తూ సముద్రాన్ని దాటినట్లు కలగంటే అధికారం గలిగిన ఉద్యోగమో, దూర ప్రాంతంలో ఉద్యోగమో లభిస్తాయి. స్నానపు దుస్తులు ధరించి సముద్రపు ఒడ్డున సూర్యరశ్మిలో పడుకున్నట్లు కలగంటే ఇతరుల విమర్శలకు జవాబు చెప్పుకోవలసి వస్తుంది. నగ్నంగా పడుకున్నట్లు కలవస్తే బ్రతుకుతెరువుకోసం క్రొత్తమార్గం అన్వేషిస్తారు.

### చెఱువు

కలలో నిర్మలంగా వున్న చెఱువు కనిపిస్తే మీకు శుభవార్తలు అందుతాయి. మురికి నీటితో వున్న చెఱువును కలలో చూస్తే దుర్వార్త వినవలసి రావచ్చు. నిండుగా వున్న చెఱువు నడుమ తామరాకులలో భుజించినట్లు కలగంటే పరిపాలనాధికారం లభిస్తుంది.

### కాలువ

నీరు ప్రవహిస్తున్న కాలువను కలలో చూస్తే ప్రయాణం చేయు

వలసి వస్తుంది. బురద నీటితోనున్న కాలువను కలగంటే ప్రయాణంలో చీకాకులు ఏర్పడుతాయి.

బావి

మంచి నీటి బావి మీ కలలోకొస్తే ధనలాభం కలుగుతుంది. నీటి మట్టం పెరుగుతున్నట్లు కన్పిస్తే ధననష్టం ఏర్పడుతుంది. పొంగుతున్న నీటిని స్త్రీ కలలో చూస్తే ఆమె భర్తకు ఆపద రావచ్చు, లేదా బంధువులలో ఎవరికైనా ప్రమాదం కలుగవచ్చు.

నది

నిర్మలంగా వున్న నదిని కలలో చూస్తే అనుకున్న దానిని అవలీలగా సాధిస్తారు. కల్మషంగావున్న నదినీటిని కలగంటే చెడు ఆలోచనలతో మనసు పాడవుతుంది. నదిని ఈ ఒడ్డునుండి ఆ ఒడ్డుకు దాటుతున్నట్లు కలవస్తే కష్టాలు తీరిపోతాయి. అప్పుల బాధలు తీరిపోతాయి. నదిలో దూకినట్లు కలగంటే అశుభం కలుగుతుంది.

సరస్సు

వెన్నెల రాత్రి సరస్సులో ప్రయాణం చేస్తున్నట్లు కలగంటే మీరు సుఖంగా బ్రతకటానికి కావలసిన అన్ని సౌకర్యాలు లభిస్తాయి. సరస్సును మాత్రం కలగంటే ఆనందం, సంతోషం ప్రేమకలాపాలు మీకు అందుబాటులో వుంటాయి.

నీటి తొట్టి

రంగురంగుల చేపలు క్రిందికి పైకి ఈదులాడే నీటి తొట్టిని కలలో చూస్తే సంతోష వార్తలు వింటారు. మురికి నీటి తొట్టిని చూస్తే చుట్టాల రాకపోకలతో దండగ ఖర్చులు, చికాకులు ఏర్పడుతాయి.

## వాన నీరు

వాన కురుస్తున్నట్లు నీరు, నిలిచినట్లు మీరు కలగంటే అనారోగ్యం కలుగుతుంది. అంటు వ్యాధులు సోకవచ్చు. వాన నీటిలో మీకు కొంత వరకో లేక గొంతువరకో మునిగినట్లు కలగంటే విపరీత నష్టం వాటిల్ల వచ్చు.

## వడగళ్ల వాన

కలలో మీరు వడగళ్ల వానలో చిక్కుకున్నట్లయితే కుటుంబంలో అశాంతి, నిత్యజీవితంలో అసంతృప్తి ఏర్పడుతాయి. వడగళ్లను పట్టి నోట్లో వేసుకున్నట్లు కలగంటే తెలివిగా మీ చిక్కుల్ని పరిష్కరించు కుంటారు.

## వరద నీరు

వరదనీరు మీ కలలోకొస్తే దుర్మార్గుల కుట్రనుండి బయట పడ టానికి ఎంతో శ్రమ పడవలసి వస్తుంది. వరద నీటిలో మీరు కొట్టుకు పోతున్నట్లు కలవస్తే మీ తెలివి తక్కువ మాటలతో ప్రవర్తనతో తంటాలు కొని తెచ్చుకుంటారు.

## నీటి నురుగు

నీటిపై నురుగును మీరు చూస్తే స్నేహితులతో సరదాగా కాల క్షేపం చేస్తారు. భార్యతో షికార్లు కొడతారు. అవివాహితులు ప్రేమ కలాపాలు సాగిస్తారు.

## గాలి వాన

కలలో గాలి వానను లేదా తుఫాన్‌ను చూచినట్లయితే నష్టం కలుగుతుంది. అందులో మీరు చిక్కుకున్నట్లు కలగంటే విపరీత నష్టం.

ఏర్పడుతుంది. తుఫాన్‌లో చిక్కుకున్నవారిని మీరు కాపాడినట్లు కల గంటే మీకు మంచి తెలివి తేటలు అబ్బే అనుభవాలు కలుగుతాయి.

## ఊట నీరు

ఊటనీరు కలలో కనిపించిన వారికి మంచిరోజులు వస్తాయి. ఆ నీటిని త్రాగినట్లు కలగంటే అసంభవ మనుకున్న పనికూడా పూర్తవుతుంది.

## మంచు నీరు

కొండల మీది మంచు కరగి నీరుగామారి జారి ప్రవహిస్తున్నట్లు కలగంటే రానున్న ప్రమాదానికి హెచ్చరికగా ముందు జాగ్రత వహించి ఆపదను తప్పించుకుంటారు. మంచునీరు నదిగా మారినట్లు కలగంటే మీ ఆలోచనలు కార్యరూపం దాల్చి జయప్రదంగా ముగుస్తాయి.

## ఊబి నీరు

దీనిలో దిగబడినట్లు కలగంటే పరాధికారం పైనవేసుకుని ఆపదల పాలవుతారు. ఊబిలో దిగబడి పోయిన వారిని పైకి లాగి కాపాడినట్లు కలగంటే మీ చిక్కులు తీరిపోయి, ప్రశాంత జీవనం ఏర్పడుతుంది.

## బురద నీరు

బురద నీటిని కలలో చూచినవారికి వెంట తిరిగే వారివల్ల కష్టాలు కలుగుతాయి. మీపైన ఎవరన్నా బురద నీటిని చల్లినట్లు కల గంటే అపనిందల పాలవుతారు. మీరు ఎవరిపైన నైనా చల్లినట్లు కల గంటే మీపైన బడిన అపనిందలు తొలగిపోతాయి.

## కన్నీరు.

కలలో మీరు కన్నీరు గారిస్తే చిరకాలంగా వున్న దరిద్రం పరుగెత్తి పోతుంది. ఇతరుల కన్నీటిని మీరు కలగంటే మిత్రుల ఆర్థిక సహకారంతో సుఖజీవితం అమరుతుంది.

## ఆనందబాష్పాలు

మీ కలలో మీరు ఆనందంతో బాష్పాల్ని రాలిస్తే భోగ భాగ్యాలతో తేలియాడుతారు. ఎవరి ఆనంద బాష్పాలనైనా మీరు కలగంటే వారి సుఖమయ జీవితానికి మీరు సాయపడుతారు.

## చల్లని నీరు

చల్లని నీటిని కలలో చూచినట్లయితే శుభాలు కలుగుతాయి. ఈ నీటిని త్రాగినట్లు కలగంటే ధనలాభం కలుగుతుంది. ఐస్ కలిపిన నీటిని త్రాగినట్లు కలగంటే లాటరీలో బహుమతి లభించవచ్చు. ఎవరికైనా చల్లని నీటిని త్రాగటానికి ఇచ్చినట్లు కలవస్తే అవివాహితులకు చల్లని మనసుగలవారితో పెండ్లవుతుంది. పెండ్లయిన వారికి చక్కని సంతానం కలుగుతుంది.

## వేడి నీరు

వేడినీటిని త్రాగినట్లు కలగంటే మీరు నమ్మినవారు మీపై కుట్రపన్నుతారు. అసూయతో ఆపదలు సృష్టిస్తారు. మీరు ఎవరికైనా వేడి నీటిని త్రాగటానికి ఇచ్చినట్లు కలగంటే మీ చేతలవల్ల ఇతరులకు బాధలు కలుగ వచ్చు. వేడినీటి ప్రవాహాన్ని చూస్తే ఎంతో కష్టపడి పనులు సాధిస్తారు.

## ఏతాము నీరు

ఏతాము ద్వారా మంచి నీటిని తోడుతున్నట్లు కలగంటే సంప-

దలు కలుగుతాయి. ప్రేమికులకు త్వరలో పెండ్లి జరుగుతుంది. భార్యా భర్తలు అన్యోన్యానురాగాలతో మితిమీరిన సుఖాలు పొందుతారు. మురికి నీటిని ఏతాము ద్వారా తోడుతున్నట్లు కలగంటే ఆపదల పాలవుతారు.

## నీ టి పా రు ద ల

పంటకాలువల్లో నీటి పారుదలను కలలో చూస్తే ధనలాభం కలుగుతుంది. వేరే విధంగా నీటి పారుదల జరిగినట్లు కలగంటే కీర్తి ప్రతిష్ఠలు ఏర్పడుతాయి.

## ము రి కి నీ రు

కలలో ఏరకమైన మురికి నీటిని చూచినా తలచిన పనులు జరుగవు. ఏదో ఒక విధంగా ఆటంకాలు ఏర్పడుతాయి. మురికి నీటితో కాళ్ళు కడుక్కున్నట్లు కలగంటే కష్టాల మీద కష్టాలు వచ్చిపడతాయి. మురికి నీటిని త్రాగుతున్నట్లు కలగంటే వ్యాపారం మూలబడవచ్చు. ఉద్యోగం ఊడవచ్చు, అరెస్టు చేయబడవచ్చు, చివరకు జైలుపాలు కావచ్చు. మురికి నీటిని పుక్కిలించి ఉమ్మివేసినట్లు కలగంటే ఆపదలు కలిగినా కొద్దిపాటి నష్టంతో కోలుకుంటారు.



# 17. నెలలు

ఒక్కోసారి కలలో నెలలు కనిపించవచ్చు. జనవరి, ఫిబ్రవరి అనిగాని జనవరి ఫిబ్రవరి నెలలో జరిగినట్లు కాని కనిపించవచ్చు. వాటి ఫలితాలు చూడండి.

## జనవరి

మీకు మంచి ఆరోగ్యము, దీర్ఘకాల జీవితం, మంచి సంతానం, సుఖశాంతులు లభిస్తాయి. సంతృప్తి ఏర్పడుతుంది.

## ఫిబ్రవరి

భోగభాగ్యాలు, పాడిపంటలు సమృద్ధిగా లభిస్తాయి. మంచి స్నేహితులు, జీవిత భాగస్వాములు లభిస్తారు.

## మార్చి

సంఘములో గౌరవం, పరువు ప్రతిష్ఠలు, హోదా కలుగుతాయి. మీ పెద్దరికంతో అందరిని ఆకర్షిస్తారు.

## ఏప్రిల్

కుటుంబంలో ఎవరికైనా అనారోగ్యం ఏర్పడుతుంది. కొన్నాళ్లు ఇబ్బంది పెట్టి ఆ తర్వాత నయమవుతుంది.

## మే

మీరు, వ్యవహారాలలో కొద్దిగా సర్దుకునిపోతే మంచిది. ఏమాత్రం నిర్లక్ష్యంగా వున్నా అపకారం జరుగవచ్చు. అపాయం కలుగుతుంది కూడా. వాటినుండి బయటపడటంలో మీకున్న నేర్పు అంతా వుపయోగించాలి.

## జూన్

సరదాలు తీరే అవకాశాలు వస్తాయి. మీ ప్రేమ ఫలిస్తుంది. ఎవరెన్ని సవాళ్ళు చేసినా, పందేలు కట్టినా మీ ప్రేమ అజేయంగా, దృఢంగా నిలుస్తుంది. విజయాన్ని సాధిస్తారు.

## జులై

మీరు అప్రమత్తతతో వుండాలి. మీరు ఎంత జాగ్రత్తగా వున్నా, మీ రహస్యాలను తెలుసుకోటానికి మీ శత్రువులు ప్రయత్నిస్తారు. వ్యక్తుల్ని నియమించి మిమ్మల్ని ఫాలో చేస్తారు. జాగ్రత్తగా వుండండి.

## ఆగస్టు

మీ దుబారావల్ల డబ్బు వృధాగా ఖర్చయిపోతుంది. ఆర్థికంగా మీకు ఇబ్బందులు ఏర్పడే ప్రమాదం వుంది.

## సెప్టెంబరు

బ్రహ్మాండమైన అదృష్టం వరిస్తుంది. మట్టిపట్టుకున్నా బంగారమవుతుంది. వ్యాపారంలో విజయాన్ని సాధిస్తారు. మీరు ఉద్యోగస్తులైతే ప్రమోషన్ తప్పకవస్తుంది. అభివృద్ధికి అనువైనకాలం, కాబట్టి దేనినైనా నిర్భయంగా చేయవచ్చు.

## అక్టోబరు

మీరు మంచివారే అయినా మీ బుద్ధి బురదలోకి లాగుతుంది. రేయింబవళ్ళు కష్టించి పనిచేసినా దురదృష్టం మిమ్మల్ని తరుముకొని వస్తుంది. పేదరికాన్ని అనుభవిస్తారు. ఆర్థికంగా చాల కటకటగా వుంటుంది.

## నవంబరు

మీరూహించనట్టివి, ఎదురుచూడనట్టివి ఇబ్బందులు కలిగే ప్రమాదం వుంది. అప్రమత్తతతో వుండాలి.

## డిశంబరు

తృప్తి, సంతోషాలు కలుగుతాయి. మంచి వార్తలు వింటారు. కుటుంబంలో శాంతి ఏర్పడుతుంది. ఆగిపోయిన పనులు కూడా పూర్తవుతాయి.



# 18. నేరాలు - విచారణలు - తీర్పులు

నేరాలు చిన్నవి కావచ్చు - పెద్దవి కావచ్చు. వానికి తగినట్లు న్యాయస్థానాల్లో శిక్షలు పడుతుంటాయి నేరం జరిగిన దగ్గర్నుండి శిక్షపడి దాన్ని అనుభవించే వరకు అనేక రకాల కలలు వస్తుంటాయి. నేరస్థుల్ని పోలీసులు పట్టుకుని కోర్టుల్లో హాజరు పరిస్తే న్యాయాధిపతి తీర్పు చెబుతాడు. తర్వాత జైలులో శిక్ష అనుభవించాల్సి వుంటుంది. ఇక ఈ సంబంధమైన కలలకు ఫలితాలేలా ఉంటాయో చూడండి!

## రౌడీతనం

ఎవరైనా ఒకరౌడీ ఎవరినైనా దబాయించి తన ప్రతాపం చూపిస్తున్నట్లు కలగంటే మీకు సహనంతో వ్యవహరించి మీ పనులు చక్కబెట్టుకుంటారు. రౌడీని మాత్రం కలలో చూస్తే మీరు అకారణంగా భయపడి దిగులుపడతారు.

## దొంగతనం

మీ ఇంటి గోడకు కన్నంవేసి, దొంగ లోపల ప్రవేశించి, దొంగతనం చేసినట్లు కలవస్తే మీ రహస్య ప్రేమకలాపం రచ్చకెక్కుతుంది. ఆ దొంగను మీరు నేర్పుగా పట్టుకుంటే మీ ప్రేమ సఫలమవుతుంది. మీ ఇంటి తలుపులకు వేసివున్న తాళాన్ని మారు తాళంచెవితో తీసి మెల్లగా దొంగ లోపల ప్రవేశిస్తున్నట్లు కలగంటే మీకు సుఖజీవితం లభిస్తుంది. ఆ దొంగ ఏదైనా దొంగలించుకుని వెళ్ళిపోయినట్లు కలవస్తే అన్ని ప్రతికూల పరిస్థితులు అకస్మాత్తుగా మీకు అనుకూలంగా మారతాయి.

## బెదరింపు

ఏ దొంగైనా మీకు కత్తో, తుపాకో, చివాకో చూపి బెద

రించి మిమ్మల్ని హాకల గొట్టినట్లు కలగంటే మీరు బలవంతం కొద్దీ ఇష్టం లేకపోయినా భయపడి దాన ధర్మాలు చేస్తారు.

## బ్లాక్ మెయిల్

ఎవరైనా మీ రహస్యాన్నొక దానిని రహస్యంగా తెలుసుకుని దాన్ని వెల్లడి చేస్తానని బెదిరించి మీ దగ్గర డబ్బు గుంజినట్లు కలగంటే మీకు అనారోగ్యం కలుగుతుంది. మనోవ్యధతో మీరు మీ బాధ్యతల్ని సరిగా నిర్వర్తించలేరు.

## బెదిరించి స్త్రీ సుఖం పొందటం

ఏ స్త్రీ అయినా ఏ పురుషునితోనైనా రహస్య సంబంధాన్ని కలిగియుండి, ఆ రహస్యాన్ని మీరు తెలుసుకుని, ఆ సంగతిని ఎవరికీ తెలుపకుండా వుండేందుకుగాను, ఆ స్త్రీ పొందును ఆశిస్తూ, ఆమెను ఆ కారణంతో బెదరించి, లొంగదీసుకుని, ఆమెతో శృంగార కేళిలో తేలినట్లు కలగంటే విచిత్రమైన రోగం కలిగి వింత అవస్థలు పడతారు.

## జేబు కొట్టటం

ఎవరైనా జేబు దొంగ మీ జేబును ఖాళీ చేసినట్లు కలగంటే మీ అప్పుల బాధలు తీరి పోతాయి. మీరే జేబు దొంగై ఎవరి జేబునైనా కత్తిరించినట్లు కలవస్తే అప్పుచేసి పప్పుకూడు తిని అవి తీర్చలేక చిక్కుల్లో పడతారు.

## దోపిడీ

బందిపోటు దొంగల ముఠా దోపిడీలు, లూటీలు చేస్తున్నట్లు కలగంటే మీరు దురదృష్టంతో చాలాకాలం బాధలు పడతారు. మీరు కూడా ఆ ముఠాలో ఒక వ్యక్తిగా మారి దోపిడీలు సాగిస్తే మీ ఆదాయం అడుగంటుతుంది.

## హత్య

కలలో హత్య జరుగుతున్నట్లు చూస్తే ఎవరో చావు దెబ్బలు తిని, మధ్యస్థంలో వుండి మిమ్మల్ని కాపాడతారు. లేదా ఎవరైనా దూరపు బంధువు మీకు తన ఆస్తంతా వ్రాసి చనిపోవచ్చు. మీరే హత్యచేస్తున్నట్లు కలవస్తే పరులను దెబ్బతీసి పీరు పైకి వస్తారు. మిమ్మల్ని ఎవరైనా హత్యచేసినట్లు కలగంటే మిమ్మల్ని మోసంచేసి మరొకరు పైకి వస్తారు.

## మోసం

మీరు ఎవరినైనా ఏ విషయంలోనైనా మోసం చేసినట్లు కలవస్తే మీ ప్రాణ మిత్రునితో మీకు పేచీ వస్తుంది. మిమ్మల్ని ఎవరైనా మోసం చేసినట్లు కలవస్తే ప్రతి వారినీ మీరు అనుమానించి మీ పనులు పూర్తికాకుండా మీరే చెడగొట్టుకుంటారు. మీరు మోసగించినట్లు మీపై అపవాదులు ప్రచారమైనట్లు మీకు కలవస్తే మీ వ్యాపారం అభివృద్ధి చెంది అంతులేని లాభాలు వస్తాయి. మీరు ఎవరినైనా మోసగాడని ప్రచారం చేసినట్లు కలగంటే మీరు నిజంగానే మోసపోతారు.

## పోలీసు

కలలో మీరు పోలీసును చూస్తే కొంతవితో తల గోక్కుని విచార పడవలసి వస్తుంది. పోలీసుతో కలసి మీ రేదైనా పని చేసినట్లు కలగంటే మీ ఆత్మీయులే మిమ్మల్ని అపార్థం చేసుకుంటారు. మీకు పోలీసు సహాయం చేసినట్లు కలవస్తే అశుభం కలుగుతుంది. మంచి పనులు చేసి కూడా చెడ్డపేరు తెచ్చుకుంటారు. పోలీసులు మిమ్మల్ని అరెస్టు చేసి వాళ్ళ వాన్‌లో ఎక్కించుకున్నట్లు కలవస్తే మీకు మంచి రోజులు వస్తాయి. ఎవరినైనా పోలీసులు వాన్‌లో ఎక్కించుకుని

తీసుకుని పోతున్నట్లు మీరు కలగంటే మీకు చెడుకాలం దగ్గర పడినట్లే!

## డిటెక్టివ్

నేరాలను పరిశోధించే వ్యక్తిగా మిమ్మల్ని మీరు కలలో చూస్తే ఎలాంటి చిక్కు సమస్యనైనా మీరు నేర్పుగా పరిష్కరించుకుంటారు. ఇతరుల అభ్యర్థనను అంగీకరించి, వారికి సహాయపడి ఆర్థిక లాభం పొందుతారు.

## న్యాయస్థానం

కలలో కోర్టు భవనాలనుగాని, విచారణ జరుగుతున్న హాలునుగాని, విచారణనుగాని చూస్తే న్యాయంకోసం మీరు పోరాడుతారు. అందుకు ప్రాణాలకైనా తెగిస్తారు. అన్యాయాన్ని సహించరు. ఎన్ని కష్టాలైనా పడటానికి సిద్ధపడుతారు.

## సాక్షి

మీరు కోర్టులో సాక్ష్యం చెప్పటానికి బోనులో సాక్షిగా నిలబడినట్లు కలవస్తే ఎవరివద్ద ఎలా మాట్లాడేది తెలియక అధిక ప్రసంగం చేసి అవస్థలు కొనితెచ్చుకుంటారు. ఎవరి సాక్ష్యాన్నైనా వింటే నోరు జారి కూడా తప్పుకాదని సమర్థించుకుంటారు.

## వాది

మీరు వాదిగా కోర్టులోని బోనులో నిలిచినట్టు కలగంటే ఆలోచన లేకుండా తొందరపాటు పనులు చేసి అందరిచేతా నానా మాటలు అనిపించుకుంటారు.

## ఉరికంబం

ఎవరినైనా ఉరికంబం దగ్గరకు తీసుకుని వస్తున్నట్లు కలవస్తే ఆత్మీయులతో విరోధం వస్తుంది. మీరే తీసుకురాబడినట్లు కలగంటే అనారోగ్యం కలుగుతుంది. మిమ్మల్ని ఉరి తీసినట్లు కలవస్తే అతిత్వరలో మంచి రోజులు వస్తాయి. మీశత్రువును ఉరితీస్తే మీరు అతనిపై విజయాన్ని ప్రకటిస్తారు.



# 19. పక్షులు

పక్షులు, వాటికి సంబంధించినవి, కలలో కనిపిస్తే ఫలితా లేలా ఉంటాయో చూడండి.

## హంస

నలదమయంతులకు ప్రేమ సందేశాన్ని వినిపించి రాయబారం నడిపింది హంస. అందువల్లనే హంస కలలో కన్పిస్తే ఎంతటి వారైనా ప్రేమలో పడిపోతారు. దానికి ఆహారం తినిపిస్తున్నట్లు కలగంటే మీ ప్రేమికులు వాగ్దానం ప్రకారం పెండ్లియాడి కలకాలం వచ్చగా కాపురం చేస్తారు. ఆదర్శ దంపతులనీ, చిలకా గోరింకలనీ పేరు తెచ్చుకుంటారు.

## బాతు

దీన్ని కలలో చూస్తే పరువు ప్రతిష్ఠలు పెరుగుతాయి. నీటిలో ఈదుతున్న బాతు కన్పిస్తే మీ పనులకు ప్రతికూలత ఏర్పడుతుంది. తెలివిగా సాధించుకోవలసి వస్తుంది. మీరు బాతును పట్టుకున్నట్లు కలగంటే విద్యార్థులు ఫస్ట్‌క్లాస్‌లో పాసవుతారు. నిరుద్యోగులకు మంచి ఉద్యోగం వస్తుంది. మిగతా వారికి గొప్ప లాభం కలుగుతుంది. బాతు మాంసం తింటే ఇంటిల్లపాదీ కలిసి పండుగ జరుపుకుంటారు.

## పావురం

కలలో పావురం కన్పిస్తే అన్నీ శుభాలే జరుగుతాయి. తెల్ల పావురాన్ని కలగంటే ఉద్యోగ వ్యాపారాల్లో విజయం లభిస్తుంది. ఆకాశంలో ఎగిరిపోతున్న పావురాల్ని చూస్తే దూర ప్రయాణాలు చేస్తారు. పావురాళ్ళ జంట కన్పిస్తే ప్రముఖులతో పరిచయమై తద్వారా

-ధనకార్యాలు సాధిస్తారు. వాటికి నూకలు చల్లితే భాగ్యవంతులతో స్నేహమై వారి అండతో అంతులేని సంపదలు పొందుతారు. వాటిని తరిమినా, రాళ్ళతో కొట్టినా సంపన్నులతో విరోధం ఏర్పడుతుంది. పట్టి బంధించితే నష్టాలు కలుగుతాయి. చంపి తింటే అధోగతి ప్రాప్తిస్తుంది. పావురాళ్ళ జంట ప్రేమ కలాపాన్ని కలలో చూస్తే ఈడూ జోడైన ప్రేయసో, భార్యో లభిస్తుంది.

## చిలుక

చిలుక మాట్లాడుతున్నట్లు కలలో కన్పిస్తే - మిమ్మల్ని గూర్చి మీ ఎదుట తియ్యగా మాట్లాడి మీ వెనుక తిట్టిపోస్తారు. మిమ్మల్ని గూర్చి దుష్ప్రచారం జరుగుతుంది. పంజరంలో చిలుక కలలో కన్పిస్తే మీ పాత సమస్యలకు తోడు కొత్త సమస్యలు కొన్ని వచ్చి చేరుతాయి.

## కోకిల

కలలో కోకిల కనిపించటం శుభసూచకం. మంచి మిత్రులు దొరకటమో, చుట్టరికం ఏర్పడటమో జరుగుతుంది. కోకిల పాట వింటే పెండ్లికాని వారికి పెండ్లి అవుతుంది. అయిన వారికి చక్కని దాంపత్య సుఖం లభిస్తుంది. కోకిలకు ఆహారం తినిపించితే మంచి సిద్ధాంతులు కావచ్చు. చనిపోయిన కోకిల కలలో కొస్తే జబ్బు చేయవచ్చు.

## నెమలి

ఇది కలలో కనిపిస్తే సౌందర్యారాధకులవుతారు. అమ్మాయిలు అందమైన అబ్బాయిలకీ, అబ్బాయిలు అందాల భామలకూ దాసులై పోతారు. అయితే ఆ అందానికి ఆకర్షణేగాని ఆరాధన ఉండదు. పూర్తి స్వార్థం ఉంటుంది. నెమలి కూత వింటే భ్రాంతిలో పడి,

వ్యామోహానికి గురై బోల్తా పడతారు. పురి విప్పిన నెమలి నాట్యం చేస్తూ కన్పిస్తే కళాకారులు భాగస్వాము లవుతారు.

## పిచ్చుక

కలలో పిచ్చుక కన్పిస్తే మంచి మిత్రులను మీ వాక్చాతుర్యంతో సంపాదించుకుంటారు. పిచ్చుక అరుపులు వింటే మిత్రులతో సరదాగా కాలక్షేపం చేస్తారు. పిచుకల జంట ప్రేమకలాపాన్ని కలగంటే నరాల బలహీనత ఏర్పడుతుంది.

## కాకి

ఇది కలలో కన్పించటం మంచిది కాదు. ఇది కలలో కన్పిస్తే ఎవరిచేతనైనా మోసగింపబడతారు. అరుస్తున్న కాకిని చూస్తే దుర్వార్తలు వింటారు. కాకిని దూరంగా తోలితే మీ కష్టాలనుండి విముక్తి పొందే సామర్థ్యాన్ని సంపాదిస్తారు. చనిపోయిన కాకిని చూస్తే అపనిందల పాలవుతారు.

## కోడి

కలలో కోడిపెట్ట కన్పిస్తే అదృష్టం కలుగుతుంది. కోడిపుంజు కన్పిస్తే అగ్ని ప్రమాదంవల్ల గాయా లేర్పడుతాయి. అది కొక్కొరొకో అని కూస్తే మీ ఉపన్యాసాలకు, సంభాషణలకు ప్రజలు ముగ్ధు లవుతారు. పిల్లలకోడి కన్పిస్తే మీ కుటుంబం మూడు పూలు ఆరు కాయలుగా అభివృద్ధి చెందుతుంది. మీరు కోడిని తిన్నట్లు కలగంటే మీ ఆరోగ్యం బాగుపడుతుంది. చంపినట్లు కలగంటే అజాగ్రత వల్ల వస్తువులు పోగొట్టుకుంటారు.

## డేగ

ఇది కలలో కన్పిస్తే మీకు గౌరవ మర్యాదలు పెరుగుతాయి.

దీన్ని మీరు పట్టుకున్నట్టు కలగంటే మీ మార్గంలో ప్రత్యర్థులు ఎదురౌతారు.

## గ్రద్ద

కలలో గ్రద్ద కన్పిస్తే జయం కలుగుతుంది. నల్ల గ్రద్దను చూస్తే వ్యాపార ఉద్యోగాల్లో లాభం కలుగుతుంది. దాన్ని కొట్టినా, పట్టుకున్నా నష్టాలు ఏర్పడతాయి. ఆకాశంలో ఎగిరిపోయే గ్రద్దను చూస్తే అదృష్ట దేవత మిమ్మల్ని వరించినట్లే! చనిపోయిన గ్రద్దను చూస్తే కలవారు కష్టాల పాలవుతారు. పేదవారు సంపన్నులవుతారు. గూటిలో కూర్చున్న గ్రద్దను చూస్తే మీ కుటుంబం గుట్టుగా సాగిపోతుంది.

## పాలపిట్ట

ఇది కలలో కనిపించటం అన్నివిధాల మంచిదే! ఎగురుతూన్న పాలపిట్ట కలలోకొస్తే ప్రేమలో పడతారు. అనుకున్నట్టే అంతా జరిగిపోతుంది. తీగపైన కూర్చున్న పాలపిట్టను చూస్తే మీ ప్రేయసి వద్ద నుండో మీకు సందేశం అందుతుంది. దాని అరుపు విన్నా, సంగీతం విన్నా శుభవార్తలు వింటారు. శుభకార్యాలు చేస్తారు.

## తీతువు

కలలో తీతువు కన్పిస్తే మీకు ఓపిక పెరుగుతుంది. సహనంతో మీ శత్రువుల్నికూడా మెప్పిస్తారు. నచ్చని వానితోకూడా సంతృప్తి పడతారు. మంచి పేరు తెచ్చుకుంటారు.

## గుడ్లగూబ

దీన్ని పగలు చూచినా, రాత్రి నిద్రలో కలలో కొచ్చినా ఫలితం అశుభమే! గుడ్లగూబ కలలో కూస్తే చెడువార్తలు వింటారు. దీన్ని

శరమి కొట్టితే కష్టాలనుండి గట్టెక్కుతారు. చంపితే, సంతృప్తి కలుగుతాయి.

## పక్షులు

అందమైనవీ, రంగు రంగుల ఈకలతో ముచ్చటగా నున్నవీ, మనకు తెలియనవీ యైన పక్షులు కలలో కన్పిస్తే కలవారికి లేని వారి తోను, పేదలకు సంపన్నులతోను వివాహాలు జరుగుతాయి. ఎగురు తున్న వానిని చూస్తే భోగ భాగ్యాలు లభిస్తాయి. వాటిని పట్టుకుంటే అదృష్టం వరిస్తుంది. చంపితే దురదృష్టం ముంచుకొస్తుంది. గాయపడి నవి కన్పిస్తే ఎదురు చూడని కష్టాలు రావచ్చు. నీటి పక్షులు కన్పిస్తే దూర ప్రయాణం తగులుతుంది.



# 20. ప్రకృతి సంపద

## సూర్యుడు

సూర్యుడు బంగారు రంగుతో ఉదయిస్తున్నట్లు కలగంటే ఒకానొక మరపురాని మధుర సంఘటన జరగుతుంది. సూర్యుడు రక్తంలా కన్పిస్తే మీ పనులు కష్ట సాధ్యాలవతాయి. ఆకాశంలో తెల్లగా వెలుగులు చిమ్ముతూన్న సూర్యుని కలలో చూస్తే మీకు ఆనందం కలిగించే రోజులొస్తున్నాయని సూచన. సూర్యుడు వేగంగా ఆకాశంలో పోతున్నట్లు కలగంటే, మీకు ఏదన్నా ఆపద సంభవించవచ్చు. మబ్బులలోనికి పోయిన సూర్యుడు కలలో కన్పిస్తే గడ్డు రోజులు వస్తాయి. నీటిలో సూర్యుని బింబం కనిపిస్తున్నట్లు కలగంటే మీ భవిష్యత్తును మీరే చక్కగా సరిదిద్దుకొంటా రన్నమాట. మీ యింటిలో సూర్యకిరణాలు పడుతున్నట్లు కలగంటే మీ కుటుంబంలో సుఖశాంతులు నెలకొంటాయి.

## చంద్రుడు

కలలో చంద్రుని చూస్తే మీ జీవన మార్గంలో మార్పు కలుగుతుంది. మబ్బుల్లో చంద్రుని చూచినట్లు కలగంటే జీవితం నిస్సారంగా వుంటుంది. నీటిలో చంద్రుని ప్రతిబింబాన్ని చూస్తే మీరు ప్రయాణాలు చేస్తారు. తద్వారా లాభాలు పొందుతారు. ఆ రూపం సరిగా కనిపించకపోతే మిమ్మల్ని ప్రేమించే వారిని మీరు గుర్తించలేరు. ఆకాశంలో వేగంగా పోతున్న చంద్రుని చూచినట్లు కలగంటే మీకు చెడు జరగవచ్చు. నిండు జాబిలిని కలలో చూస్తే మీకు సకల శుభాలు కలుగుతాయి. చంద్రుడు తరిగిపోతున్నట్లు కలగంటే మీ పనులు సరిగా కాకపోయినా నష్టం మాత్రం వుండదు. నెలవంకను

నిర్మలాకాశంలో చూస్తే ఎక్కువ ప్రయాణాలు కలుగుతాయి. సూర్యుడు చంద్రుడు కలసి ఒకేసారి కన్పిస్తే ఏదో కీడు జరుగుతుందని సూచన.

## నక్షత్రాలు

ఆకాశం, నక్షత్రాలు అందంగా, స్పష్టంగా కలలో కన్పిస్తే మీ భవిష్యత్తులో ఎంతో కీర్తి, గౌరవం, ధనం లభిస్తాయి. ఆ నక్షత్రాలు కాంతి లేకుండా వుంటే ఆపదలు కలుగుతాయి. నక్షత్రాలు ఆకాశాన్ని వదలిపోతున్నట్లు కలగంటే ఆరోగ్యం క్షీణించవచ్చు.

## ఆకాశం

నీలంగావుండే ఆకాశాన్ని కలలో చూస్తే మంచిరోజులు వస్తాయి. అది ఎర్రగావుంటే మీది కలతల బ్రతుకుగా మారవచ్చు. విశాలంగా వుండే ఆకాశాన్ని కలలో చూస్తే వ్యాపారంలో విజయం, ప్రేమ లాభం కల్గుతాయి. మబ్బులతో వున్న ఆకాశాన్ని కలలో చూస్తే వారి జీవితంలో ఒడుదుడుకులు ఎక్కువగా వుంటాయి. అది చీకటిగా, నల్లగా ఉన్నట్లు కలలో కన్పిస్తే అసంతృప్తితో జీవితం గడపవలసి వస్తుంది. వేలాది, లక్షలాది నక్షత్రాలతో నిండిన ఆకాశం కలలో కన్పిస్తే మీరు పట్టింది బంగారమవుతుంది.

## భూమి

చదునుగానున్న భూమిని కలలో చూస్తే మీకు వివాహం, మంచి సంతానం కల్గుతాయి. సిరిసంపదలతో తులతూగుతారు. భూమి పగుళ్లు వారినట్లు కన్పిస్తే విచారకరమైన వార్తలు వింటారు. జీవితం నిస్సారంగా వుంటుంది. భూమిని దున్నుతున్నట్లు కలగంటే మీ కుటుంబంలో ఆనందం, శాంతి తాండవిస్తాయి. నేలమీద పడుకొనివున్నట్లు కలగంటే మీకు కష్టాలు కలిగించేవారినే అతిగా నమ్ముతారు.

## గాలి

వేగంగా గాలి వీస్తున్నట్లు కలగంటే వృత్తి వ్యాపారాలలో ఆడ్డంకులు ఏర్పడుతాయి. ముఖానికి గాలి తగిలినట్లు కలగన్నా ఇదే ఫలితం. మెల్లగా గాలి వీస్తున్నట్లు కలలోచూస్తే వృత్తి వ్యాపారాలలో అనుకూలత ఉంటుంది. గాలి వీచటం ఏ ఆకో, కాగితమో రెప రెప లాడుతున్నట్లు కలగంటే మీకు శుభవార్తలు అందుతాయి.

## ఎడారి

కలలో మీరు ఎడారిని చూడటం జరిగితే ఒంటరి బ్రతుకు గడుపుతూ నిస్సారమైన జీవితం కొనసాగిస్తారు. ఎడారిలో దిక్కు తెలియక నిలబడినట్లు కలగంటే మీ జీవితంలో తృప్తి వుండదు.

## మైదానం

మైదానం కలలో కన్పిస్తే మీకు భవిష్యత్తులో సుఖ సంతోషాలు కలుగుతాయి. మైదానంలో విహరిస్తున్నట్లు కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో ఎంతో ఉన్నతి లభిస్తుంది. ఎత్తైన చోటునుండి మైదానంవైపు చూస్తున్నట్లు కలవస్తే మీ జీవితం విజయానికి నాంది పలుకుతుంది. పచ్చని పచ్చిక మైదానం కలలో కన్పిస్తే మీ కుటుంబం అదర్శ కుటుంబమవుతుంది. పచ్చికను సమంగా కత్తిరిస్తున్నట్లు కలగంటే విచిత్ర వ్యక్తులతో పరిచయం కలుగుతుంది.

## పర్వతం

పర్వతాన్ని ఎక్కుతున్నట్లు కలగంటే మీరు మీ జీవితంలో ఉన్నతస్థాయికి చేరారు. మీ శ్రమ ఫలిస్తుంది. క్రిందికి దొర్లిపడితే మీరు మీ పనిని సాధించలేరు. పర్వతం మీదనుండి దిగుతున్నట్లు కలగంటే శ్రమవల్ల సాధించిన పని మీకు ప్రశాంతిని, విశ్రాంతిని ఇస్తుంది. అగ్నిపర్వతాన్ని కలలో చూస్తే మిమ్మల్ని చూసి యితరులు

ముప్పులేదు. దానిలోనుంచి లావా వస్తున్నట్లు కలవస్తే మీ ఆరోగ్యం దెబ్బతింటుంది.

## గుహ

గుహలోనున్నట్లు కలగంటే మీ జీవితంలో ఏదో మార్పు వస్తుంది. గుహలోనుండి బయటకు వస్తున్నట్లు కలగంటే కష్టాలు తీరి పోతాయి. గుహ ద్వారంపై వెన్నెలపడుతున్నట్లు కలగంటే మీ ఆరోగ్యాన్ని కాపాడుకోవాలి. దీర్ఘవ్యాధినుంచి విముక్తి పొందే మార్గం దొరుకుతుంది.

## కొండలోయ

కలలో కొండలోయ కన్పిస్తే మీ జీవితంలో జాగ్రత్త వహించకపోతే గట్టి దెబ్బతింటారు. కొండలోయలో వున్నట్లు కలగంటే ఏదో ప్రమాదంలో చిక్కుకుంటారు. లోయలో పడిపోతున్నట్లు కలగంటే మీకు ఇతరుల సహాయం లేనిదే గట్టెక్కలేరు. ఎవరైనా లోయలో పడిపోతున్నట్లు కలగంటే మీరు యితరులకు చేయూతనిచ్చి ఉన్నతస్థాయికి చేరుకొనేటందుకు తోడ్పడతారు.

## అగాధం

అగాధం ప్రక్కనిల్చునట్లు కలగంటే మీరు జాగ్రత్తగా వుండాల్సి వస్తుంది. లేకపోతే మీ జీవితం సుడిగుండంలో పడవచ్చు. అగాధంలో పడినట్లు కలగంటే శుభాలు జరుగుతాయి. అగాధాన్ని చూస్తే మీరు ప్రమాదంలో యిరుక్కుంటారు. అగాధంలోకి పడిపోతున్నట్లు కలవచ్చినప్పుడు ఓపికగా వుంటే అన్ని కార్యాలు పూర్తవుతాయి. ఎన్నిబాధలు, కష్టాలు కలిగినా ఓపికవిడువకు.

## ఇంద్రధనుస్సు

మీకలలో ఇంద్రధనస్సు కన్పిస్తే ఎన్నో రోజులుగా దారికి రాని కేసులు ముగుస్తాయి. మీ శత్రువు రాజీకి వచ్చి, అనుకూలంగా వ్యవహారాలు ముగుస్తాయి.

## పిడుగు

దీని శబ్దం కలలో విన్నట్లు అన్పిస్తే గొడవలు కలిగిమనశ్శాంతి లేకుండా పోతుంది.

## ఉరుము – మెరుపు

కలలో మీరు ఉరుములు వింటూ మెరుపులు గంటే ఏదో ప్రమాదంలో ఇరుక్కొని అతికష్టం మీద బయటపడతారు.

## ఉల్క

ఆకాశంలో నుంచి నక్షత్రాల మధ్యగా ఉల్కరాలిపడినట్లు కలగంటే మీరు కోరుకొనేది కొంచెమైనా గొప్పగా లభిస్తుంది.

## పాలపుంత

రాత్రిపూట ఆకాశంలోని నక్షత్రాల పాలపుంత చూచి నట్లు కలవస్తే క్రొత్త విషయాలు తెలుసుకోవాలనే మీ తాపత్రయం తీరుతుంది. అధికలాభం కలుగుతుంది.

## తోకచుక్క

దీనిని మామూలుగా చూచిన ఫలితాలే కలలో చూచినాకల్గుతాయి. ఎటు చూచినా అశుభవార్తలే వస్తాయి. కొట్లాటలలో మీకు ప్రమాదం కలుగవచ్చు.

## మేఘాలు

ఆకాశంలో క్రమ్ముకొన్న నల్లటి మబ్బుల్ని కలగంటే రక రకాలదిగుల్లు ఏర్పడుతాయి. అవి తెల్లగా ఉన్నట్లు కన్పిస్తే మీకు శ్రమతగ్గి మంచి రోజులు వస్తాయి.

## రాత్రి

కలలో చీకటిగావున్న రాత్రి సమయాన్ని చూస్తే మీ జీవితంలో గడ్డు రోజులు ప్రారంభం కావచ్చు. రాత్రిపూట యిల్లు వదలి ఎటో పోతున్నట్లు కలగంటే మీకు ఏదన్నా ప్రమాదం జరుగవచ్చు.

## చీకటి

మీకు కలలో పగలు కన్పించి వెంటనే చీకటి మయమైనట్లు ఉంటే ఎదురు చూడని దుర్వార్త అందవచ్చు ఆ చీకటిలో మీరున్నట్లు కలగంటే మిత్రుల సహాయంతో బాగుపడతారు.

## వెలుగు

చక్కని వెలుతురు కలలో కన్పిస్తే మీపనులలో అనుకూలత ఏర్పడుతుంది. కొవ్వు వత్తి కాంతిని కలలో చూస్తే ముందు ముందు మంచి రోజులు వస్తాయి. కరెంటు లైటు వెలిగించి ఆకాంతిని చూసినట్లు కలగంటే వినోద కాలక్షేపం పెరిగిపోతుంది. కోట్లాది దీపాలు వరుసగా వెలుగుతున్నట్లు కన్పిస్తే మీకు పట్టింది బంగారమవుతుంది.

## తెల్లవారటం

కలలో తెల్లవారుతున్నట్లు తూర్పున వెలుగురేఖలు చూస్తే మీకు భవిష్యత్తులో రాజభోగాలు కలుగుతాయి. మసగ్గా ఉన్నట్లు కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో తీరని నష్టం కలుగుతుంది.

## నీడ

మీ కలలో ఏవైనా పదార్థాలు నీడలో వున్నట్లు కన్పిస్తే తాడును పామనుకొనే భ్రాంతిలో పడతారు. ఎప్పుడూ ఏదో ముంచుకొని వస్తుందన్న భయంతో బ్రతుకుతారు.

## గ్రహణం

ఇది కలలో కనిపించటం మంచిది కాదు. అనుకోని కష్టాలు ఎదురౌతాయి. సూర్య గ్రహణం కలలో కన్పిస్తే తండ్రికి, చంద్ర గ్రహణం కన్పిస్తే తల్లికి ప్రాణసంకటం ఏర్పడవచ్చు.

## ప్రకృతిదృశ్యం

చక్కని ప్రకృతి దృశ్యాన్ని కలగంటే మీ జీవితంలో ఆనందం, శాంతి ఏర్పడతాయి. అది మసక మసకగా కన్పిస్తే రాబోయే కాలం మీకు మంచిదిగా వుండక పోవచ్చు.

## భూకంపం

మీరు కూర్చున్న చోట భూమి కంపించినట్లు కలగంటే మీ దిన చర్యల్లో మార్పులువచ్చి మీస్థితిగతులు మారుతాయి. భూకంపనంలో మీకు దెబ్బలు లేక గాయాలు తగిలినట్లు కలవస్తే కాలపరిస్థితులననుసరించి మీకు కష్టాలు వస్తాయి. వాటి నుంచి బయట పడటం మీచేత కాకపోవచ్చు.

## దీవి (ద్వీపం)

చుట్టూ నీరు వుండి మధ్యలో భూభాగం వున్నదే దీవి. అలాంటి ప్రదేశంలో వున్నట్లు కలవస్తే మీ వృత్తిలో మార్పు వస్తుంది. లంక నుండి ఎక్కడికో పోతున్నట్లు కలగంటే ఫలితంలేని పనులు చేస్తూ కాలక్షేపం చేస్తారు. దూరంనుంచి అలాంటి ప్రదేశాన్ని కలలో చూస్తే

మీరు ఒంటరి బ్రతుకు గడుపుతూ దిగులుతో వుంటారు. నిర్జనంగా వున్న ద్వీపంలో మీరు మాత్రమే వున్నట్టు కలగంటే ఏ గొడవాలేని ప్రశాంత జీవితం ఏర్పడుతుంది.

## గని

ఇది మీకు కలలో కన్పిస్తే మీ శ్రమకు తగ్గ ఫలితంలేని పనులు చేస్తారు. అనగా వెట్టిచాకిరీ చేస్తారు. గనిలో పని చేస్తున్నట్లు కలగన్నా ఫలితం ఇదే.

## అడవి

కలలో అడవి కన్పిస్తే మీకు ఇంద్రజాలం లాంటి అనుభవం కలుగుతుంది. అడవిలో మీరు దిక్కుతోచని పరిస్థితిలో వున్నట్టు కలగంటే మీకు బాధ కల్గించే వార్తలు అందవచ్చు. అడవి మనిషితో స్నేహంచేసినట్లు కలవస్తే వృత్తి వ్యాపారాలలో అఖండ విజయం. అడవిమనిషి మిమ్ముల్ను కొట్టబోతున్నట్టు కలలో కన్పిస్తే అధికారుల వల్లకాని, భాగస్తులవల్లకాని కష్టాలు వస్తాయి.

## పెట్రోలు

మీ కలలో పెట్రోలును చూస్తే మీమనస్సులో కలిగే చెడు తలంపులు దూరమవుతాయి. మిత్రులవల్ల వచ్చిన చెడ్డపేరు మాసిపోతుంది. పెట్రోలు మంట మండినట్లు కలగంటే మీరు వినోదకాల క్షేపాలతో ఎక్కువకాలాన్ని దుర్వినియోగం చేస్తారు.

## రాళ్ళు

బండరాళ్లను కలలో చూస్తే మూర్ఖులతో స్నేహం కలుగుతుంది. మీరు రాయిని విసిరినట్లు కలగంటే మిమ్మల్ని ఓ మొండివాడు పట్టి పీడించవచ్చు.

## అయస్కాంతము

దీనిని కలలోచూస్తే పలుకుబడి కలవారితో స్నేహం పెరుగుతుంది. ఏదైనా యినుపవస్తువును అయస్కాంతం ఆకర్షిస్తున్నట్లు కలగంటే మీ నిత్య జీవితంలో ముఖ్యమైనదాన్ని పోగొట్టు కొంటారు. పేద స్త్రీని ప్రేమించటమో లేక ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకోవటానికో ప్రయత్నిస్తారు.

## స్ఫటికరాయి

ఇది ఎక్కడన్నా మీకు లభించినట్లు కలగంటే ఎవరో మిమ్మల్ని తియ్యని మాటలతో మోసం చేయగలరు. జాగ్రత్త పడకపోతే మీకు తీరనికష్టం కల్గుతుంది.

## పాలరాయి

కలలో దీన్నిచూస్తే మీరు వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నట్లు గుర్తు. పాలరాతితో ఏదైనా పనిచేస్తే మీవల్ల సాధ్యంకాని పనులను నెత్తిపై వేసుకొంటారు. ఎవరైనా మీకు దీనిని ఇచ్చినట్లు కలకన్నా ఫలితం ఇదే. కాలాంతరంలో మనసలాల్చి వస్తుంది.

## ఆకులు

స్వప్నంలో నవనవలాడే ఆకుపచ్చని ఆకుల్ని చూస్తే మీ కోర్కెలు సులభంగా ఫలిస్తాయి. ఎండిపోయిన ఆకుల్ని గాని, మచ్చలతోవున్న ఆకుల్నికాని కలలోచూస్తే మీ పనులకు అడ్డంకులు కలిగి నష్టం ఏర్పడుతుంది. రాలుతున్న ఆకుల్ని కలలో చూస్తే మీకు కష్టనష్టాలు ఎదురవుతాయి.

# 21. ప్రయాణ సాధనాలు - వగైరా

ప్రయాణ సాధనాలు అంటే విమానం, రైలుబండి, మోటారు బండి, గుఱ్ఱబ్బండి, ఎద్దుబండి, మోటారు సైకిల్, సైకిల్, పడవ, ఓడ మొదలైనవి. ఇవి కలలో కనిపించినప్పుడు, అందువల్ల కలిగే ఫలితాలు ఎలా వుంటయో చూడండి!

## విమానం

విమానంలో ప్రయాణము చేసినట్లు కలగంటే వ్యాపారంలో ఎంతో అభివృద్ధిని పొందుతారు. ఇతరత్రా కార్యక్రమాలలో అనుకూలత ఏర్పడుతుంది. విమానం కూలినట్టు కలగంటే ఆపదలు వస్తాయి. విమానం నడిపినట్లు కలలో చూస్తే శుభకార్య నిర్వహణలో ప్రాకీణ్యత ఏర్పడుతుంది. విమానంనుంచి దూకినట్లో, దిగినట్లో కలగంటే దురదృష్టం పట్టుకుంటుంది.

## రైలుబండి

రైలు ప్రయాణము చేసినట్లు కలగంటే వినోద కాలక్షేపం జరుగుతుంది. మీ పనులు త్వరగా జరుగుతాయి. పొడవైన రైలుబండిని చూస్తే మిత్రుల సహాయం లభిస్తుంది. ఎక్కుతున్నట్లు కనిపిస్తే మీరు ఎవరికంటె కన్నా బంధువులుగా పోతారు. దిగుతున్నట్లు కలగంటే బంధువులు మీ యింటికి వస్తారు.

## రైలుస్టేషను

దీన్ని కలలో చూస్తే మీ జీవితంలో ఏదో మంచి మలుపు సంభవిస్తుందన్నమాట. స్టేషన్ గేటు దాటి బయటికి వస్తుంటే మీ కార్యక్రమాలన్నీ నిర్విఘ్నంగా జరిగిపోతాయి.

## రైలు ఇంజన్

కలలో ఇది కనిపిస్తే మీకు వ్యాపారంలో విజయం కలుగుతుంది. నడుపుతున్నట్లు కలగంటే తీరని కోర్కెలు త్వరలో తీరతాయి. కూత వేస్తే యింతకాలంగా మీలో వున్న పిరికితనం తొలగిపోతుంది.

## మోటారు సైకిల్

స్వప్నంలో మోటారు సైకిల్ కనిపిస్తే మీరు మీ ఆరోగ్యం గురించి అశ్రద్ధ చేస్తారు. ప్రయాణం చేస్తే మిత్రులకు మీవలన శుభ కార్యాలు జరుగుతాయి. మీరే నడుపుతున్నట్లు కలవస్తే క్రొత్త వ్యాపారం ప్రారంభిస్తారు.

## మోటారు కారు

దీన్ని కలలో చూస్తే ప్రయాణం చేస్తారని అర్థం. నడిపినట్లు కనిపిస్తే దూర ప్రయాణం చేస్తారు. అది చెడిపోతే అనుకున్న పని ఆలస్యంగా అవుతుంది. పెట్రోలు అయిపోతే అనవసరపు శ్రమ కలుగుతుంది. వృధా ప్రయాస అవుతుంది.

## బస్

కలలో బస్సును చూచిన వారికి అనారోగ్యం కలుగుతుంది. ప్రయాణం చేస్తే రానున్న కాలంలో ఆపదలు చుట్టుముట్టవచ్చు. బస్సు ప్రమాదాన్ని కలలో చూస్తే ఆర్థిక యిబ్బందులు ఏర్పడుతాయి.

## పడవ

మీకు కలలో పడవ కనిపిస్తే మీ జీవితంలో కొత్త మలుపు ఏర్పడుతుంది. విహారం చేసినట్లు కలగంటే శుభం కలుగుతుంది. అవివాహితులకు ప్రేమించినవారితో వివాహం జరుగుతుంది. వివాహి

తులకు సత్సంతానము కలుగుతుంది. పడవ బోల్తాకొడితే అనుకోని కష్టాలు వస్తాయి. మీ కుటుంబంలో అనిశ్చిత పరిస్థితి ఏర్పడుతుంది.

## పడవ తెడ్డు

దీన్ని స్వప్నంలో చూస్తే మిత్రుల సహాయం లభిస్తుంది. మీరే తెడ్డు వేస్తూ పడవను నడిపితే శ్రమించి ఫలితాన్ని పొందుతారు. తెడ్డు విరిగితే కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్టుగా ఎక్కువ శ్రమపడి చాల తక్కువ ఫలితాన్ని పొందుతారు.

## పడవ చుక్కాని

దీన్ని కలలో చూచిన యెడల మీ భవిష్యత్తు ఆశాజనకంగా కనబడుతుంది. చుక్కానిని త్రిప్పుతున్నట్టు కలగంటే ఎవరి కష్టాల్లోనో మీరు జోరబడి ఆదుకుంటారు. స్త్రీలకు కలలో చుక్కాని కనిపిస్తే సుఖపెట్టగల భర్త లభిస్తారు. అవివాహిత పురుషులకైతే పుట్టినింటికీ, మెట్టినింటికీ పేరు ప్రతిష్ఠలు తెచ్చే చక్కని అమ్మాయి భార్యగా లభిస్తుంది.

## దిక్సూచి

దీన్ని మీరు ఉపయోగిస్తున్నట్టు కలగంటే దారితోచక పరిష్కారము తెలియని మీ సమస్యలు త్వరలో తీరిపోయి హాయిని పొందుతారు. దిక్సూచి బద్దలైనట్లో, తుఫానువల్ల వూగుతున్నట్లో కల గంటే మీ చిక్కులు మరింత ఎక్కువ అవుతాయి. జాగ్రత్తగా వుండాలి.

## సైకిల్

సరి కొత్త సైకిలు కలలో కనిపిస్తే చిన్న వ్యాపారాన్ని మీరు ప్రారంభిస్తారు. పాత సైకిల్ కనిపిస్తే వ్యాపారంలో ఎన్నో మార్పులు

తీసికొనివస్తారు. కలలో మీరు సైకిల్‌ను తొక్కుతున్నట్లు కనిపిస్తే కష్టపడి మీ కుటుంబ భారాన్ని మోస్తూ మంచి పేరు తెచ్చుకుంటారు. మీరు తొక్కుతున్న సైకిల్ ప్రమాదములో చిక్కుకుని తుక్కుతుక్కు అయితే మీ వ్యాపారంలో నష్టమో, లేక మీ ఉద్యోగ నిర్వహణలో అనుకోని చిక్కులో ఏర్పడుతాయి. కలలో బొమ్మ సైకిల్‌ను చూస్తే వినోదాన్ని పొందుతారు.

## సైకిల్ రిక్షా

దీన్ని కలలో చూస్తే ఆనందం కలుగుతుంది. ఎదురుచూస్తున్న శుభవార్త అందుతుంది. సైకిల్ రిక్షాలో కూర్చుని వెళ్లుతుంటే మీ కుటుంబములో శుభకార్యాలు జరుగుతాయి. మీరు తొక్కుతున్నట్లు కలగంటే మీ పై అధికారితో పేచీలు వస్తాయి. మనస్పర్థలు పెరుగుతాయి.

## లాగుడు బండి

లాగుడుబండి కలలో కనిపిస్తే స్నేహితులతో మాట పట్టింపు వస్తుంది. మీరు బండిని లాగుతున్నట్లు కలగంటే మీకు సంబంధము లేని పనిలో తలదూర్చి చిక్కుల్లో పడతారు. లాగేబండి తలక్రిందు లయితే లేనిపోని బాధ్యతలు మీ తలపై బడతాయి.

## తోపుడు బండి

ఇది కలలో కనిపించినచో మీరు మీ స్నేహితుల సహాయమును పొందగలుగుతారు. తోస్తే ఆపదల్లో వున్న మీ మిత్రుని ఆదుకుంటారు. బోల్తాపడితే అనుకున్న విధంగా మీరు ఏ పనీ చేయలేరు.

## తెప్ప

కలలో నీటిపైన తేలుతున్న తెప్పను చూస్తే తీరని సమస్యలతో మీరు బాగా సతమతమవుతారు. మీరు స్వయంగా తెప్పను తయారు

చేస్తున్నట్లుగానో, లేక తెప్పమీద ప్రయాణం చేస్తున్నట్లుగానో కల గంటే, దూరపు బంధువు సహాయంతో మీరు జీవితంలో ఒక దారికి రాగలుగుతారు.

## గుఱ్ఱపు బండి

దీన్ని కలలో చూస్తే మీరు అతి త్వరలో ప్రేమకలాపాలు సాగి స్తారు. ప్రయాణం చేస్తే ప్రేమించినవారి హృదయంలో మీకు స్థానం ఏర్పడుతుంది. మీరు గుర్రపుబండిని తోలినట్లు కలగంటే విలాసాల కోసం ప్రయాణం చేస్తారు. వేగాన్ని జోరుచేస్తే శృంగార కలాపాలలో మునిగి తేలుతారు. మంచి హాయిని పొందుతారు. గుర్రబ్బండి పారి పోతున్నట్లు కనిపిస్తే మీ ఆదాయం, కుటుంబజీవితం కుంటుపడతాయి. గుర్రబ్బండి బోల్తా కొట్టినట్లు కలగంటే మీ వ్యాపారాల్లో, మీ కుటుంబ ములో ఎన్నో నష్టాలు ఏర్పడవచ్చు.

## స్వారీ

కలలో గుర్రంమీద స్వారిచేస్తే త్వరగా మీరు అభివృద్ధిలోకి వస్తారు. పెంకె గుర్రాన్ని స్వారిచేసి, దాన్ని మీరు స్వాధీనపరచు కున్నట్లు కలగంటే ఎంత కష్టమైన పనినైనా మీరు సాధించ గలుగుతారు.

కలలో గాడిదమీద స్వారి చేసినట్లు కనిపిస్తే అకారణంగా నవ్వులపాలవుతారు. ఆప్తమిత్రులు కూడ హేళనచేసే ప్రమాదం వుంది. జాగ్రత్త.

గిత్తపైన స్వారి చేసినట్లు కలగంటే మీ జీవితం అనిశ్చిత పరి స్థితిలో పడుతుంది. అనవసరమైన అనుమానాలు కలుగుతాయి.

మీరు బండిపై స్వారి చేస్తున్నట్లు కలగంటే త్వరలో మీకు విదేశ ప్రయాణం తగులుతుంది.

వీనుగుపై స్వారి చేస్తున్నట్లు కలగంటే సాహసకార్యాన్ని తల పెట్టి విజయాన్ని సాధిస్తారు.

## ఎద్దుల బండి

ఎద్దుల బండిని కలలో చూసినవారు, సాహసకార్యాన్ని విజయ వంతముగా చేయగలుగుతారు.

పెండ్లివారి బండిగా అలంకరించినదానిని కలలో చూస్తే సాహ సించి ప్రేమించిన అమ్మాయిని పెండ్లాడగలుగుతారు. దీనిలో ప్రయాణం చేస్తే మీ కుటుంబంలో శుభకార్యం జరుగుతుంది. బండి బోల్తాకొడితే అశుభం జరుగుతుంది.

## ఒంటెద్దు బండి

కలలో ఇది కనిపిస్తే కష్టపడినదానికి తగినంత ఫలితాన్ని పొంద లేకపోతారు. ఒంటెద్దు బండిని తోలినట్లు కలగంటే మిత్రులతో మన స్పర్థలు ఏర్పడుతాయి.

## పాకీ బండి

దీన్ని కలలో చూస్తే లాభం కలుగుతుంది. తోలితే ఇంటిని చక్కగా తీర్చిదిద్దగల భార్యను పొందగలుగుతారు. స్త్రీలు కలగంటే శుచి, శుభత, మర్యాద, మన్ననగల భర్త లభిస్తారు. వివాహితులు కలగంటే సత్సంతానాన్ని పొందగలుగుతారు.

## దున్నపోతుల బండి

స్వప్నంలో ఇది కనిపిస్తే యోగ్యతలేనివానివద్ద నౌకరీ చేయ వలసి వస్తుంది. దున్నపోతుల బండిని తోలుతున్నట్లు కలగంటే జీవితంపై విరక్తి వుటుతుంది.

## ఓడ

ఓడను కలలో చూస్తే మీకు దూరప్రయాణం వుందన్నమాట. ఓడలో ప్రయాణంచేస్తే వ్యాపారంలో లాభం కలుగుతుంది. ఉద్యోగములో ప్రమోషన్ రావచ్చు. ఓడలో తిరుగుతూ ఒక్కొక్క భాగాన్ని వేడుకగా చూస్తున్నట్లు కలగంటే యిష్టమైనవారితో కలయిక ఏర్పడుతుంది. ఓడ ఎక్కుతున్నట్లు కలగంటే కష్టపడి ఫలితాన్ని పొందగలుగుతారు. ఓడ దిగితే మీరు ఆశించిన ఫలితం లభించదు.

కలలో ఓడ మునిగిపోయినట్లు చూస్తే అశుభం కలుగుతుంది. ఓడ మునిగిపోతూ, అందులో మీరు వున్నట్టు కలగంటే చిక్కుల్లో పడటం తథ్యం. రక్షించబడితే మరొకరి సహాయం మీకు లభిస్తుంది.

## లాగుడు పడవ

కలలో లాగబడుతున్న పడవను చూస్తే శ్రమకు తగ్గ ఫలాన్ని పొందగలుగుతారు. ప్రయాణంచేస్తే సోదరులతో మాట పట్టింపులు వస్తాయి. మీరు లాగుతున్నట్టు కలగంటే అల్లుళ్ళతో పేచీలు వస్తాయి.

## పాస్‌పోర్టు

దీన్ని కలలో చూస్తే త్వరలో మీకు ప్రయాణం వున్నదన్నమాట. మీరు దీన్ని పొందితే దూరదేశాలకు వెళ్ళగలుగుతారు. పోగొట్టుకున్నట్లు కలగంటే అనుకోకుండా ఆపదలు వస్తాయి. అంతే కాకుండా మీరు ఎంత పెద్దమనుషులైనా మీ పైవారినుండి ఆరోపణలు, విమర్శలు వస్తుంటాయి.

## టాక్సీ

దీన్ని కలలో చూస్తే స్థలమార్పుగాని, ఉద్యోగంలో మార్పుగాని జరుగుతుంది. టాక్సీని నడిపితే ప్రేమలో పడతారు. స్త్రీ పురు

షులు మరొకరి తోడుతో ప్రయాణం చేస్తే అనుకోని బాధలకు గురి అవుతారు. టాక్సీలో ఒంటరిగా ప్రయాణం చేస్తే వారసత్వ లాభం కలుగుతుంది.

## అంబులెన్స్ వాన్

అంబులెన్స్ వాన్‌ని కలలో చూస్తే స్త్రీల ద్వారా పురుషులకు, పురుషుల ద్వారా స్త్రీలకు ఆపదలు కలుగుతాయి. తొందరపడి తగాదాలు తెచ్చుకోవద్దని హెచ్చరిక అన్నమాట. మీరే దానిలో ప్రయాణం చేస్తున్నట్లు కలగంటే పరుషంగా మాట్లాడి పరువు పోగొట్టుకోవడం జరుగుతుంది.

## ఎలివేటర్ (లిఫ్టు)

లిఫ్టులో మీరు పైకి వెళ్ళినట్లు కలగంటే మీ వ్యాపారము అభివృద్ధి చెందుతుంది. మీరు ఉద్యోగస్థులయితే ప్రమోషను వస్తుంది. క్రిందికి దిగినట్లు కలవస్తే వ్యాపారములో నష్టం వస్తుంది. ఉద్యోగంలో చిక్కులు వస్తాయి. లిఫ్టును నడుపుతున్నట్లు కలగంటే బ్రతుకు తెరువుకోసం యిష్టంలేని పనులు చేస్తారు.

## బెలూన్

బెలూన్‌లో పైకి వెళ్ళినట్లు కలగంటే దురదృష్టం వెన్నంటి వస్తుందన్నమాట. పగిలిపోతే కష్టాల్లో నుండి బయట పడతారు.



# 22. పాఠశాల - కళాశాల - వగైరా

## పాఠశాల

కలలో పాఠశాల కన్పిస్తే అనుభవంతో కాని మీరు ప్రతి విషయాన్ని తెలుసుకోలేరు. అయినా ఫలితాన్ని ఎప్పటికప్పుడు మరచిపోతూ తప్పులు చేస్తూనే ఉంటారు. పాఠశాలకు వెళ్తున్నట్లు కలగంటే మీ పాత స్నేహితుడు మీకోసం రావటమో, మీరు అతని కోసం పోవటమో జరుగుతుంది.

## కాన్వెంట్

మీరు కలలో దీన్ని చూస్తే మీ ఆరాటం తగ్గి శాంతి లభిస్తుంది. యూనిఫాంతో మీరు కాన్వెంటుకి వెళ్ళినట్లు కల వస్తే పెద్దవారివలన కాని, అధికారులవలన కాని మీకు సహాయం లభిస్తుంది.

## ఉన్నత పాఠశాల (హైస్కూల్)

కలలో మీకు ఉన్నత పాఠశాల కనిపిస్తే మీరు ప్రేమలో పడ్డారని గుర్తు. అక్కడ చదువుకుంటున్నట్లు కలగంటే మీరు ఘాటు ప్రేమలో పడతారు. అందులోనికి వెళ్తున్నట్లు కలగంటే మీరు ఉద్రేకంతో ప్రేమను జయించలేమని తెలుసుకొని మరో మార్గంలో సాధిస్తారు.

## కాలేజ్

కాలేజిలోనికి వెళ్ళినట్లు మీరు కలగంటే మీ ఆప్తులతో మీకు అకారణంగా విరోధం కలుగుతుంది. దానిలో ఉద్యోగం చేస్తున్నట్లు కలవస్తే మీకు నూతన వ్యక్తులతో పరిచయం కలుగుతుంది.

0 9

గంటలు

బడి గంటలు వింటున్నట్లు కలగంటే మీ వృత్తివ్యాపారాలలో విజయం లభిస్తుంది. మ్రోగని గంట కలలో కన్పిస్తే మీ ఆశలు సఫలం కావు. గుడిగంట కాని మరేవిధమైన గంటను చూచినా ఫలితం ఇదే.

లెక్కలు

లెక్కలు వ్రాసేవానిగానో, చేస్తున్నట్లో కలగంటే మీకు కష్టాలు కలుగవచ్చు. లెక్కలు చేయటం, లేక వ్రాయటం తెలియకపోయినా ఇదే ఫలితం. కలలో మీరు లెక్కలు సరిగా చేయగలిగితే మీ వృత్తి వ్యాపారాలలో మంచి అనుకూలం ఏర్పడుతుంది. స్త్రీ లెక్కలు చేస్తున్నట్లు కలవస్తే మీ ప్రేమవ్యవహారాలు బెడిసిపోగలవు.

వ్రాత

మీకు కలలో చేతివ్రాత కనిపిస్తే మీరు పైలాపచ్చీసుగా ఉంటే నష్టపోగలరు. ప్రతి విషయాన్ని కాగితం మీద వ్రాసుకొని చేయటం మంచిది. ఎవరైనా మీ కలలో వ్రాస్తూ కన్పిస్తే మీ వ్రాతకోతల విషయంలో జాగ్రత్తపడటం మంచిది. మిమ్మల్ని ఏ విషయంలోనైనా ఇరికించే ప్రయత్నం జరుగుతుందని తెలుసుకోండి.

చిత్రం (బొమ్మ)

కలలో మీ చిత్రాన్ని ఆర్టిస్టు చేత గీయించుకొన్నట్లు కనిపిస్తే మీరు గాలిమేడలు కడుతున్నారని, అవి కూలిపోతాయని గుర్తుంచు కోండి. మరొకరు చిత్రాన్ని గీయించుకొన్నట్లు కలవస్తే మీకు వినోద కాలక్షేపాలతో విందు భోజనం లభిస్తుంది. మీరు గీయించుకొన్న చిత్రం అసహ్యంగా ఉంటే మీరు తలెత్తుకు తిరగలేని హేళనకు గురవుతారు. మీకు మరొకరి చిత్రం అసహ్యంగా ఉన్నట్లు కలలో

కన్పిస్తే మీ శత్రువుల విషయంలో జాగ్రత్తగా ఉండటం మంచిది. ఏ మాత్రం అజాగ్రత్తగా మాట్లాడినా నిందలకు గురికావలసి వస్తుంది.

## దేశపటం

దీన్ని మీరు కలలో చూచినచో మీకుగాని, మీ సంతానానికిగాని విదేశీయులతో లేదా దూర ప్రాంతాలవారితో వివాహం జరుగుతుంది.

## బొమ్మల పుస్తకం

బొమ్మలు అతికించిన పుస్తకాన్నిగాని, ఫొటోలు ఉన్న ఆల్బమ్ పుస్తకాన్నిగాని కలలో చూస్తే మీకు స్వల్పప్రమాదం జరుగవచ్చు. బొమ్మలు ఉన్న పుస్తకాన్ని చూచినా ఫలితము ఒకటే.

## గాలిపటం

కలలో గాలిపటాన్ని ఆకాశంలోనికి వదులుతున్నట్లు చూస్తే మీరు కొండకు వెంట్రుకను కట్టి లాగుతున్నారన్నమాట. అలాంటి ప్రయత్నాలు ఫలించవని గ్రహించాలి. గాలిపటం క్రిందికి వాలినట్లు కలలో కన్పిస్తే మీ వృత్తి వ్యాపారాలలో అపారనష్టం కలుగుతుంది.

## వ్రాతప్రతి

కలలో చేతితో వ్రాసిన కాగితాల దొంతరను చూస్తూ కాపీ చేసినా, టైపు చేసినా మీకు కోర్టులో ఉద్యోగం దొరుకుతుంది. ఎవరికైనా వ్రాతప్రతి ఇచ్చినట్లు కలగంటే మీ పనులు ఒక్కటీ సరిగా జరగవు.

## బల్ల

మీ కలలో బల్ల కన్పిస్తే మీ స్నేహితులతో ఉన్న గతబేధాలు స్పర్థలు మాసిపోతాయి. దానిమీద కూర్చున్నట్లు కలగంటే మీరు

పప్పులో కాలువేస్తారు. దుష్టులను నమ్మి నష్టపోతారు. బల్లలమీద నడుస్తున్నట్లు కలలో కన్పిస్తే దుర్మార్గులనుండి, దొంగలనుండి జాగ్రత్తగా తప్పుకోవటం మంచిది.

## కు ర్చీ

స్వప్నంలో మీరు కుర్చీని చూస్తే మీకు సుఖసంతోషాలు లభిస్తాయి. దానిమీద విశ్రాంతిగా కూర్చున్నట్లు కలగంటే మీకు కష్టాలు రానున్నాయని సూచన.

## ప ల క

పలకను కలలో చూస్తే మీరు ఏదో తప్పు చేస్తున్నారని, దాన్ని సరిదిద్దుకొనటం మంచిదని గుర్తుంచుకొనండి. పలకను చేతిలోనికి తీసుకొన్నట్లు కలగంటే మీరు ప్రస్తుతం చేసే చెడుకార్యాల ఫలితాన్ని భవిష్యత్తులో అనుభవించాల్సి ఉంటుంది. పలక పగిలిపోయినట్లు కలగంటే ప్రేమ విఫలమవుతుంది. మీరే దానిని పగలగొట్టినట్లయితే ప్రేమించినవారితో వియోగం.

## పు స్త కం

స్వప్నంలో మీరు పుస్తకాన్ని చూస్తే నూతన పరిచయం ఏర్పడుతుంది. చదువుతున్నట్లు కలలో చూస్తే ఇదే ఫలితం. పుస్తకాలను చిన్నపిల్లలు చదవటం కలలో కన్పిస్తే మీ పిల్లలు మంచివారు అవుతారు. పుస్తకాలు మీరు వ్రాస్తున్నట్లు కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో సంతృప్తి వుండదు. పాత పుస్తకాలు కలలో చూడటం చెడ్డవారినుండి మిమ్మల్ని మీరు కాపాడుకోవాలని సూచన. చిరునామాల పుస్తకంలోని పేజీలు తిరగవేస్తే మీ కుటుంబం వృద్ధిలోకి వస్తుంది. ఊరికనే చూస్తే మీరు అనుకొన్న పని జరుగదు. అందులో మీకు తెలిసినపేరు కన్పిస్తే ఆశాభంగ మవుతుంది.

సి రా

సిరాను చూచినట్లు కలగంటే ఫలితంలేని మాటలవల్ల మీరు నష్టపోతారు. దీన్ని అయినా కాగితంపై పెట్టటంవల్ల మీకు లాభం కలుగుతుంది. సిరాతో మీరు ఏదైనా వ్రాసినట్లు కలగంటే విలువైన ప్రామిసరీ నోటు మీకు ఎవరో వ్రాసి యిస్తారు. దానివల్ల మీకు గొప్ప లాభం కలుగుతుంది. సిరా ఒలికిపోయినట్లు కలగంటే ప్రతి పనిలో జాగ్రత్తగా ఉండటం మంచిది.

పె న్సి ల్

కలలో పెన్సిల్‌తో ఏదైనా వ్రాస్తే మీకు మంచి వార్తలు అందుతాయి. దానితో బొమ్మలు, గీతలు గీసినట్లు కలగంటే మీరు కళాకారులవుతారు. దాన్ని రెండుగా విరగగొడితే ఏదో కష్టంనుండి తప్పించుకోడానికి సిద్ధంగా ఉండాలని అర్థం.



# 23. పురుగు, పుట్రా - వగైరా

పట్టుపురుగు, ఆకుపురుగు వగైరా - దోమ, ఈగ, నల్లి లాంటివి – తేలు, మండ్రగబ్బ, కప్ప, ఎలుక, తాబేలు మొదలగునవి కలలో కనిపిస్తాయి. వీటి రంగు, అవి చేసే పని, మనం వాటితో చేసే క్రియా బాగా గుర్తుపెట్టుకోవాలి. అప్పుడే సరియైన ఫలితాన్ని తెలుసుకో గలుగుతాం—చూడండి.

## పట్టుపురుగు

కలలో దీన్ని చూస్తే ప్రేమ వ్యవహారాలలో పడిపోతారని సూచన అన్నమాట. చంపితే ప్రేమ ఫలిస్తుంది. పట్టుకాయల్ని చూస్తే త్వరలో మీకు వివాహం అవుతుంది.

## ఆకుపురుగు

ఇది కలలో కనిపిస్తే మంచి విందుభోజనం లభిస్తుంది. ప్రాకుతూ కనిపించిందా మీకు అనారోగ్యం కలుగుతుంది. ఏదో పక్షి దీన్ని తిన్నట్లు కనిపించిన యెడల మీ సమస్యలు గాలికి విడిపోయే మబ్బు ల్లాగా తేలిపోయి మీ మనస్సు కుదుటబడుతుంది.

## పేడపురుగు

స్వప్నంలో పేడపురుగు కనిపిస్తే బంధువులు వస్తారని అర్థం. ప్రాకుతూ కనిపిస్తే మీరు ఆర్థిక యిబ్బందులలో పడతారు. దాన్ని మీరు చంపితే కష్టాలనుండి విముక్తి కలుగుతుంది. ఇవి గుంపులుగా కనిపిస్తే అనారోగ్యం కలుగుతుంది.

## గొంగళి పురుగు

మీకు గొంగళి పురుగు కలలో కనిపిస్తే దగాకోరులతో స్నేహం ఏర్పడుతుంది. ప్రాకుతూ పోతే శత్రుభయం కలుగుతుంది. ఆకుల్ని తింటూ కనిపిస్తే అనారోగ్యం కలిగే సూచనగా భావించాలి.

## సాలె పురుగు

కలలో సాలెపురుగు కనిపిస్తే మీకు ఎందుకనో భయం కలుగుతుంది. తలచిన పనులు కావేమో అన్న అనుమానం ఏర్పడుతుంది. ఇది గూడు అల్లుతూ కనిపిస్తే, మీరు యిల్లుకట్టే శుభసమయం దగ్గర్లో వుందన్నమాట. పెద్ద సాలెపురుగు మీ కలలో కనబడితే అనారోగ్యంతో మీరు బాధపడతారు.

## దోమ

స్వప్నంలో దోమ మీకు సంగీతం వినిపిస్తూ కనిపిస్తే మీకు చిరాకు పరాకులు కలుగుతాయి. దోమ కాటువేస్తే సంతోషకాలం చాల దగ్గర పడినట్లు అనుకోవాలి. మీరు దోమను చంపితే, ఎన్నాళ్లనుంచో మీరు ఎదురుచూస్తున్న కబురు అందుతుందన్నమాట. రెండు చేతులు చప్పట్లలాగ చరిచి దాన్ని మీరు కలలో చంపితే అనారోగ్యం వస్తుంది.

## ఈగ

ఈగను కలలో చూస్తే కోపాన్ని కలిగించే సంఘటనలు జరుగుతాయి. గుంపుగా వాలితే శత్రువుల పద్మవ్యూహం నుంచి బయటపడే సూచన లున్నవి అన్నమాట. మీ నోట్లోకి ఈగ పోయినట్లు కలగంటే దుర్మార్గులతో మీకు పరిచయాలు ఏర్పడుతాయి. దాన్ని పట్టుకుని చంపితే మీకు ఏపనిలోనైనా విజయం కలుగుతుంది.

## చీమ

కలలో ఎర్రచీమల్ని చూస్తే ఎంతో లాభం కలుగుతుంది. చీమలబారు కనిపిస్తే, మీ సంపాదనకు మార్గాలు వెతుకుతారన్న మాట. చీమల పుటను మీరు పాడుచేస్తే అశుభం కలుగుతుంది. నల్ల చీమల్ని చూస్తే అనారోగ్యం ప్రాప్తిస్తుంది. వాటిని చంపితే స్నేహితులతో మీకు పేచీలు వస్తాయి. రెక్కల చీమలు కనిపిస్తే మీకు శుభ వార్తలు అందుతాయి. అవి ఎగురుతూ కనిపిస్తే విందు భోజనం లభిస్తుంది.

## పేను

ఇది కలలో కనిపిస్తే జోలిమాలిన పనులలో ఇరుక్కుంటారు. దాన్ని చంపితే అపనిందలు వస్తాయి. పేను జుట్టుకొరికితే మీరు అనుకున్నది నెరవేరదు. పేలు చూస్తున్నట్లు కనిపిస్తే మీకు కంటి జబ్బు వచ్చే సూచన వుంది.

## నల్లి

స్వప్నంలో నల్లి కనిపిస్తే శత్రుభయం కలుగుతుంది. అది మిమ్మల్ని కుట్టితే నూతన పరిచయాలు ఏర్పడుతాయి. చంపితే స్థలమార్పు జరుగవచ్చు. నల్లుల్ని మందుకొట్టి చంపితే, అనుకూల వార్తలు వింటారు.

## బల్లి

మీ కలలో బల్లి కనబడితే మీకు దగాకోరు వ్యక్తులతో పరిచయమై పేచీలు వస్తాయి. ఆకుపచ్చరంగులో బల్లి కనిపిస్తే అపనిందలు తొలగిపోతాయి. ఇటుకరంగు బల్లి కనబడితే మీకేదైనా అన్యాయం జరుగవచ్చు. చనిపోయిన బల్లిని చూస్తే వృథాశ్రమ కలుగుతుంది.

## ఊసరవెల్లి

కలలో ఊసరవెల్లిని చూస్తే మీ చుట్టూ దుష్టులు చేరుతారనీ, వాళ్లకు దూరంగా వుండడం మంచిదనీ హెచ్చరిక చేయడమన్నమాట.

## తేనెటీగ

తేనెటీగను కలలో చూస్తే, మీ పనులలో విజయం కలుగుతుందని అర్థం. అవి మిమ్మల్ని కుట్టితే క్రొత్తవారితో పరిచయాలు ఏర్పడుతాయి. తేనెపట్టుని చూస్తే నలుగురిలో మీకు ఎంతో గౌరవం లభిస్తుంది. చంపితే మిత్రులతో కాలక్షేపాలు జరుపుతారు.

## కందిరీగ

ఇది కలలో కనబడితే, వృత్తిలో సాటివారితో పోటీ వస్తుంది. అది మిమ్మల్ని కుట్టితే అనుకోకుండా మీ వ్యాపారంలో నష్టం వస్తుంది.

## లు

దీనిని స్వప్నంలో గాంచిన మిత్రులు శత్రువులుగా మారుతారు. కుట్టితే అలాంటి శత్రువువల్ల మీకు నష్టం కలుగుతుంది. దాన్ని మీరు చంపితే లాభం పొందుతారు.

## మండ్రగబ్బ

దీన్ని కలలో చూస్తే భయాందోళనలు ఏర్పడుతాయి. అది మిమ్మల్ని కుట్టితే కష్టాలు ఎక్కువ అవుతాయి. దాన్ని మీరు కలలో చంపితే పీడ విరగడైనంత సంతోషాన్ని పొందుతారు.

## జలగ

జలగ కలలో కనబడితే బంధువులవల్ల సహాయం లభిస్తుంది. అది మీ రక్తం పీలిస్తే, మీరు దానధర్మాలు చేస్తారు. పశువుల రక్తం

త్రాగుతుంటే, మీరు చంపితే ధైర్యంచేసి నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు. దానిలో మీరు బాగా సంపాదించగలుగుతారు.

సీతాకోక చిలుక

ఇది ఎగురుతూ మీ కలలో కనిపిస్తే, మీకు ఎంతో ఆనందం కలిగే సూచనలున్నాయని అర్థం. మీ మీద వాలితే (మగవారైతే) స్త్రీలతో పరిచయము కలిగి, (ఆడవారైతే) మగవారితో స్నేహం కలిగి, ప్రేమకు దారితీస్తుంది.

తుమ్మెద

దీనిని స్వప్నములో గాంచిన ఆనందం కలుగుతుంది. పూల లోని మకరందాన్ని జుర్రుతూ కనబడితే మగవారికి స్త్రీ సుఖము, ఆడవారికి పురుషసాంగత్యం ఏర్పడుతుంది.

మిడుత

మీ కలలో మిడుత కనిపిస్తే త్వరలో సాహసకార్యాలు ప్రారంభిస్తారు. దీనిని చంపితే ఆటంకాలు తొలగిపోతాయి. మీరు పట్టుకుంటే మిత్రుల వలన నష్టం కలుగుతుంది. మిడుతలదండును చూస్తే మీ ఉద్యోగంలో మార్పులు కలిగే సూచనలు వున్నాయని అర్థం.

కప్ప

కలలో కప్పను చూస్తే అనుకోని లాభం కలుగుతుంది. బెక బెక మంటే మీ పరువు, ప్రతిష్ఠలు పెరుగుతాయి. కప్పను కలలో చంపితే ఆస్తి నష్టం కలుగుతుంది. కప్పను తింటే మీ కేదో మాయదారి రోగం రావచ్చు.

## పి మ్మ టి

ఇది కలలో కనిపించినచో మీరు అవమానాలపాలు కావచ్చు. దీన్ని మీరు పట్టుకుంటే అప్రతిష్ఠపాలు అవుతారు. మీ వస్త్రాల్లో దాక్కుంటే కుటుంబ కలహాలు వస్తాయి. దీన్ని చంపితే దారిద్ర్యం నుంచి విముక్తి కలుగుతుంది.

## న త్త

నత్తను కలలో గాంచిన మీలో అసహనం పెరుగుతుంది. దాన్ని చంపితే నానారకాల కష్టాలు కలుగుతాయి. చెప్పుల కాళ్ళతో వాటి మీదుగా నడిస్తే అనుకోని ప్రమాదాలు వస్తాయి. కలలో నత్తను తింటే ఆస్తి నష్టం అవుతుంది. అది గుల్లలోకి పోతూ కనిపిస్తే ప్రేమకలాపాలు సాగిస్తారు.

## పీ త

దీనిని కలలో గాంచిన వ్యక్తులు వ్యాపారంలో మోసపోతారు. కలలో దీన్ని తింటే ఉద్యోగంలో చిక్కులు కలుగుతాయి. దీన్ని వండుకుని తింటే మొండిబాకీలను కూడ వసూలు చేయగలుగుతారు. మీ సత్తాకు తిరుగు వుండదు.

## తా బే లు

మీ కలలో తాబేలు నీటిలో వుండగా కనిపిస్తే జీవితంలో మంచి మార్గం చూపే మిత్రులతో పరిచయం ఏర్పడుతుంది. దీని మాంసమును తింటే మంచి స్నేహితుడిని పోగొట్టుకుంటారు, లేదా విలువైన సొమ్ము మీ చేయి జారిపోతుంది. చంపితే అశాంతి, ఆవేదన కలుగుతాయి.

### ఎలుక

ఎలుకను స్వప్నములో చూచిన ఆనందం లభిస్తుంది. అది కన్నములోకి దూరితే ప్రేమించినవారితో సమాగమం లభిస్తుంది. పట్టుకుని పీడిస్తే మిత్రులతో పేచీ వస్తుంది. చంపితే యింట్లోవారితోనే తగాదాలు వస్తాయి. బోనులో పెడితే శుభవార్తలు వింటారు.

### చుంచు ఎలుక

దీన్ని కలలో చూసిన వారికి ఎందుకో అనుకోని భయం ఏర్పడుతుంది. చంపితే మీరు క్రొత్త వస్తువులను కొంటారు. కలలో ఇది మిమ్మల్ని కరిస్తే ఆరోగ్యం పెరుగుతుంది. ధనలాభం కలుగుతుంది.

### పందికొక్కు

ఇది కలలో కనిపిస్తే సంపాదనకై మీరు క్రొత్త ప్రయత్నాలు చేస్తారు. చంపితే ఆరోగ్యం పెరుగుతుంది. కలలో దీన్ని పట్టుకుంటే మీ సమస్యలు పరిష్కారమవుతాయి.

### పాము

కలలో మామూలు పాము కనిపిస్తే మీరు స్త్రీవల్ల మోసగించబడి, ఆ మోసంతో పతనమైపోతారు. అది స్వప్నంలో కరిస్తే, మీరు యిరుకున పడటం ఖాయం. ఎలుకల్ని తినే పాము కనిపిస్తే మీ శత్రువులు అదనుకోసం పొంచి చూస్తున్నారని సూచన.



# 24. పేకముక్కలు

సాధారణంగా తెలుగు వారిలో పేకాట తెలియనివారంటూ వుండరు. ఈ ఆటను వినోదం కోసం మొదలు పెట్టి వ్యసనంగా మార్చుకున్నవారు కోకొల్లలు. ప్రతి క్లబ్ లో ఇది ముఖ్యాంశంగా వుంటుంది.

పేక ముక్కలు చాల ఖరీదైనవీ, తక్కువ వెల గలవీ వున్నాయి. దేనిలోనైనా ముక్కల రంగులూ, సంఖ్య ఒకటే. కళావర్, ఇస్పేట్ నలుపు రంగులో వుంటే - డైమన్, ఆటీన్ ఎఱుపు రంగులో వుంటాయి. ఒకటి నుంచి పది, జాకీ, రాణీ, రాజు - ఆ వరుసలో పదమూడు ముక్కలు ప్రతిరంగులోనూ వుంటాయి. ఇవి కాక జోకర్ అనే మరోముక్క వుంటుంది. అది రకరకాల జోక్‌లు చేస్తూంటుంది. అందువల్లే దాన్ని జోకర్ అన్నారేమో! ఒకటిని 'ఏస్' అంటారు. ఆట ననుసరించి దీని విలువ మారుతూ వుంటుంది. తొమ్మిదిని మణేలా అని అంటారు. పేక ముక్కలు కలలోకి వచ్చి పోతుంటాయి. వాటికి ఈ క్రింది ఫలితాలు కలుగుతాయి.

### కళావర్

రాజు

మానవత్వంతో, చక్కని వ్యక్తిత్వముతో ఆదర్శంగా జీవిస్తున్న మీరు, మీ అభిమానుల విశ్వాసానికి పాత్రులై సేవలు అందుకుంటారు. మీ సామాజిక కార్యక్రమాల వల్ల మీకేకాకుండా సంఘానికి కూడ ఎంతో మేలు చేకూరుతుంది.

రాణి :

కళావక్ రాణి ఏ యువతికైనా కలలో కనబడితే ఆ అమ్మాయి పెండ్లిచేసుకోక ముందే, ఏ రోమియో వలలోనో పడి తన శీలాన్ని కోల్పోయే ప్రమాదం వుంది. జరగాల్సిన ప్రచారమంతా అమ్మ లక్కల ద్వారా జరిగిన తరువాత చటుక్కున పెండ్లి అవుతుంది. అబ్బాయికి కలలో కనిపిస్తే తల్లిదండ్రులను కాదని ఏదో లోపం వున్న పిల్లను చేసుకోవాల్సిన స్థితి ఏర్పడుతుంది.

జా

మీ మేలు కోరి తన ప్రాణాలనైనా త్యాగం చేయగల ఆప్త మిత్రుడు లభిస్తాడు.

పది :

మీకు లక్కీ ఛాన్సు వుంది. అమితమైన ధనం ఏదో వైపు నుంచి వచ్చి మీ ఒడిలో పడుతుంది. కాని అది కారణంగా ఓ మంచి స్నేహితునితో అభిప్రాయభేదాలు ఏర్పడుతాయి.

తొమ్మిది :

మీరు నిర్మొహమాటలతోనూ, నిజాయితీతోనూ వుంటారు. అది మీ మిత్రుల మనస్సును నొప్పించవచ్చు. మీ జీవిత భాగస్వామిని చిన్నబుచ్చుకొనేలా చేయవచ్చు.

ఎనిమిది :

పిసినారితనం తలయెత్తుతుంది. అంతవరకు ఫరావాలేదు. డబ్బు కోసం దిగజారితేనేం అన్న తలంపు వస్తుంది. ఎంతో డబ్బు కూడ బెట్టినా, చివరికి సుఖానికి దూరమై మనశ్శాంతి కరవౌతుంది.

ఏడు :

బ్రహ్మాండమైన భవిష్యత్తు మీకోసం ఎదురు చూస్తుంది. ఈ సమయంలో ప్రపంచ ప్రసిద్ధికెక్కే అదృష్టం, అర్హత, పదవి, సంపద, ఏదో ఒకటి మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తుంది. అయితే మగవారు ఆడవారిని గూర్చి ఆడవారు మగవారిని గూర్చి చాల జాగ్రత్త వహించాలి. లేకుంటే అమృతం కాస్తా హాలాహలంగా మారిపోవచ్చు.

ఆరు :

సంతానంవల్ల సంతోషం కలుగుతుంది. అనుకూలురైన జీవిత భాగస్వాములతో ఆనందమయమైన జీవితం లభిస్తుంది.

ఐదు :

అవివాహితులకు వారివారి పరిస్థితుల్ని చక్కబరచి జీవితాన్ని బాగుచేసే జంట లభించవచ్చు. వివాహితులకు సమర్థులైన సత్సంతానం ప్రాప్తించవచ్చు.

నాలుగు :

డబ్బుకోసం ఆరాటం, పదవికోసం కక్కుర్తి పడతారు. కష్టాలు కాచుకుని వున్నాయి, జాగ్రత్త.

మూడు :

అవివాహితులు ఒకే సమయంలో ఇద్దరు ముగ్గురికి మనసిచ్చి, ఎవర్ని పెండ్లి చేసుకోవాలో తేల్చుకోలేక నానా హైరానాపడటం జరుగవచ్చు. వివాహితులకు కట్టుకున్నవారికన్న చుట్టూ తిరిగే పరాయి వాళ్ళపైన మక్కువ పెంచుకొనే ప్రమాదం వుంది.

రెండు :

మీ దారిన మీరు పోతుంటే కొందరు అనవసరంగా జోక్యం

కలుగచేసుకొని, తాత్కాలికంగా మీకు కొంత మనోవ్యథను కలిగిస్తారు. జాగ్రత్తగా వుండాల్సిన కాలం.

మీన్ :

మీ మనస్సు కుదుటపడుతుంది. అన్ని పరిస్థితులు చక్కబడుతాయి. మంచి దశ ప్రారంభమవుతుంది.

## మన్

రాజు :

క్షణంలో వుద్రేకానికి గురి అవుతారు. ఎవర్నో ఒకర్ని తిట్టింటాకా శాంతి వుండదు. తిట్లు తిన్న వ్యక్తి ప్రతీకారానికి పూనుకోవచ్చు. మీరు బదులుకు బదులు తీర్చుకోవాలన్న పంతంతో ప్రవర్తిస్తారు. ఆఖరుకు పరిస్థితులు గందరగోళంలో పడుతాయి. జాగ్రత్తగా వుండాల్సిన కాలం.

రాణి :

స్త్రీలకు గృహకృత్యాలలో విరక్తి కలుగుతుంది. పురుషులకు తమతమ ఉద్యోగ వ్యాపారాల్లో ఆసక్తి తగ్గిపోతుంది. స్త్రీలకు పరపురుషులపైన, పురుషులకు పరస్త్రీలమీద వ్యామోహం ఏర్పడవచ్చు.

జాకీ :

మీ చుట్టూవుండే మిత్రులు, బంధువులు మిమ్మల్ని తమ స్వార్థానికి వినియోగించుకుంటారు. మీ అవసరానికి ఎవరూ అండగానిలువరు.

పది :

మంచి జోడీ కుదురుతుంది. అంతకంటే మంచి సంతానము కలుగుతుంది. కొత్త నోట్లు పెరపెరలాడిస్తూ ఖర్చు చేస్తుంటారు. డబ్బుకు లోటు వుండదు.

తొమ్మిది :

మీకు కావాల్సినంత ఆస్తి వున్నా కొంచెంకూడా తృప్తి వుండదు. ఆశాభంగాలు, వైరాగ్య భావాలతో మనసు నిలకడగా వుండదు.

ఎనిమిది :

జాగ్రత్త! ఎప్పటికీ మీకు పెండ్లి కాకపోవచ్చు. ఒకవేళ అయినా, ఆలస్యంగా అవుతుంది. వివాహితులకు రోగాలు వచ్చి అవస్థపడతారు. ప్రాణభయంతో కంగారు ఏర్పడుతుంది.

ఏడు :

ప్రశాంతతకోసం గ్రామాలకు వెళ్లుతారు. అచ్చట వాతావరణం మీకు బాగా నచ్చుతుంది. అయితే పట్నవాసపు తళుకుబెళుకులు లేక పోవటంతో మీ భాగస్వామి వాటిమీది మోజు చంపుకోలేక, మిమ్మల్ని ఇబ్బంది పెట్టటం జరుగవచ్చు.

ఆరు :

యుక్త వయస్సు రాకముందే పెండ్లి కావచ్చు. పెళ్లి అయిన కొద్ది కాలానికే మీ జీవన సహచరులను కోల్పోవచ్చు. మరో పెండ్లికి మీరు చేసే ప్రయత్నాలు ఫలించినా, అది మొదటిదానికన్న అధ్వాన్నంగా వుండవచ్చు. కాబట్టి చాల జాగ్రత్తగా వుండటం మంచిది.

ఐదు :

పడకగది సుఖం సర్వదా వుంటుంది. మీరు మొగవారైతే, మీ శ్రీమతిని ఆరు నెలలు బాలింత, ఆరు నెలలు చూలింతగా చేసే సామర్థ్యం వుంటుంది. మీరు ఆడవారైతె మీ భర్త మీ కొంగు పట్టుకొని తిరిగేలా చేసుకోగల చతురులవుతారు. మీరు గీచిన గీటు దాటకుండా మీ భర్తను అదుపులో పెట్టుకోగల ధీమా మీకు వుంటుంది, సత్యభామ లాగ!

O 10

నాలుగు:

జాగ్రత్త! మిమ్మల్ని ప్రేమించే వ్యక్తి లేదా పెళ్ళిచేసుకున్న వ్యక్తి మీ వెనుకే గోతులు త్రవ్వి మీకు ఎసరు పెట్టడానికి ప్రయత్నించవచ్చు. ఆ ప్రమాదంనుంచి కాపాడుకోవటం ముఖ్య కర్తవ్యం.

మూడు:

తగాదాలు, దావాలు, గృహకల్లోలాలు, ఎక్కువగా వుంటాయి. మీ భర్తకోపం తారాస్థాయి చేరవచ్చు, లేదా మీ భార్యలో సహనం నశించవచ్చు. పడకగది కర్తవ్యాలు మర్చిపోయి మూర్ఖంగా ప్రవర్తించి జీవితం నిస్సారం చేసుకొనే ప్రమాదం వుంది. ఆలింగనం అంటే ఆరు ఆమడలదూరం పరుగెత్తే స్వభావం కలుగవచ్చు.

రెండు:

అతి త్వరగా ప్రేమలో పడిపోవటం, కన్నవారు అందుకు అంగీకరించక పోవటం అయినా, పెండ్లి పూర్తికావటం జరుగుతుంది. వివాహితులకు సంతోషం వుండదు. దూరపు కొండలు నునుపుగా తోస్తాయి. కట్టుకున్నవారితో కయ్యానికి కాలుదువ్వే స్వభావం ఏర్పడవచ్చు.

ఏస్:

ఆటపాటల్లోను, వేడుకల్లోను ఆసక్తి కలుగుతుంది. బంగళాలు కట్టించడం, తోటలు పెంచటం లాంటివి చేస్తారు.

## ఆటిన్

మీ శరీరసౌష్టవం చక్కగా పెరుగుతుంది. మగవారైతే 'భారతశ్రీ'గానూ, ఆడవారైతే 'మిస్ ఇండియా'గానూ ఎన్నికయ్యే

అర్హతలు ఏర్పడతాయి. మంచి ఆరోగ్యం మీ అదృష్టకారణమవుతుంది.

మగవారికైతే, అందాలరాణి భార్య అయ్యే యోగం పడుతుంది. పదిమందీ నిలిచి ఆమె వంకే చూస్తుంటే మీకు చిత్రవధగా వుంటుంది. ఆడవారికైతే చూడచక్కని చిన్నవాడు భర్తగా లభిస్తాడు మీ స్నేహితురాళ్ళు మీ భర్తను తమ వలలో వేసుకొనే ప్రమాదం ఎప్పుడూ పొంచి చూస్తుంటుంది.

జాకీ :

మీలో స్నేహభావం, ఇతరులకు సహాయం చేయాలనే తపన ఏర్పడుతాయి. నలుగురిలో మంచి పలుకుబడి లభిస్తుంది. మీ మాటకు విలువ, మర్యాద, గుర్తింపు వుంటాయి.

పది :

అపాయాలు, ప్రమాదాలు, మిమ్మల్నేమీ చేయలేవు. సముద్రాన్నైనా సులభంగా ఈదగలరు. తుఫానులోనైనా హాయిగా ఆడుతూ పాడుతూ వెళ్ళుతారు. అటూ ఇటూ బస్సులు, లారీలు వస్తున్నా, మీరు ట్రంకురోడ్డుకు అడ్డంగా కళ్ళుమూసుకొని పరుగెత్తినా మీకు ప్రమాదం జరుగదు. మీ జాతకం అమోఘంగా వుంటుంది.

తొమ్మిది :

అంతులేని సంపద, ముత్యాల్లాంటి బిడ్డలు, ఉన్నత పదవి, అందుకుతగ్గ అధికారం లభిస్తాయి.

ఎనిమిది :

స్నేహితులవల్ల దురలవాట్లకు గురికావచ్చు. స్నేహితులు లేక బంధువుల ఇంట్లో ప్రేమపరిచయాలు, ఆ తరువాత వావివరసలు లేని

లైంగిక సంబంధాలతో చెడ్డపేరు ఏర్పడుతుంది. అటుపై మీ ఆరోగ్యం కూడా దెబ్బతినవచ్చు.

ఏడు :

ప్రతి క్షణం మీ మనస్సు ఊసరవెల్లిలా రంగులు మారుస్తూ వుంటుంది. మీ మనస్సు ఏ పనిమీదా నిలకడగా వుండదు.

ఆరు :

మీరు నిర్మొహమాటంగా మాట్లాడుతారు. నీతి నిజాయితీలతో బ్రతుకుతారు. మీ ఇంట్లోవారికి మాత్రం యిది నచ్చక అపార్థాలకు దారితీసే పరిస్థితి ఏర్పడుతుంది.

ఐదు :

అర్థం పర్థం లేని ఆలోచనలతో మీ బుర్ర పాడవుతుంది. ఏ పనిమీదా మనస్సు నిలకడగా వుండదు.

నాలుగు :

మీరు ఎవర్నీ ఆకర్షించలేరు. అందువల్ల మీకు వివాహం జరగటంలో ఆలస్యం అవుతుంది, జరిగినా అందం, ఆకర్షణ లేకపోవటంతో దాంపత్యంలో అనురాగం, అప్యాయత లోపిస్తాయి.

మూడు :

పదిమందికి తమ అనుభవాలు చెప్పుకోవటం వల్ల మీరు మీ జీవితాన్ని కాపాడుకో గలుగుతారు.

రెండు :

అనుకోని విధంగా, అసాధారణంగా, అకస్మాత్తుగా అఖండ విజయాన్ని సాధిస్తారు. దానితో అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేస్తారు.

ఏస్ :

వింతలు వినోదాలతో, విందులు విహారాలతో జీవితం నవ్వుల నడుమ పువ్వుల పడవలో సాగిపోయింది.

## ఇస్పేటు

రాజు :

ప్రభుత్వంలో హోదా, పలుకుబడి వున్న వ్యక్తితో మీకు పరిచయాలు ఏర్పడుతాయి. వ్యాపారానికి లైసెన్స్‌గాని, ఉద్యోగములో ఉన్నతినిగాని సంపాదిస్తారు. మీరు మరికొందరికి అలాంటి సహాయం చేయగలుగుతారు.

రాణి :

మీరు పురుషులైతే స్త్రీలచేతిలోనూ, స్త్రీలు అయితే పురుషుల చేతిలోనూ మోసపోయే సందర్భాలు ఏర్పడుతాయి. అతిగా పర స్త్రీలతోగాని లేక పరపురుషులతో గాని తిరగడంవల్ల అనారోగ్యం, ఆర్థిక యిబ్బందులు ఏర్పడవచ్చు.

జాకీ :

మీ అవసరాన్ని గూర్చి మీ ఆత్మీయుల్ని అర్థిస్తారు. వారు వాగ్దానం చేస్తారు. కాని మాటిమాటికి వారికి గుర్తు చేయటం, హెచ్చరిక చేయటం, నిష్ఠూరంగా మాట్లాడటం లాంటివి చేస్తేగాని మీ పనులు పూర్తికావు. అంటె కొండను త్రవ్వి ఎలుకను పట్టిన ట్లవుతుంది.

పది :

దురదృష్టవశాత్తు అనుకోని ఆటంకాలు ఏర్పడి మీ భవిష్యత్తు దెబ్బతింటుంది.

తొమ్మిది :

చిన్నదెబ్బ తగిలో లేక గాయమేర్పడో అది పెద్ద జబ్బుగా పరిణమించే ప్రమాదం వుంది. ప్రాణభయంతో వుక్కిరిబిక్కిరి గావటం జరుగుతుంది. కోతిపుండు బ్రహ్మరాక్షసి సామెత్తగా మీకు అనర్థం ఏర్పడవచ్చు.

ఎనిమిది :

మీ పనులకు, మీ తోబుట్టువులుగాని, మీరు నమ్మిన స్నేహితులు గాని అడ్డుపడతారు. మీ మనస్సు పాడవుతుంది అయినా సహనంతో మౌనంగా వుండిపోతారు. అందువల్ల అంతిమవిజయం మీదే అవుతుంది.

ఏడు :

ప్రియమైన, విలువైన ప్రాణస్నేహితుని పోగొట్టుకుంటారు. పిచ్చెక్కినట్లు అన్పిస్తుంది. నిద్రాహారాలు సరిగా అమరవు.

ఆరు :

మీ వ్యాపారం తలక్రిందు లవుతుంది. అనుకున్నది అనుకున్నట్లుగా జరుగదు. అయితే, పట్టువిడువకుండా వ్యాపారాన్ని పునరుద్ధరిస్తారు. కూలిపోయిన కాపరాన్ని నిలబెట్టగలుగుతారు.

ఐదు :

గుడ్డిగా, మూర్ఖంగా, మీరు నిప్పుల్లో దూకమంటే దూకే శిష్య బృందం, మిత్రవర్గం ఏర్పడుతుంది. మీరంటే పడి చచ్చేవారు మీ చుట్టూ చేరడంవల్ల, వారు చావకుండా చూచే బాధ్యత మీ పైన పడుతుంది.

నాలుగు :

అకస్మాత్తుగా సుస్తీ చేస్తుంది. మందుమాకులకంటే మనస్సును నిశ్చలంగా వుంచుకోటంవల్ల మీ వ్యాధి త్వరగా నయమవుతుంది.

మూడు :

మీరు అవివాహితులైతే మీ పెళ్ళి విషయంలో అన్యాయం జరుగుతుంది. వివాహితులైతే జీవిత భాగస్వాములవల్ల అన్యాయం జరుగవచ్చు. మీరెంత పేదపిల్లను పెండ్లిచేసుకున్నా ఆమె నడమంతరపు సిరితో మీ తిక్క కుదిరించాలనుకోవడం మీ దురదృష్టం. బుద్ధిమంతుడుగదా

అని ఓ పేదయువకుడిని మీరు పెండ్లి చేసుకుంటే మీకన్నా ఆస్తివున్న మరో అమ్మాయిపై మీ శ్రీవారి కన్ను పడుతుంది.

రెండు :

ఉదయం లేచినదగ్గర్నుంచి రాత్రి పడుకునేవరకు ఏదోవిధంగా అశాంతికి గురి అవుతారు. రాత్రి నిద్రపోయినా పీడకలలే వస్తాయి. పాడు ఆలోచనలతో దైనందిన జీవితం నిస్సారమౌతుంది.

ఏస్ :

మంచికో చెడ్డకో ఏదో ఒక ప్రేమ వ్యవహారంలో పడిపోతారు. పెద్దలు అంగీకరించినా, అంగీకరించకపోయినా పెళ్ళి జరిగిపోతుంది. అయితే పెండ్లి అయిన తరువాత అనురాగం తగ్గిపోయి ఎడబాటు కలిగే ప్రమాదం ఏర్పడవచ్చు, జాగ్రత్త!

జోకర్ :

ఏ ఒక్కపనిమీదా మీకు ఆసక్తి వుండదు. ఎవరిపైనా మనస్సు నిలువదు. ఎవరినో ప్రేమించి, ఎవరినో పెళ్ళాడి, ఇంకెవరితోనో దాంపత్యసుఖం అనుభవిస్తూ సంసారాన్ని సాగించే నిలకడలేని పరిస్థితి ఏర్పడవచ్చు.



# 25. ప్రేమ, పెండ్లి వగైరా

ప్రేమ

మీ కలలో ఎవరో ప్రేమించుకొన్నట్లు కనిపిస్తే మీరు చేయబోయే ప్రయత్నాలు అన్నివిధాల ఫలించగలవు. మీరే ప్రేమిస్తున్నట్లు కలగంటే మీ జీవితం ప్రశాంతంగా సుఖంగా గడచిపోతుంది.

నిశ్చితార్థము (పెళ్లి తాంబూలాలు)

పెండ్లికి ముందు తాంబూలాలు మార్చుకునే కార్యక్రమాన్ని నిశ్చితార్థం అంటారు. మీకే నిశ్చితార్థం అయినట్లు కలవస్తే మీ కుటుంబంలో కలతలు సంభవించవచ్చు. ఇతరులకు జరిగిన నిశ్చితార్థం మీరు కలలో చూస్తే వివాహితులుగా నున్న వారు ప్రేమలో పడతారు. వివాహము కానివారు శీఘ్రంగా పెండ్లి చేసుకొంటారు. నిశ్చితార్థము సగములో జరుగకుండ ఆగిపోయినట్లయితే మీ బంధుమిత్రులకు మీపై నిరాశ కలిగి మీపైనున్న నమ్మకాలు పోతాయి.

పెండ్లికూతురు

కలలో మీరు వధువు అయినట్లు కనిపిస్తే మీ హోదా పెరుగుతుంది. మరొకరిని వధువుగా మీరు కలలో చూస్తే మీకు సుఖ సంతోషాలు కలుగుతాయి. వధువును ముద్దాడినట్లు కలగంటే కలతలు మరచిపోయి అందరు కలసిపోతారు. వధువు మిమ్మల్ని ఆప్యాయంగా ముద్దాడినట్లు కలగన్నా మీ ప్రియబాంధవికి ఎప్పటినుండో ఆస్తి కలసి వచ్చే సూచనలున్నాయి.

పెండ్లికొడుకు

పెండ్లికొడుకును మీరు కలలో చూస్తే మీ మిత్రులలో ఎవరికో

వొకరికి వివాహము జరుగగలదు. మీరే వరునిగా కలలో కన్పిస్తే ఏదో విధంగా ధనం వచ్చి మిమ్మల్ని చేరుతుంది. వరుని ముద్దుపెట్టు కొన్నట్లు కలగంటే మీకు ఎవరితోనయినా వివాదం జరుగవచ్చు. బాధ కలుగవచ్చు.

పెండ్లి

స్వప్నంలో మీకు వివాహం జరిగినట్లు కనిపిస్తే మీకు సుఖ సంతోషాలు లభిస్తాయి. ప్రతికార్యంలో విజయం లభిస్తుంది. మరొకరి పెండ్లి మీరు కలలో చూస్తే ఇతరులపై అకారణంగా మీకు ఈర్ష్య కలుగుతుంది. రెండోపెండ్లివాని వివాహంగాని, వితంతువివాహంగాని కలలో కన్పిస్తే మనస్సులో మీకు తీరని అశాంతి కలుగుతుంది. పెండ్లి కొడుకుగానో, పెండ్లికుమార్తెగానో మీరు దుస్తులు ధరిస్తున్నట్లు కల గంటే మీ కుటుంబములో కలతలు వస్తాయి. వివాహ భోజనం తిన్నట్లు మీరు కలగంటే ఆయురారోగ్యాలు పెరుగుతాయి. ప్రేమ యాత్రకు బయలుదేరినట్లు కలగంటే మీకు మంచి అనుభవము కలిగి, ఆనందమయ జీవితం లభిస్తుంది.

పూలదండ

మీరు మెడలో పూలదండను ధరించినట్లు కలగంటే మీకు కీర్తి ప్రతిష్ఠలు కలుగవచ్చు. నలిగిపోయిన పూలదండను కాని, ఎండి పోయిన పూలదండను కాని మీరు ధరించినట్లు కలలో కన్పిస్తే మీ ఆశలు అడియాసలు కాగలవని అర్థం. మెడలో బంగారపు హారాన్ని ధరించినట్లు మీరు కలగంటే అనారోగ్యంతో ఉన్నవారు మరణించ వచ్చు. మీరు ధనికులైతే ఘనవిజయాలు కలుగవచ్చు. పేదవారైతే దరిద్రం మరింత ఎక్కువ కాగలదు.

## పూలగుత్తి

కలలో మీరు పూలగుత్తిని చూస్తే స్నేహితుల సహాయం లభిస్తుంది లేదా మీకు ప్రేమ వ్యవహారంలో విజయం కలుగవచ్చు. పూలగుత్తిని తయారుచేస్తున్నట్లు కలగంటే నూతన వ్యక్తులతో పరిచయం కలిగి స్నేహం పెరుగుతుంది. పెండ్లిలో ఉపయోగించే పూలగుత్తిని పట్టుకొని ఉన్నట్లు కలగన్న నలుగురూ మీరు గర్విష్ఠులని అంటారు. మీరు దాన్ని యితరులకు బహూకరిస్తున్నట్లు కలవస్తే మీ తాహతును మించిన ఖర్చులు వస్తాయి.

## పూలబుట్ట

పూలతో నిండిన బుట్ట కలలో కనిపిస్తే మీరు బాధలతో సతమతమవుతూంటే మీ బంధుమిత్రులు మిమ్మల్ని ఓదార్చి అండగా నిలుస్తారు.

## పూలతోట

పూలతోటలో మీరు విహరిస్తున్నట్లు కలవస్తే సుఖాలు లభిస్తాయి. దాన్ని దూరం నుండి కలలో చూస్తే నూతన పరిచయాలు, స్నేహాలు ఎక్కువ అవుతాయి. పూలతోట చుట్టూ ముళ్ళకంచె ఉన్నట్లు మీరు కలలో చూస్తే మీకు ఆశాభంగం కలగవచ్చు. పూలు రాలిపోయి, చెట్లు పడిపోయినట్లున్న పూలతోటను కలలో చూస్తే చెడు సలహాలు లభిస్తాయి. పెద్ద కంచె గల పూలతోటలో పనిచేస్తున్నట్లు కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో మీ కృషి తృప్తినిస్తుంది.

## ముద్దు

కలలో యితరులు మిమ్మల్ని ముద్దుపెట్టుకొన్నట్లు కన్పిస్తే సంఘంలో మీకు మంచి గౌరవం కలుగుతుంది. మీరు మరొకరిని

ముద్దుపెట్టుకొంటే మీ ఆశలు ఫలించవు. పురుషులు స్త్రీలను ముద్దు పెట్టుకొన్నట్లు కలవస్తే మీరు స్త్రీలోలుడు కావచ్చు. స్త్రీలు పురుషులను ముద్దుపెట్టుకొన్నట్లు కలగంటే వృత్తి వ్యాపారాలలో నష్టం కలుగుతుంది. ముసలివారిని ముద్దుపెట్టుకొన్నట్లు కలగంటే మీ ఆశలు అడియాశలు అవుతాయి. తల్లిని ముద్దుపెట్టుకొన్నట్లు కలవస్తే మీరు తోటివారి ఆదరానికి దూరమై బాధపడతారు. చెతుల్ని, ముఖాన్ని చుంబించినట్లు కల వచ్చినవారు అదృష్టజాతకులౌతారు. భూమిని చుంబించినట్లు కలగంటే అంత మంచిది కాదు. మీకు అగౌరవం కలుగుతుంది. మీ ప్రేయసి పెదవులపై తియ్యగా పెదవు లద్దినట్టు కలగంటే అమరసుఖం లభిస్తుంది.

## కౌగిలింత

కలలో కౌగలించుకొని ఇంగ్లీషు నాట్యం చేస్తే మీ ప్రేమ ఫలిస్తుంది. మరెవరైనా అలా చేస్తున్నట్లు కలలో మీరు చూస్తే ప్రేమలో పడతారు. మీరు ఎవరినైనా కౌగలించుకొన్నట్లు కలగంటే మీరు చేయబోయే పనులలో ఏమీ తోచక అవస్థకు లోనవుతారు. మిమ్మల్ని ఎవరయినా తటాలున కౌగలించుకొన్నట్లు కలవస్తే మీరు నలుగురిలో నవ్వులపాలవుతారు. మీ రెవ్వరినన్నా బిగియార కౌగలించుకొని బలవంతంగా ముద్దుపెట్టుకున్నట్లు కలగంటే నరాల బలహీనత ఏర్పడుతుంది.

## గర్భిణి

మీరు కలలో గర్భిణి అయినట్టు కనిపిస్తే అనుకొన్నవి అనుకున్నట్లు జరుగుతాయి. చేలలో గర్భిణీ స్త్రీని చూచినా ఫలితం ఇదే.

## మానభంగం

కలలో మానభంగం జరుగుతున్నట్లు కనిపించటం చాలా

చెడును కల్గిస్తుంది. మీరే ఆ కార్యక్రమంలో వుంటే మతిస్థిమితం పోతుంది.

రాక్షస రతి

బలవంతమైన రతిని కలలో చూచినట్లయితే మి మనస్సు వక్రమార్గాన సంచరించవచ్చు. ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా సవరించుకోలేని తప్పు చేస్తారు. ఒక స్త్రీని అనేకమంది పురుషులు కాని, ఒకే పురుషుడు ఒకేసారి పలువురు స్త్రీలను కాని మన్మధ క్రీడల్లో తేలియాడిస్తున్నట్లు కలగంటే నయంకాని రోగం వస్తుంది.

విడాకులు

కలలో వివాహితులు విడిపోయినట్లు కనిపిస్తే మీ కుటుంబంలో కలతలు రావచ్చు. మీరు జాగ్రత్తగా ఉంటే అన్నీ సర్దుకుంటాయి.

వితంతువు

భార్యపోయినవానినికాని, భర్త చనిపోయిన స్త్రీని కాని కలలో చూస్తే చాలా మంచిది. అనుకోకుండా మీకు ధన సహాయం లభిస్తుంది.



# 26. పండ్లు

కలలో పండ్లు కనిపించడములో ఆశ్చర్యంలేదు. అయితే స్పష్టంగా ఏ పండ్లు, ఏ రంగులో కనిపించిందో గుర్తు వుంచుకోగలిగితే కలల ఫలితాలు అంత చేరువగా వుంటాయి. ఆ పండును మీరు తిన్నారా? చూచారా? ఎక్కడ? చెట్టుమీదనా? అంగట్లో వ్రేలాడ తీయబడివుంటేనా? బుట్టలో వున్నదా? మీ చేతిలో వున్నదా? అన్న ప్రశ్నలకు మీకు జబాబులుండాలి. క్రియనుబట్టి, ఆ పండును చూడటం వల్ల శుభమో, అశుభమో నిర్ణయమౌతుంది. కనుక పై విషయాలు స్పష్టంగా తెలుసుకుని, గుర్తుంచుకుని ఫలితాలను సరిచూచుకోవాలి. చూడండి!

### నిమ్మ పండు

కలలో నిమ్మపండు పసుపుపచ్చగా కనిపిస్తే శుభం కలుగుతుంది. ఆకులతో, నిమ్మపండ్లతో వున్న చెట్టును చూస్తే మీకు ఉజ్జ్వల భవిష్యత్తు వీర్పడుతుంది. ఊరగాయ పెట్టినట్లు కలవస్తే మీరు యిల్లు మారే సూచనలున్నాయి. నిమ్మరసం తీసి త్రాగినట్లు కనిపిస్తే ఆపదలు ఎదురవుతాయి. గోరుచుట్టుకు నిమ్మకాయను తొడిగినట్లు చూస్తే అశుభం జరుగవచ్చు.

### దానిమ్మ పండు

ఎర్రగా చక్కగా పండిన దానిమ్మ పండును కలలో చూస్తే మీకు మంచి సంతానము కలిగే సూచన అన్నమాట. దానిమ్మ గింజల్ని తిన్నట్లు కలగంటే అన్నిటా అభివృద్ధి కలుగుతుంది. పచ్చిగా వున్న దానిమ్మకాయను కలలో చూస్తే, మీరు ఎక్కడికో ప్రయాణం చేయ

వలసివుంటుందని అర్థం. సరిగా పండని దానిమ్మకాయను తిన్నట్లు కల గంటే ఎవరికోనన్నా తగాదాలు రాగల సూచనలు వున్నాయి.

ఖర్జూర పండు

ఖర్జూర పండును తిన్నట్లు కలవస్తే పదిమందిలో 'సెబాష్' అని అనిపించుకునే గౌరవం పొందుతారు. ఎండు ఖర్జూరం తిన్నట్లు కల గంటే త్వరలో పెండ్లి భోజనము లభిస్తుంది. అది మీ వివాహమే కావచ్చు. ఖర్జూరపు చెట్టును కలలో చూస్తే ఎంతో ఆనందం కలుగుతుంది. మీ కలలో ఖర్జూర పండ్లను ఏరుకుని జేబునో, ఒడినో, గంపనో నింపుకుంటే మీ ఇంటికి బంధువులు వస్తారు.

జామ పండు

కలలో జామపండును చూస్తే మీకు పంటికి సంబంధించిన బాధ కలుగుతుంది. బాగా పండిన జామపండును తిన్నట్లు కలగంటే మీ ఆరోగ్యం సమృద్ధిగా పెరుగుతుంది. పండ్లతో విరగకాచిన చెట్టును కలగంటే దేనివల్లనో మీకు భయం కలుగుతుంది. జామపండ్లను దొంగిలించినట్లు కలవస్తే చక్కని పసిపాపలతో స్నేహము కలుగుతుంది.

దొండ పండు

మీరు మగవారైతే, కలలో దొండపండు కనిపిస్తే అందమైన స్త్రీలతో స్నేహం కలుగుతుంది. దొండపండును తిన్నట్లు కలవస్తే ప్రేమలో పడిపోతారు. ఈ పండును ఎవరికన్నా యిచ్చినట్లు కలవస్తే స్త్రీకోసం ఆరాటం తప్పనిసరి అవుతుంది. దొండపండును ఎవరి నుండైనా స్వీకరించినట్లు కలగంటే స్త్రీలే మీ చుట్టూ తిరుగుతారు. బాగా ఎర్రగా ముదరపండిన పండు తిన్నట్లు కలగంటే కామకలా

పాలు ఎక్కువవుతాయి. మీరు ఆడవారైతే మగవారితో ఆ యా ఫలితాలు కలుగుతాయి.

అత్తిపండు

అత్తిపండును కలలో చూస్తే మీ ఆస్తికి నష్టం కలుగుతుంది. అత్తిపండును అప్యాయంగా తిన్నట్లు కలగంటే అజాగ్రత్తవల్ల ధనాన్ని పోగొట్టుకోవచ్చు. అంగట్లో అత్తిపండును కొన్నట్లు కలవస్తే మీకు అన్నిటా అభివృద్ధి కలుగుతుంది. అత్తిపళ్ళను ఏరుకొంటున్నట్లు కల వస్తే తలపెట్టిన ఏ పనీ జరుగదు. ప్రయాసే మిగులుతుంది. అలా అని మీరు దాన్ని చేయకుండా వుండలేరు.

అనాసపండు

మీరు దీన్ని కలగంటే ఆనందం కలుగుతుంది. అనాసపండును తిన్నట్లు కలగంటే వుద్రేకం కలుగుతుంది. జాగ్రత్తగా వుండాలి. అనాసపండును అంగట్లో కొన్నట్లు కలగంటే ఉత్సాహము లభిస్తుంది.

వెలగపండు

కలలో ఈ పండును చూస్తే మంచి విందు భోజనం లభిస్తుంది. వెలగపండును తిన్నట్లు కలగంటే క్రొత్తపరిచయాలు లభించి అవి మీ పురోభివృద్ధికి తోడ్పడుతాయి.

అరటిపండు

దీన్ని కలలో చూస్తే మీ ప్రేమ ఫలిస్తుంది. అరటిపండును తిన్నట్లు కలగంటే కోరుకున్నవారితో సమాగమం లభిస్తుంది. అరటి గెలను కలలో చూస్తే (స్త్రీలతో, మగవారితో) స్నేహం ఎక్కువవు తుంది. అరటిచెట్టును కలలో చూస్తే మగవాళ్ళైతే ఆడవారితోను, ఆడవారైతే మగవాళ్ళతోను బరితెగించి తిరుగుతారు. ఎవరికన్నా

అరటిపండును యిచ్చినట్లు కలగంటే శుభాలు "క్యూ"లో వచ్చి నిలుస్తాయి. ఎవరిదగ్గరనుంచియైనా దీన్ని పుచ్చుకున్నట్లు కలగంటే పలు కష్టాలు కలుగుతాయి.

### నేరేడుపండు

నేరేడుపండు రాలి క్రిందపడటం కలలో చూస్తే ఆనందం కలుగుతుంది. నేరేడుపండు తిన్నట్లు కలగంటే ఆరోగ్యం దెబ్బతినే ప్రమాదం వుంది. నేరేడు చెట్టును కలలో చూస్తే శుభవార్తలు వింటారు. వర్షంలో చెట్టు క్రింద నిలబడి రాలిన నేరేడుపండ్లను ఏరుకుని తిన్నట్లు కలగంటే మీ ప్రేమ సఫలం అవుతుంది.

### గుమ్మడిపండు

కలలో దీన్ని వ్రేలాడతీసినట్లు చూస్తే శత్రువులవల్ల మీకు అపాయం కలుగుతుందన్న భయం హెచ్చుతుంది. దీన్ని నేలకేసి కొట్టి బ్రద్దలుచేసినట్లు కలగంటే సంతోషం కలుగుతుంది. గుమ్మడి పండును తిన్నట్లు కలగంటే ఆకస్మిక ద్రవ్యలాభం పొందుతారు. గుమ్మడిపండును కొన్నట్లు కలగంటే చర్మవ్యాధులు వచ్చే సూచన లున్నాయి. కలలో దీన్ని మోసుకెళ్ళితే కోర్టులో విజయం లభిస్తుంది.

### ఆపిల్ పండు

ఎర్రగా తియ్యగా ఉండే ఆపిల్ పండును కలగాంచితే మీకు ప్రియమైనవారి నుండి దూరమై ఎడబాటులోని బాధను అనుభవిస్తారు. కలలో ఆపిల్ పండు తింటే విచారం కలుగుతుంది. పుల్లగా ఉండే ఆపిల్ పండును తిన్నట్లు కలవస్తే, మీరు ప్రేమించిన వారితో సమాగమం కలుగుతుంది. ఆపిల్ పండ్లతో నిండిన చెట్టును కలగాంచితే బంధువులు వచ్చి మీ యింట్లో తిష్ఠ వేస్తారు. ఆ తాకిడికి

తటుకోవడం కష్టం. గంపనిండుగా ఆపిల్ పండ్లను కలలో చూస్తే మీ స్నేహితులతో వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు.

## రేగుపండు

పెద పెద రేగుపండ్లు కలగంటే గొప్పవారితోనూ, పెద్దవారితోనూ, మీకు స్నేహం కలుస్తుంది. వీటిని తిన్నట్లు కలగంటే శత్రువులతో తగాదాలు ఏర్పడే ప్రమాదం వుంది. అది సంఘర్షణలకు దారితీస్తుంది. పుల్ల రేగుపండ్లు తిన్నట్లు కలవస్తే చెవిపోటు కలుగవచ్చు. రేగుచెట్టు ఎక్కినట్లు కలగంటే మృత్యుభయంతో చింతపడతారు.

## ద్రాక్ష

ద్రాక్ష తోటలోకి షికారుకెళ్ళినట్లు కలగంటే ప్రేమ వ్యవహారాలలో పేచీలు వస్తాయి. ద్రాక్ష పళ్ళు తిన్నట్లు కలవస్తే డబ్బు దుబారా అవుతుంది. ద్రాక్ష రసం త్రాగినట్లు కలవస్తే అనారోగ్యం కలుగుతుంది. పుల్లని ద్రాక్ష ఆరగించినట్లు కలవస్తే అపవాదులు మీ నెత్తిన పడతాయి. తేనెద్రాక్ష తిన్నట్లు కలగంటే దంత సంబంధమైన వ్యాధి వస్తుంది. దంతాలు కదిలి రాలిపోవచ్చు. గింజల్లేని ద్రాక్ష తిన్నట్లు కలవస్తే ఆయువు తగ్గిపోతుంది. ఎండు ద్రాక్ష తింటున్నటు కలవస్తే మీకు ధనవ్యయం తప్పదు.

## నారింజపండు

ఆకుపచ్చ నారింజ పండు తిన్నట్లు కలగంటే త్వరలో కళ్యాణం జరుగుతుంది. నారింజ చెట్టు ఎక్కినట్లు కలవస్తే ఉద్యోగంలో మార్పు వస్తుంది. పసుపు పచ్చగా ఉన్న నారింజపండును తిన్నట్లు కలగంటే గృహకలహాలు ఎక్కువ అవుతాయి. మీ స్వప్నంలో గంప నిండుగా పండను చూస్తే మీ ఇంటికి బంధువులు వస్తారు.

నారింజ రసాన్ని తీసుకుని త్రాగినట్లు కలవస్తే మీరు కష్టాల నుంచి బయటపడతారు.

## బేరిపండు

ఈ పండును మీరు కలలో చూస్తే విలాసమయ జీవితం లభిస్తుంది. దీన్ని తిన్నట్లు కలవస్తే లేనిపోని నిందలు మీమీద పడతాయి. వాటిని తప్పించుకోవటం కష్టం కావచ్చు.

## మామిడిపండు

బంగినపల్లి మామిడిపండును కలలో చూస్తే స్త్రీ వ్యామోహం (పురుషులకు), పురుష వ్యామోహం (స్త్రీలకు) కలుగుతుంది. బాగా పండిన మామిడి పండును తిన్నట్లు కలవస్తే సుఖసంతోషాలు ప్రాప్తిస్తాయి. చిత్తూరు మామిడిపండును కలలో చూస్తే చక్కని ప్రశాంతత లభిస్తుంది. వాటిని తిన్నట్లు కలగంటే అనారోగ్యం కలుగుతుంది. నూజివీడు రసాలు తిన్నట్లు కలవస్తే అత్యంత ఆరోగ్యవంతులవుతారు. వీటిని ఎవరికన్నా పంపినట్లు కలగంటే ఎందుకో చెప్పకోలేని భయం కలుగుతుంది.

## దోసపండు

స్వప్నంలో దోసపండు కనిపిస్తే ఆనందం కలుగుతుంది. దోస పండును ముక్కలుగా కోసుకుని తిన్నట్లు కలగంటే పెద్దలతో పరిచయ భాగ్యం కలుగుతుంది. తద్వారా వినోద కాలక్షేపం జరుగుతుంది. దోస పండును పప్పులోవేసి కూర వండితే, లేక పచ్చడిచేస్తే, పేదరికం వచ్చే సూచనలు ఉన్నాయి.

## బత్తాయిపండు

గంపనిండుగా బత్తాయిపండ్లను కలలో చూస్తే మీ ఆప్తమిత్రునితో విరోధం కలుగుతుంది. బత్తాయిపండ్లను తిన్నట్లు కలగంటే అనా

–ోగ్యానికి హాని కలిగిస్తుంది. వీటిని రసం తీసుకుని త్రాగినట్లు కలవస్తే కుటుంబంలో చిక్కులు, చీకాకులు కలుగుతాయి.

### పు చ్చ కా య

పుచ్చకాయ కలలో కనిపిస్తే విజయం లభిస్తుంది. ముక్కలుగా కోసుకుని తిన్నట్లు కలవస్తే శుభవార్తలు అందుతాయి.

### తా టి పం డు

దీన్ని కలలో చూస్తే దోమల బాధ కలుగుతుంది. తాటిపండును చీకిచీకి తిన్నట్లు కలవస్తే నల్లుల బాధ ప్రాప్తిస్తుంది. చెట్టునుండి రాలి పడిన పండును కలలో చూస్తే వినోద కాలక్షేపం జరుగుతుంది. దీన్ని కాల్చినట్లు కలవస్తే రాబడి ఎక్కువై ధనవంతు లవుతారు.

### క మ లా పం డు

ఇవి గంపనిండా పేర్చినట్లు కలలో కనిపిస్తే ధనలాభం కలుగుతుంది. ఒక్క పండునే కలలో చూస్తే పేదరికం ప్రాప్తిస్తుంది. వీటి రసం పిండి త్రాగినట్లు కలగంటే వుద్యోగంలో మార్పు వస్తుంది. చెట్టు నిండుగా కమలాపండ్లను కలలోచూచిన అనుకోకుండా ఎక్కడ నుంచో డబ్బువచ్చి పడుతుంది.



# 27. బంధువులు

చాలమందికి తమ ఆప్తబంధువులు తరుచుగా కలలో కనిపిస్తూ వుంటారు. ఒక్కోసారి వాళ్ళు కనిపించడమేకాక పలురకాలుగా ప్రవర్తిస్తారు. ఊరకనే కనిపించవచ్చు. లేక చనిపోయినట్టుగా గాని, ఏదో మీకు యిచ్చినట్టు, పోట్లాడినట్టు, ఆశీర్వదించినట్టు, ఏదో యిమ్మని మిమ్మల్లను అడిగినట్టుగా గాని మీరు కల కనవచ్చు. వాటి ఫలితాలు ఎలా వుంటాయో చూడండి.

## అత్త

కలలో అత్త కనిపించిన ఆనందంగా ఆప్తులతో కాలం గడుపుతారు. ఆమె మీతో పోట్లాడితే మీకు కష్టాలనుండి విముక్తి కలుగుతుంది. మీరు కలలో అత్తగా మారినట్లయితే చెడు సంకల్పం కలుగుతుంది. అత్త చనిపోయినట్లు కనిపించినచో ధనలాభం నిండుగా వుంటుంది.

## మామ

కలలో మీరు మామను చూస్తే అనుకోకుండా మంచి కబురు మీకు అందుతుంది. అత్త మామలు జంటగా కనిపించిన విలాస జీవితం లభిస్తుంది. మీరు మామతో షికారు వెళ్ళినట్లు కలగంటే అనారోగ్యం ఏర్పడవచ్చు.

## అమ్మ

తల్లిని స్వప్నంలో గాంచిన శుభప్రాప్తి. చనిపోయిన తల్లి కలలో కనబడితే జాగ్రత్తగా వుండవలెనని హెచ్చరిక. బ్రతికివున్న మీ తల్లి కలలో చనిపోయినట్టుగా కనిపించిన మీకు దారిద్ర్యంనుండి విముక్తి

కలుగుతుంది. గోరుముద్దలు తినిపిస్తున్నట్లయితే ఉద్యోగంలో మార్పు వస్తుంది.

## నాన్న

చూస్తే ధనలాభం కలుగుతుంది. చనిపోయిన తండ్రి కనబడితే "చెడుమార్గంలో నడుస్తున్నావు, దానినుండి బయటపడు" అని హెచ్చరిక చేస్తున్నట్లుగా భావించాలి. బ్రతికివున్న మీ తండ్రి చనిపోయినట్లుగా మీరు కలగన్నచో త్వరలో స్థలమార్పు జరుగుతుంది. ఆయన మీకు డబ్బు యిచ్చినట్లయితే ఏదో ఒక విలువైన వస్తువును మీరు పోగొట్టుకుంటారు.

## అమ్మ - నాన్నలు

తల్లిదండ్రుల నిద్దరిని కలలో చూచిన ధైర్యం, ఆనందం లభిస్తాయి. చనిపోయినవారిని కలలో తిలకిస్తే శుభం కలుగుతుంది. బ్రతికివున్న మీ తల్లిదండ్రులను చనిపోయినట్లు మీరు కలలో గాంచిన త్వరలో అనారోగ్యం మిమ్మల్ని పీడిస్తుంది. వాళ్లు మీతో మాట్లాడితే సంతానప్రాప్తి, పోట్లాడితే ధనలాభం కలుగుతుంది.

## భర్త

(స్త్రీలకు మాత్రమే!) చూచిన ఆయువు వృద్ధి. మాట్లాడితే మంచి కబురు వింటారు. పోట్లాడితే ధనలాభం. కామకలాపం జరిపితే అనారోగ్యం. ముద్దు పెట్టుకుంటే తల పోటు. ప్రయాణం చేస్తే విరక్తి, అసహనం ఏర్పడతాయి.

## భార్య

(పురుషులకు మాత్రమే!) భార్య కలలో కనిపించిన లక్కీఛాన్స్ తగిలిందన్నమాట. ఉద్యోగంలో ప్రమోషన్ రావడం తథ్యం. మీతో

మాట్లాడితే విందు భోజనం, మీతో పోట్లాడితే వినోదకాలక్షేపం జరుగుతుంది. ముద్దుపెట్టుకుంటే అనారోగ్యం కలుగుతుంది. కౌగలించుకుంటే నీరస వ్యాధి తగులుతుంది. కామకేళిలో తేలియాడితే తీరని భయమేదో పట్టుకుంటుంది.

## అ న్న

స్వప్నంలో అన్న కనిపించిన గౌరవం లభిస్తుంది. మాట్లాడితే ఆరోగ్యాభివృద్ధి అవుతుంది. మీతో పోట్లాడితే మీకూ మీ మిత్రునికి పోట్లాట జరుగుతుంది. మీకు డబ్బు యిచ్చినట్లైతే విలువైన వస్తువేదో పోగొట్టుకుంటారు. నవ్వితే దిగులుపడతారు.

## త మ్ము డు

చూస్తే పెద్దలయెడల వినయవిధేయతలు పెరుగుతాయి. మాట్లాడితే ప్రేమలో పడతారు. పోట్లాడితే భయం. డబ్బు పుచ్చుకున్నట్లైతే ఏదో అమూల్యమైన వస్తువు దొరుకుతుంది. ఏడుస్తూ కనబడితే బరువు బాధ్యతలు పెరుగుతాయి.

## వ ది న

వదినను కలలో చూచిన శుభం కలుగుతుంది. నవ్వితే అనురాగం లభిస్తుంది. దీవిస్తే సుఖమయజీవితం లభిస్తుంది. మాట్లాడితే స్థలం మార్పు జరిగే సూచనలున్నాయి. అన్నతోబాటు వదిన కనబడిన ఆయుర్వృద్ధి కలుగుతుంది. మిమ్మల్ని (మొగవాళ్లు అయితే) ప్రేమించి మీ పొందుకోరితే మీకు అనారోగ్యం కలుగుతుంది. చెడుపని చేస్తే ఆకస్మికంగా వ్యాధికి గురి అవుతారు.

## మ ర ద లు

కలలో మరదలు కనబడితే సంతానప్రాప్తి కలుగుతుంది. న వ్వితే

అనారోగ్యం కలుగుతుంది. నమస్కరిస్తే ఆపద కలుగుతుంది. మీతో మాట్లాడితే మిమ్మల్ని అదృష్టం వరిస్తుంది. మీ (మొగవాళ్లు అయితే) పొందుకోరితే దురదృష్టం మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తుంది. చెడుపని చేస్తే ఆరోగ్యం వృద్ధిపొందుతుంది.

## బావమరిది

చూస్తే గౌరవము. మాట్లాడితే పదవీప్రాప్తి. ప్రేమించితే కష్టాలు. పెళ్లాడితే అనారోగ్యం.

## కవలపిల్లలు

స్వప్నంలో కవలపిల్లలు కనిపిస్తే అయినవారితో తగాదాలు వస్తాయి. కవలలను (ఆడవారైతే) కనినట్లు కలవస్తే మీకు అనారోగ్యం కలుగుతుంది.

## కుమారుడు

తల్లిదండ్రులకు తమ కుమారుడు కలలో ఏ పని చేస్తూ కనిపిస్తాడో సామాన్యంగా యిలలో కూడ అదే జరుగుతుంది. ఉదాహరణకు సారా త్రాగుతున్నట్లు కలగంటే త్వరలోనే కుమారుడు సారా త్రాగగలడు. తల్లి దీవెన సృష్టికే సవాలు వంటిది. కలలోగాని నిజ జీవితంలోగాని తల్లి ఆశీర్వచనానికి మంచిగాని చెడుగాని తిరుగు లేదు.

## కుమార్తె

కుమార్తె కలలో కనిపిస్తే దుబారా జరుగుతుంది. పెళ్ళి అయినట్లు కనిపిస్తే అనారోగ్యం కలుగుతుంది. కాపురానికి వెళ్ళినట్లు కలగంటే శుభం కలుగుతుంది. కూతురూ, అల్లుడూ, జంటగా అగుపించిన ఎవరికో డబ్బు అప్పు యిస్తారు.

తాత

కలలో తాతను చూచిన మిత్రుల సహాకారము బోలెడు లభిస్తుంది. నవ్వినట్లు కనబడితే శుభవార్తలు అందుతాయి.

అమ్మమ్మ

స్వప్నంలో అమ్మమ్మ కనబడితే అనారోగ్యం ఏర్పడుతుంది. నవ్వితే స్థలం మార్పు జరుగుతుంది. దీవించితే శుభం చేకూరుతుంది.

నాయనమ్మ

మీకు కలలో మీ నాయనమ్మ అగుపించితే అకారణంగా భయం కలుగుతుంది. నవ్వితే ధైర్యం పెంపొందుతుంది. ఆశీర్వదిస్తే మీ కార్య క్రమాలు సఫలమవుతాయి.

తోడిపెళ్ళికూతురు

మీకు కలలో తోడిపెళ్ళికూతురు కనిపించితే మీకు అతి త్వరలో పెండ్లి కావటం ఖాయం అన్నమాట. మీరే తోడిపెళ్ళి కూతురుగా అలంకరింపబడితే అనారోగ్యం ప్రాప్తిస్తుంది.

తోడిఅల్లుడు

మీ స్వప్నంలో తోడి అల్లుడు కనిపించితే మీకు మీ మిత్రుల నుంచి బోలెడు సహాకారం లభిస్తుంది.

తోడికోడలు

తోడికోడలు కలలో కనిపించినచో కుటుంబములో ఎన్నో చిక్కులు వస్తాయి. మీతో పోట్లాడితే ధైర్యం ఎక్కువవుతుంది. మీతో మాట్లాడితే మీ పనులలో అనుకూల పరిస్థితులు ఏర్పడుతాయి.

## దాది

దాది కలలో కనిపించితే అన్నీ లాభాలే. కలలో ఆమెను చూచినా మంచి సంపాదనమారం దొరుకుతుంది. మిమ్మల్ని లాలించినట్లు కనిపించితే మీకు ఉజ్జ్వల భవిష్యత్తు లభిస్తుంది. మీరు దాదిగా మారినట్లు (ఆడవారికి మాత్రమే) కలగంటే అతి త్వరలో మీకు పెళ్ళి జరుగవచ్చు.

## మేనత్త

స్వప్నంలో మేనత్త కనిపించితే ధనలాభం ఉంటుంది. మీతో మాట్లాడితే క్రొత్తవారితో పరిచయం ఏర్పడుతుంది. మిమ్మల్ని (మొగవారికి మాత్రమే) ప్రేమించినట్లు కలగంటే మీకు అనారోగ్యం కలుగుతుంది.

## మేనమామ

మేనమామను కలలో చూచిన యెడల మంచి శుభ వార్త వింటారు. ఆయనతో పోట్లాడితే ఆత్మీయులతో విరోధం కలుగుతుంది. ఆశీర్వదిస్తే భయము, తొందరపాటు కలుగుతాయి. మిమ్మల్ని (ఆడవారైతే) ప్రేమించినట్లు కనిపించిన మీకు అన్ని పనులు ధైర్యంగా చేయగల స్తోమత ఏర్పడుతుంది.

## పసిబిడ్డ

పసిబిడ్డ కలలో కనిపించిన వారికి – అనగా తల్లిదండ్రులకు ఒకే రకమైన ఫలితాలు కలుగుతాయి. కలలో పసిపాప కనిపించితే అకారణ భయం కలుగుతుంది. నిద్రపోతూ కనబడిదే అతి త్వరలో శుభ వార్తలు వింటారు. ఆడుతూ కనబడితే వినోద విలాసాలు లభిస్తాయి. ఏడుస్తూ కనబడితే మీకు కష్టాలు తప్పవు. అపరిశుభ్రంగా కనబడితే అపవాదులు మీ నెత్తి కెక్కుతాయి.

## మారుతల్లి — తండ్రి

ఇద్దరూ కలలో కనబడితే మీ బ్రతుకు నరక మవుతుంది. బానిసకన్న హీనంగా బ్రతుకుతారు. విడివిడిగా ఎవరు కనిపించినా ఎవరితోనైనా పేచీలు రావచ్చు.

## కోడలు

కోడలు కలలో కనబడితే పాడిపంటలు అభివృద్ధి అవుతాయి. నవ్వితే శుభసూచన. ప్రసవించితే మీ ఆస్తి మూడు పువ్వులూ ఆరు కాయలుగా అభివృద్ధి చెందుతుంది. పీడించి వేధించితే పీడ కలుగుతుంది.

## అల్లుడు

అల్లుడు కలలో కనబడితే అన్నివిధాల మంచి జరుగుతుంది. అసంపూర్ణంగా నిలిచియున్న పనులలో మీరు చొరవ తీసికొని పూర్తి చేస్తారు. అది ఎంతో లాభాన్ని కలుగచేస్తుంది. అల్లుడు కలలో నవ్వితే మీకు అన్ని రంగాలలో అభివృద్ధి కలుగుతుంది. పోట్లాడితే ప్రతి పనిలోనూ ప్రతికూలత ఏర్పడుతుంది.

## ఆడబిడ్డ

ఆడబిడ్డ కలలో కనబడితే చాల విలువైన వస్తువులు పోగొట్టుకుంటారు.

## మేనల్లుడు

స్వప్నంలో మేనల్లుడు కనబడితే చిక్కులు వస్తాయి. డబ్బు అడిగితే మీకు దరిద్రం చుట్టుకోవచ్చు. పోట్లాడితే మాత్రం మంచి జరుగుతుంది.

## మేనకోడలు

మేనకోడలు కలలో కనబడితే ఆరోగ్యం అభివృద్ధి. నవ్వితే నగలు కొంటారు.

## అక్క

తల్లి తరువాత తల్లి లాంటిది అక్క. ఆమె కలలో కనబడితే సంతోషం కలుగుతుంది. మీతో పోట్లాడితే త్వరలో మీరు అనారోగ్యంతో బాధపడతారు. చెంపమీద కొడితే మీకు కొండంత ధైర్యము లభిస్తుంది. ఆమె కలలో మీకు ఎదురుగా వస్తే ఎంతో ఆనందం కలుగుతుంది.

## చెల్లెలు

చెల్లెలు కలలో కనబడితే యితరులంటే మీకు తగని అసూయ కలుగుతుంది. పోట్లాడితే ఆనందం లభిస్తుంది.

## పినతల్లి

స్వప్నంలో పినతల్లి కనబడితే మీకు సంఘంలో ఎంతో గౌరవం లభిస్తుంది. మీకు అన్నం పెడితే లాటరీలలో ధనలాభం. దీవించితే మంచి శుభవార్తలు వింటారు.

## పినతండ్రి

కలలో పినతండ్రి కనబడితే కోర్టు వ్యవహారాల్లో జయం కలుగుతుంది. పోట్లాడితే అనారోగ్యంతో అవస్థపడతారు. డబ్బిస్తే తలపోటు వస్తుంది.

## పెత్తల్లి

పెత్తల్లి స్వప్నంలో కనిపించితే ఉద్యోగస్థులకు బదిలీ అవు

తుంది. మాట్లాడితే ధనలాభం కలుగుతుంది. పోట్లాడితే అందిన అవకాశాలు అన్నీ ఒక్కొక్కటిగా జారిపోతాయి.

### పెత్తండ్రి

మీకు కలలో పెత్తండ్రి కనిపించినట్లయితే విందు భోజనం లభిస్తుంది. డబ్బు యిస్తే కోర్టు వ్యవహారాలలో చిక్కుకుంటారు.

### మనుమడు

కలలో మనుమడు కనబడితే మీ ఆస్థి పంపకాలు అవుతాయి. నవ్వితే శుభవార్తలు వింటారు. పోట్లాడితే అనారోగ్యం కలుగుతుంది.

### మనుమరాలు

మనుమరాలు స్వప్నంలో కనిపించిన యెడల మీకు విజయం కలుగుతుంది. పోట్లాడితే మృత్యువు పొంచి చూస్తుందన్నమాట. అన్నం పెడితే ఆయుర్వృద్ధి.

సూచన : పై ఫలితాలను జాగ్రత్తగా గమనించి చూస్తే, ఫలానా బంధువు కనిపించడం వల్ల లాభమో లేక అంతా నష్టమో కలుగుతుందని చెప్పలేము, ఏ ఒకరిద్దరి విషయంలోనో తప్ప. అందువల్ల కలలో వాళ్ళు కనిపించి ఏ క్రియ చేశారో గుర్తుంచుకోవడం ముఖ్యం. అంతేకాదు వాళ్ళు బ్రతికివున్నవాళ్ళా లేక మరణించిన వాళ్ళా అన్న విషయం కూడ ఫలితాలు సరిచూసుకోవడానికి కావాలి. ఇందులో ఏది సరిగా లేకపోయినా ఫలితాలు తారుమారు అయ్యే ప్రమాదం ఉంది. కనుక జాగ్రత్తగా అన్నీ గుర్తుంచుకొనే యీ ఫలితాలను చూచుకోవాలి.

# 28. మతాలు - ఆచారాలు వగైరా

దేవుడు, దేవత, దెయ్యం – స్వర్గం, నరకం, పితృతర్పణం– మఠాలు, మసీదులు, దేవాలయాలు వగైరా మతానికి సంబంధించినవి. ఈ మతాన్ని ప్రచారం చేసేవారు, మతాచారాలు అన్నీ కలల్లోకి వచ్చేవే! మరి ఈ కలలకు ఫలితాలు ఎలా వుంటాయో చూడండి!

## దేవుడు

దేవుని విగ్రహాన్ని లేదా పటాన్ని (ఏ దేవుడైనా సరే) కలలో కాంచినవారికి సర్వ శుభాలు కలుగుతాయి. దేవుడే సజీవంగా ప్రత్యక్ష మైనట్లు కలవస్తే మీరు ప్రజోపయోగకరమైన పనులు చేస్తారు. శాంతి యుతంగా జీవిస్తారు. కలలో దేవుడు మీకేదన్నా వరాన్ని ప్రసాదిస్తే మీరు పరమభక్తులై పవిత్రజీవితం గడపుతారు.

## దేవత

మీకు కలలో ఏ దేవతావిగ్రహమైనా, పటమైనా, చిత్రమైనా కన్పిస్తే మీకు అన్నివిధాలా మంచే జరుగుతుంది. కీడులో కూడా మేలే జరుగుతూంది. మీకు దేవత ప్రత్యక్షమైనట్లు కలగంటే లాభకరమైన స్నేహితులు లభిస్తారు. మీరు దేవతల్లో ఒకరుగా నున్నట్లు కలగంటే శుభం జరుగుతుంది. దేవతతోపాటు మీరూ కలసిపోయి తిరుగుతున్నట్లు కలవస్తే సంతోషమూ, సంతృప్తి కలుగుతాయి.

## దెయ్యం

కలలో దెయ్యం కనబడితే అశుభం కలుగుతుంది. కోపంతో, ఉద్రేకంతో చేయకూడని పనులు చెయ్యొచ్చు. అసాధారణ క్రూరకార్యా లకు పూనుకొనవచ్చు. దెయ్యంతో మాట్లాడుతున్నట్లు కలగంటే దురా

శతో పొడుపనులు చేస్తారు. మీ చుట్టూ మోసగాంౖడ్రు, జులాయిమూక చేరుతారు. దెయ్యాన్ని చంపినట్లు కలగంటే శుభం జరుగుతుంది. అదృష్టం ఏర్పడుతుంది. దెయ్యాన్ని చావచితుక తన్నితే ఎన్నికల్లో మీ ప్రత్యర్థినికూడా చిత్తుగా ఓడిస్తారు.

గు రు వు

చదువు నేర్పిన ఉపాధ్యాయుడు కలలో కనబడితే అనేక సుఖాలు కలుగుతాయి. మత గురువు కలలో అలంకరించుకొన్నట్లు కన్పిస్తే మీ జీవితంలో ఏవో మార్పులు రాబోతున్నాయి. మీరే ఉపాధ్యాయుడుగా కలలో కనిపిస్తే బాధలు కలుగవచ్చు.

మ ఠ ం

వెలుతురులో వున్న మఠం కలలోకొస్తే శుభం జరుగుతుంది. చీకట్లో వున్న మఠం కలలోకొస్తే అపజయాలు ఎదురవుతాయి.

స న్యా సి

కలలో సన్యాసి కనబడితే అనుకోని విధంగా మీకు పుష్కలంగా సలహా,సహకారాలు లభిస్తాయి. మీరే సన్యాసం పుచ్చుకొన్నట్టు కలలో కనిపిస్తే భవిష్యత్తులో కష్టాలు ప్రాప్తించవచ్చు.

స న్యా సి ని

కలలో సన్యాసినిని చూస్తే కష్టనష్టాలు ప్రాప్తమవుతాయి. తేనె లొలికే మాటలతో ద్రోహం చేయగలవారు మీ చుట్టూ ఉన్నారని తెలుసుకొని జాగరూకులై మసలటం మంచిది.

మ హ ం తు

కలలో మహంతు కనబడితే మీకు అనారోగ్యం కలుగవచ్చు, లేక కష్టాలతో మనోవ్యథ కలుగవచ్చు. అతడు మీతో మాట్లాడినట్లు కలగంటే శుభదాయకం.

మహాత్ములు

వీరు కలలో కనిపిస్తే సుఖసంతోషాలు కలుగుతాయి. మీకు పుష్కలంగా శాంతి, మనస్సుకు ఆహ్లాదం లభిస్తాయి. వారితో కలసి మెలసి తిరుగుతున్నట్లు కలగంటే కష్టాలు కర్పూర హారతిలా కరగి పోగలవు. మహాత్ములు బాధపడుతున్నట్లు కలలో కనబడితే శుభ దాయకం. సాధువులు కనబడితే మంచి మిత్రులు మీకు లభిస్తారు. వారివల్ల మీకు జీవితాంతం మంచి జరుగుతుంది.

ఫకీరు

కలలో మీకు ఫకీరు కనబడితే బంధుమిత్రులలో ఎవరితోనైనా మనస్పర్థలు రావచ్చు.

అమాయకుడు

మీ కలలో అమాయకుడు కనిపిస్తే మీకు ఉజ్వల భవిష్యత్తు వుందన్నమాట. అతడు మీతో సంభాషణ సాగిస్తే మీరు మస్థతలంపులతో పాడవుతారు.

పురోహితుడు

మీరు కలలో పురోహితుని చూస్తే మీకు మతసంబంధ విషయాలలో ఆసక్తి వృద్ధి అవుతుంది.

మతప్రచారకుడు

మీరు కలలో మతప్రచారం చేశారంటే మీ పనుల్లో విఘ్నాలు కలుగుతాయి. వారి బోధనలతో మీరు మరో మతాన్ని స్వీకరిస్తే మీ వృత్తి వ్యాపారాలలో ఘనవిజయము కలుగవచ్చు. మీరు కలలో మతప్రచారం వినుట వలన మీ కష్టాలు కలకాలము ఉండక సుఖ

పడగలరు. మతప్రచారకుడు మీకు కలలో కనిపిస్తే మీ చుట్టు ఉన్న వారి నమ్మకాన్ని కోల్పోయి మీరు అపకీర్తి పాలవుతారు.

## వ్రతము

మీరు వ్రతంచేస్తున్నట్లో లేక మరొకరు చేస్తున్నట్లో కాని కలగంటే మీ ప్రవర్తన వక్రమార్గంలో ఉన్నట్లు తెలుసుకొని దానిని మార్చుకోవటం మంచిది.

## జపమాల

మీరు జపమాలతో జపం చేస్తున్నట్లు కలగంటే మీ కష్ట నష్టాలు త్వరలో సమసిపోయి సుఖశాంతులు కలుగుతాయి.

## యోగనిద్ర

ఎవరినన్నా యోగనిద్ర పుచ్చినట్లు మీరు కలగంటే త్వరలో అప్పులపాలవుతారని, తీర్చటం సులభం కాదని తెలుసుకోండి. మీరు ఎవరిచేతనైనా యోగనిద్రపాలయితే రహస్యంగా మీరు ఏదో దాస్తున్నట్లు, అందువలన అనేక కష్టాలు ఎదుర్కొనవలసి ఉన్నట్లుగా సూచన. కనుకట్టుతో ఎదుటి వ్యక్తిని నిద్రపుచ్చటం కూడా యోగ నిద్ర క్రింద జమకట్టవచ్చు.

## బలిపీఠం

దీనిని కలలో చూస్తే అవివాహితులకు వివాహము జరుగవచ్చు. వివాహితులకు ఎడబాటు కలుగవచ్చు. బలిపీఠాన్ని అలంకరించినట్లు కలగన్న మీకు అదృష్టదేవత సాక్షాత్కారం కావచ్చు. శుభములు ఎక్కువగా కలుగుతాయి. పీఠము ముందు ప్రార్థిస్తున్నట్లు కలలో కనిపిస్తే మీ కోరికలన్నీ తీరగలవు.

## శ్రాద్ధము

మీ స్వప్నంలో మీ అంత్యక్రియలను మీరు స్వయంగా చూస్తే మీరు పట్టినదంతా బంగారమవుతుంది. మరియొకరి శ్రాద్ధం మీరు చూడటం తటస్థిస్తే మీ బంధుమిత్రులలో ఎవరికో కీర్తి కలుగవచ్చు. ఒక గొప్ప నాయకుని అంత్యక్రియలు చూస్తే రాజకీయవాదులకు పార్టీ మార్పులు లేక పదవి మార్పులు జరుగవచ్చు.

## పురాణం

మీరు కలలో పురాణ గ్రంథాన్ని కొనటం జరిగితే మీ కుటుంబంలోని అస్తవ్యస్తత తొలగిపోయి సుఖం, శాంతి లభిస్తాయి. గ్రంథాన్ని కలలో చూస్తే మీకు పదవితో ప్రమోషను రాగలదు. పురాణాన్ని చదివినట్లు కలవస్తే మీ సలహాలను అనేకులు స్వీకరించవచ్చు.

## స్వర్గము

కలలో స్వర్గాన్ని మీరు చూడటం జరిగితే మీకు మహోజ్వల భవిష్యత్తు, అంచెలంచెలుగా మార్పులు కలుగుతాయి. మీరే స్వర్గములో ఉన్నట్లు కలగంటే త్వరలో మీరు గర్విష్ఠులై శ్రేయోభిలాషులకు దూరము కాగలరు. కాన మీ ప్రవర్తన మార్చుకొనుట మంచిది.

## నరకం

దీన్ని కలలో చూచినవారికి నిజజీవితంలో స్వర సుఖాల్లాంటివి లభిస్తాయి. ప్రస్తుత హీనస్థితి తొలగిపోతుంది. నరకంలో మీరే ఉన్నట్లు కలగంటే మీరు మీ విరోధులపై కక్ష తీర్చుకోగలుగుతారు. నరకాన్నుండి తిరిగి వస్తున్నట్లు కలవస్తే మీ ఈతి బాధలు తొలగి సక్రమ మార్గమున నడుస్తారు.

O 12

## శిలువ

ఇది కలలో కనబడితే మీకు శుభాలు కలుగుతాయి. శిలువను పూలతో అలంకరించినట్లు కలగంటే మీ కుటుంబము ఎల్లప్పుడూ మూడు పూవులు ఆరు కాయలుగా పెంపొందుతుంది. శిలువను పడ దోస్తున్నట్లు కలవస్తే మీ ఆశలు అడియాశలు కాగలవు. బంగారము లేక యితర లోహములతో తయారుచేసిన శిలువను మీరు కలలో చూస్తే మీ మార్గం పవిత్రమైనదని తెలుసుకొనండి. కలలో మీరు శిలువను ధరిస్తే విచారానికి గురికావచ్చు.

## చర్చి (క్రైస్తవ దేవాలయము)

ఈ దేవాలయాన్ని కలలో చూచిన మీ బంధువులలో ఎవరో ఒకరు మతప్రచారకుడు కాగలడు. మీరు చర్చిలో కూర్చునట్లు కలగంటే మీకు నూతన వస్త్రప్రాప్తి ఉంది. ఈ దేవాలయానికి సంబంధించిన ఏ వస్తువులు కలలో కనబడినా మీరు పవిత్ర హృదయంతో దైవభక్తి పొందగలుగుతారు.

## దేవాలయం

దేవాలయం లోనికి వెళ్ళినట్లు కలగంటే మీకు మనశ్శాంతి కలుగుతుంది. ప్రార్థన చేస్తున్నట్లు కలవస్తే మీకు ఉజ్జ్వల భవిష్యత్తు లభిస్తుంది. దూరంనుండి గుడిని చూడటం కలగంటే మరొకరి సహాయముతో మీకు లాభము కలుగుతుంది. దేవాలయము అగ్ని ప్రమాదానికి గురిఅయినట్లు కలగంటే మీకు మీ బంధుమిత్రులతో వివాదములు వచ్చి తీరని నష్టం కలుగవచ్చు. దేవాలయ గోపురము మీకు కలలో కనిపిస్తే మీరు మోసపు చర్చలలో పాల్గొంటున్నారని, దానివలన కీడు గలుగవచ్చని తెలుసుకోండి. గోపురం పడిపోయినట్లు కలగంటే మీ ఆశలు పూర్తిగా విఫలం కావచ్చు.

## గంధర్వలోకం

మీరు కలలో గంధర్వలోకాన్ని చూస్తే ఎనుకుమూకని లాభాలు కలుగుతాయి. భోగభాగ్యాలు ప్రాప్తమవుతాయి. అందులో వున్నట్టు కలగంటే ఫలితం ఇదే.

## వేదాలు

వీనిని చదివినట్టు కలగంటే మీకు పరోపకారం చేయటానికి అవకాశం రావచ్చు. దీనివలన ముందుకాలంలో మీకు లాభం రెట్టింపు కాగలదు.



# 29. రంగులు

కలలో ఎన్నో రంగులు మీకు కనపించవచ్చు. వాటిలో కొన్ని ముఖ్యమైన వాటి ఫలితాలను చూడండి.

## తెలుపు

తెలుపు స్వచ్ఛమైనది. ఆ విధంగానే అది కలలో కన్పించడము వల్ల అన్నీ శుభాలే కలుగుతాయి. కలలో తెలుపు రంగును చూస్తే ప్రశాంత జీవితం ఏర్పడుతుంది. కలలో తెల్లని దుస్తుల్ని ధరించితే సంఘంలో పరువు ప్రతిష్ఠలు పెరుగుతాయి. తెల్లని పూలు, పూల తోటలో మీకు కలలో కనబడితే మీకు ఉజ్వల భవిష్యత్తు వుందని అర్థం. అపనిందలు తొలగిపోతాయి. తెల్ల గులాబీ పూలను కలలో చూస్తే మీకు ఉన్నత పదవి లభ్యమవుతుంది.

## నలుపు

నలుపు తెలుపుకు వ్యతిరేకం. ఆలాగే వాటి ఫలితాలు అన్నీ చెడునే సూచిస్తాయి. ఈ రంగును కలలో చూస్తే దురదృష్టం మిమ్మల్ని వెంటాడబోతుందని అర్థం. కలలో మీరు నల్లని దుస్తులు ధరిస్తే మీకు అకారణ భయం కలుగుతుంది. నీరసంగా వుంటుంది. మీకు కలలో నల్లని పూలు, పూలతోటలో కన్పిస్తే, అది ఆపదలకు సూచన అవు తుంది. లేనిపోని నిందలు మీ నెత్తిమీద పడతాయి. నల్ల గులాబీలు మీ కలలో కన్పిస్తే, మీరు మీ ప్రేమకు తిలోదకాలు యివ్వాల్సి వస్తుంది.

## ఎరుపు

ఎరుపు రంగును కలలో చూస్తే వ్యాపారంలో నష్టం సంభ వించవచ్చును. ఎర్రని దుస్తులు ధరించినట్లు కలగంటే మీకు ఏదన్నా

ప్రమాదం జరుగవచ్చు. ఎర్ర గులాబీలు కలలో కన్పిస్తే మీరు ప్రేమలో పడతారు. ఎర్రని పూలు కలలో కనబడితే యితరులతో పరిచయాలు పెంచుకుంటారు. ఎర్రని మంటల్ని కలలో చూస్తే హఠాత్తుగా అదృష్టం మిమ్మల్ని వరిస్తుంది. ఎర్రని వస్తువులు కలలో కనబడితే మీ అభివృద్ధికి ఎన్నో అవకాశాలు వస్తాయన్న మాట.

ఆకుపచ్చ

ఈ రంగును కలలో చూస్తే శుభం కలుగుతుంది. కలలో ఆకుపచ్చ దుస్తులు ధరిస్తే అదృష్టం మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తుందన్న మాట. ఆకుపచ్చ తోటలో వున్న ప్రకృతిని మీరు కలలో చూస్తే అంతులేని ఆనందం మీకు అందుతుంది.

పసుపు పచ్చ

స్వప్నంలో పసుపు పచ్చ రంగు కన్పిస్తే సుఖసంతోషాలు మీ వశమవుతాయి. ఈ రంగు దుస్తుల్ని ధరించినట్లు కలగంటే అవమానాల పాలు అయ్యేందుకు ఆస్కారముంది. కలలో పసుపురంగు పూలు కనబడితే నలుగురిలో నగుబాట్లకు లోనవుతారు.

నీలం

కలలో నీలిరంగు కన్పిస్తే మనస్సులో వేదన కలుగుతుంది. నీలం దుస్తులు ధరించినట్లు కలగంటే అనారోగ్యం మిమ్మల్ని వదలదు. నీలం పూలు కలలో కన్పిస్తే కలత నిద్రలతో బాధపడతారు. కలలో నీలాకాశం కన్పిస్తే శుభం కలుగుతుంది. నీలం రాళ్లు కలలో కన్పిస్తే ప్రతిదానిలో చుక్కెదురు అవుతుంది. అన్నీ వ్యతిరేకంగా జరుగుతాయి.

## ఊదా రంగు

కలలో ఊదారంగును చూస్తే ప్రమాద సూచనగా భావించాలి. ఊదారంగు దుస్తుల్ని మీరు ధరించినట్లు కలలో కన్పిస్తే ఎవరో మిమ్మల్ని మోసం చేస్తారు. ఊదాపూలు మీ కలలో కనబడితే మీ మాటను మీరు నిలబెట్టుకోలేక పోతారు.

## రంగు పూయటం

కలలో మీరు ఏదైనా రంగును పూస్తున్నట్లు కనబడితే ఏవో రహస్యాలు మీనుండి బయటపడిపోతాయి. ఎవరైనా రంగు పూస్తున్నట్లు కలలో మీరు చూస్తే ఎవరో మీ దగ్గర ఏవో రహస్యాలు దాస్తున్నారన్న మాట.



# 30. లోహములు

## బంగారము

కలలో ఎటుచూచినా బంగారమే కనబడితే అజాగ్రత్తవల్ల మీరు విలువైన వస్తువుల్ని పోగొట్టుకుంటారు. బంగారం దొరికినట్లు కలవస్తే, మీరు కోరుకున్నది, కావాలనుకున్నది, మీకు దూరమవుతుంది. కలలో బహుమతిగా మీరు బంగారాన్ని అందుకుంటే లాభం పొందుతారు. మీ బంగారాన్ని పోగొట్టుకున్నట్లు కలవస్తే దుర్వార్తలు వినాల్సివస్తుంది. జాగ్రత్త వహించడము మంచిది.

## ప్లాటినం

దీన్ని కలలో చూస్తే చక్కని జీవిత భాగస్వామిని మీరు ఎన్ను కుంటారు. దీన్ని ధరించినట్లు కలవస్తే మిత్రులవద్దనుండి అనుకోని విధంగా సహాయం లభిస్తుంది. కలలో మీకు ప్లాటినం దొరికితే స్థిరాస్తి సంపాదించుకుంటారు. పోగొట్టుకుంటే అనవసరపు బాధ్యతలను పైన వేసుకుని హైరానా పడతారు.

## వెండి

వెండి కలలో కనిపించిన యెడల సంతోష వార్తలు వింటారు. వెండి నగలు ధరించినట్లు కలగంటే కొత్త వారితో పరిచయం ఏర్పడు తుంది. వెండివస్తువులు కొన్నట్లు కలవస్తే వ్యాధి నివారణ అవుతుంది. పోగొట్టుకుంటే అశుభం కలుగుతుంది.

## రాగి

కలలో రాగిని చూచినా, ధరించినా, మీరు కోరుకున్న విధంగా జీవితం సాఫీగా సాగుతుంది. రాగిపాత్రల్ని కొన్నట్లు కలగంటే మంచి పరిచయాలు ఏర్పడి సుఖజీవితం లభిస్తుంది.

## ఇ త్త డి

స్వప్నంలో ఇత్తడిని చూస్తే మీరు నమ్మినవారే మిమ్మల్ని మోసం చేస్తారు. అంతేకాదు, యితరుల మాటల్లోపడి సొమ్మును పోగొట్టుకుంటారు.

## కం చు

దీన్ని కలలో చూస్తే మీ వాక్చాతుర్యానికి ముగ్ధులై ఉన్నత పదవులలో వున్నవారు మీతో సహకరిస్తారు. కొద్దికాలంలోనే ఎంతో ఆస్తిపాస్తులు సంపాదించుకుంటారు.

## స్టెయిన్ లెస్ స్టీల్

ఇది కలలో రేకులుగా కనిపిస్తే వింతలూ వినోదాలూ చూస్తారు. పాత్రలుగా కన్పిస్తే మంచి కబుర్లు వింటారు. స్టెయిన్‌లెస్ స్టీలు సామాను కొన్నట్లు కలవస్తే భాగ్యవంతులతో వివాహం లేదా వియ్య మందడం జరుగుతుంది.

## ఇనుము

పోతపోసిన యినుము కలలో కన్పిస్తే తగాదాలు మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తాయి. ఎదురుచూడని పొరపాట్లు మీవలన జరుగు తాయి. కాలిన యినుము కలలో కన్పిసే కోపంతో, మీరెవరిపైనో కక్ష తీర్చుకుంటారు. ఇనుము కొన్నట్లు కలవస్తే స్నేహితునితోనో, ఇంట్లోవారితోనో ఎడబాటు కలుగుతుంది. నిండుగావున్న ఇనుప బీరువాను కలలో చూస్తే మంచి లాభం కలుగుతుంది. ఖాళీ ఇనుప పెట్టె కలలో కనబడితే నష్టపోతారు. కలలో ఇనుప గొట్టాల్ని చూస్తే అనవసరపు ఖర్చులు వస్తాయి. పెద ఇనుప గొట్టంలో దూరినట్లు కల వస్తే అనారోగ్యం కలుగుతుంది.

## అల్యూమినియం

స్వప్నంలో అల్యూమినియం (జర్మన్ సిల్వర్) పాత్రల్ని చూస్తే పెద్దవారితో పరిచయం కలిగి, వారివలన సహాయం జరుగుతుంది.

## పాదరసం

పాదరసాన్ని కలలో చూస్తే శుభం కలుగుతుంది. పాదరసాన్ని కొన్నట్లు మీకు కలవస్తే మీరు త్వరలో మంచివార్త వింటారు.



# 31. వృత్తులు, ఉద్యోగాలు - వగైరా

## డాక్టర్

వైద్యుడు కలలో కన్పిస్తే అనారోగ్యం ప్రాప్తించవచ్చు. మీరే వైద్యులుగా కలలో కన్పిస్తే మీ వృత్తి, వ్యాపారాలలో విపరీతంగా లాభాలు రావచ్చు. డాక్టరుతో సంప్రదించినట్లు కలగంటే ఎప్పుడో అనుకున్న పనులు ఇప్పుడు పూర్తి అవుతాయి. మీరు శస్త్రవైద్యునిగా మీ కలలో కన్పిస్తే జీవితంలో మార్పురావచ్చు. మీరు శస్త్ర వైద్యం చేయించుకొన్నట్లు కలలో కన్పిస్తే అనారోగ్యంగా వున్నవారు ఆరోగ్యవంతులౌతారు. దంతవైద్యుని వద్దకు వెళ్ళినట్లు కలగంటే, మీరు చెడు వార్తలు వినాల్సి వస్తుంది. పండ్లు పీకించుకొన్నట్లు కలగంటే మీరు ఎందులోనైనా నష్టపోవచ్చు.

## హాస్పిటల్

మీరు ఆస్పత్రికి వెళ్ళినట్లు కలలో కన్పిస్తే అది మీకు శుభ సూచన.

## ఆపరేషన్

మీకు శస్త్రచికిత్స జరిగినట్లు కలలో కన్పిస్తే మీ పనులు నిర్వహించుకోవటంలో శ్రమపడవలసి వస్తుంది. ఇంకెవరికైనా శస్త్ర చికిత్స చేసినట్లు కలలో చూస్తే మీ పనులు అతితేలిగ్గా చక్కబడతాయి. మీ జీవితం నల్లేరుమీద బండి నడకలా సాగిపోతుంది.

## మూలికలు

మూలికలను కొన్నట్లు కలలో కన్పిస్తే సంపూర్ణ ఆరోగ్యవంతులు కాగలరు. కలలో మీరు మూలికలను తింటే అంతులేని

ధనాన్ని సంపాదిస్తారు. మూలికలను నూరినట్లు కలలో కన్పిస్తే మీరు మందులను కొనవలసిన అవసరం ఏర్పడుతుంది. మూలికల కోసం వెతుకుతున్నట్లు కలలో కన్పిస్తే మీకుగాని మీ కుటుంబానికిగాని అనారోగ్య పరిస్థితులనుండి విముక్తి లభిస్తుంది.

## జ్యోతిషం

కలలో జ్యోతిష సంబంధమైన పుస్తకాలు చదివినట్లు కన్పిస్తే మీరు శ్రమతో వృద్ధిలోకి రాగలరని అర్థం. జ్యోతిషం తాలూకు గుర్తులను కలలో చూస్తే భవిష్యత్తులో క్రొత్తసంగతులను మీరు కనుక్కోగలరు. జాతకాన్ని మీరు కలలో చూచినా, చూపించుకున్నా మీకు అన్నివిధాల అదృష్టం కలిసివస్తుంది. హస్తసాముద్రికుడు కలలో కన్పిస్తే కుటుంబానికి ధననష్టం కలుగవచ్చు. కొన్ని రోజులపాటు చిక్కులు అనుభవించవలసి రావచ్చు.

## చిలుకశాస్త్రం చెప్పేవాడు

ఈ శాస్త్రం చెప్పేవాడు మీ అదృష్టాన్ని గురించి కలలో చెప్తే మీరు ప్రేమలో పడతారు. దానివలన సంతోషం కలుగుతుంది. ప్రేమికులుగా ఉన్నవారికి పెళ్ళయి జీవితం ఆనందమయం అవుతుంది.

## జాలరివాడు

జాలరిని కలలో చూస్తే ధన సంపాదన తక్కువగా వుంటుంది. అతనితో తిరిగినట్లు కలలో కన్పిస్తే మీ మిత్రులు సమయానికి తగిన సహాయం చేయరు. మీకు నీచులతో మైత్రి ఏర్పడుతుంది.

## కసాయివాడు

కలలో కసాయివాడు కన్పిస్తే మీరు కఠిన హృదయులై ఎదుటివారిని పీడించ ప్రయత్నిస్తారు. కసాయిపని చేస్తూ కలలో కన్పిస్తే...

మీకు పెద్దవారితో మైత్రి ఏర్పడుతుంది. మీ పనులు బలవంతంగా చేయించుకోవాల్సి వస్తుంది. ఇందులో మీకు నష్టం పాలు ఎక్కువ కనుక బెదిరింపులకు లొంగిపోవద్దు.

## వేటగాడు

ఎక్కువ లాభాలు, ధనం పొందాలన్న సంకల్పంతో కలలో వేటగాడిగా మారితే, త్వరలో మీకు అనారోగ్యం కలుగవచ్చు. వేటగాడ్ని కలలో చూస్తే ఇదే ఫలితం.

## కంసాలి

కంసాలినిగాని, అతని దుకాణాన్ని గాని కలలో చూస్తే ఎక్కువ శ్రమతో కొద్ది లాభాన్ని సంపాదించగలరు. కంసాలి అంగడిలో పని చేస్తున్నట్లు కలగంటే మీ వృత్తి, ఉద్యోగాలలో మార్పులు రావచ్చు. దుకాణానికి పోయి జారిపడినట్లు కలగంటే రాబడిలేని పనులకు పూనుకుంటారు.

## మంగలి

కలలో మంగలి కన్పిస్తే మీకు స్వల్ప శ్రమతో అధిక లాభాలు కలుగుతాయి. మంగలి షాపుకు వెళ్ళినట్లు కలవస్తే మీరు పుకార్లను యితరులకు చెప్పి బాధల్ని కోరితెచ్చుకుంటారు. మంగలి షాపును మాత్రం కలలో చూసినా పై ఫలితమే. అందువలన పుకార్లు చేరవేయకుండా ఉండటం మంచిది.

## తాపీపనివాడు

మీ స్వప్నంలో మీరు తాపీవానిగా కన్పిస్తే చిరకాలం మీకు ఆనందం లభిస్తుంది. కలలో మీరు తాపీవానిని చూస్తే, మీరు నేరుగా, ఓర్పుగా కొన్ని ఘనకార్యాలు సాధిస్తారు.

గారడీవాడు

మీ కలలో మీరు గారడీ చేస్తున్నట్లు కన్పిస్తే మీరు కల్ల బొల్లిమాటలతో నిజజీవితంలో గారడీచేస్తున్నట్లుగా భావించి దానిని ఎక్కువకాలం సాగనీయకుండ నిజాయితీని పెంచుకోవలసినదిగా తెలుసుకోండి. గారడీచేసేవాడ్ని మీరు కలలోచూస్తే మీ కష్టాలు మాయమై పరంపరగా సుఖాలు వస్తాయని గుర్తుంచుకోండి.

సర్కసువాడు

మీరు సర్కసువానిగా ఉన్నట్లు కలగంటే మీరు జాగ్రత్తగా ఉండవలసినదిగా గ్రహించాలి. లేకుంటే ఉద్రేకంతో ప్రమాదాలు కొని తెచ్చుకుంటారు. ఎవరో సర్కసు చేస్తున్నట్లు మీరు కలలోచూస్తే మీ మిత్రులద్వారా శుభవార్త వింటారు.

బఫూన్

ఇతడు కలలో కన్పిస్తే మంచి కలుగుతుంది. మీకు అతిత్వరలో ఆనందం లభిస్తుంది. మీరే హాస్యగానిగా కలలో కన్పిస్తే మీ పోకడలు బంధుమిత్రులకు అర్థంకాక మీరు కష్టాలపాలుకావచ్చు.

బిచ్చగాడు

కలలో మీరు బిచ్చగానివలె కన్పిస్తే జూదం మొదలైన దుర్వ్యసనాలలోను, లాటరీ, రేసు, వ్యాపారం వగైరాలలోను ఎదురుచూడని అదృష్టం కలుగవచ్చు. బిచ్చగానిని కలలోచూస్తే, మీకు ఎదురు చూడని ఆనందం కలుగుతుంది. బిచ్చగాడికి ఏదైనా యిచ్చినట్లు కలలో కన్పిస్తే క్లిష్టపరిస్థితులుకూడా మీకు అనుకూలంగామారి దిగ్విజయం లభిస్తుంది.

మంటలార్పేవాడు

మంటలార్పేవాణ్ణి మీరు కలలో చూస్తే విందుభోజనం లభిస్తుంది. గొప్పవారితో పరిచయం కలుగుతుంది. మీరు ఫైర్ ఇంజన్ ఉపయోగిస్తున్నట్లు కలగంటే ప్రస్తుతం పడుతున్న కష్టాల్నుండి మీకు విముక్తి లభిస్తుంది.

వంటవాడు

మాడరన్ వంటగదిలో మీరు ఉన్నట్లు కలగంటే ఏదన్నా శుభకార్యం జరిపి మిత్రులకు, బంధువులకు అతిధ్యం ఇస్తారు. మీరే వంట చేస్తున్నట్లు కలలో చూస్తే మీపైన అందరికీ ఆకర్షణ పెరుగుతుంది. అంతులేని అనురాగం ఏర్పడుతుంది. అపరిశుభ్రంగా వున్న వంట గదిలో వంట చేస్తున్న వ్యక్తి మీకు కలలో కనబడితే మీకు అనారోగ్యం ఏర్పడవచ్చు.

వహిల్వాన్

ఏ మల్లయుద్ధమో మీకు కలలో వస్తే మీ మిత్రులతో పేచీలు రావచ్చు. మీరు ఎవరితోనైనా కుస్తీ పట్టి గెలిచినట్లు కలవస్తే మీ సమస్యలు కొన్ని పరిష్కార మవుతాయి. కుస్తీ పోటీలో మీరు ఓడినట్లు కలవస్తే ఏదన్నా కొద్దిపాటి అశాభంగం కలుగవచ్చు.

నౌకరు

ఏ నౌకరైనా మీ కలలో కొస్తే క్రొత్త వ్యక్తులతో పరిచయం అవుతుంది. మీరే నౌకరీ సాగిస్తున్నట్లు కలగంటే ఒకరికి లొంగిపోయే ప్రమాదం ఏర్పడవచ్చు. జాగ్రత పడండి.

పోస్ట్‌మాన్

ఇతడు మీకు కలలో కన్పిస్తే శుభవార్త లందుతాయి. మీరే

పోస్ట్‌మాన్‌గా ఉత్తరాలు బట్వాడా చేస్తున్నట్టు కలగంటే పరోపకారం చేసి మంచి పేరు సంపాదిస్తారు.

వ్యభిచారం

మీరు వ్యభిచారం సాగిస్తున్నట్టు కలగంటే బంధు మిత్రులతో వివాదాలు ఏర్పడవచ్చు. వ్యభిచారం చేయాలన్న సంకల్పం కలిగినట్టు కలవస్తే ఆర్థికమైన ఇబ్బందులు అనారోగ్యం కలుగవచ్చు.

యజమాని

మీ యజమాని మీ కలలో కన్పిస్తే అదేమంత మంచిది కాదు. కలలో మీ యజమానితో మీరు పోట్లాడితే మీ వృత్తికి భంగం కలుగవచ్చు. మీ యజమాని మిమ్మల్ని సన్మానించినట్టు కలవచ్చినా మీకు మంచి జరుగక పోవచ్చు.

రాజు

కలలో రాజుగారు కన్పించటం శుభ సూచకం. లాభసాటి వ్యాపారం సాగిస్తారు. మీరే రాజుగా భోగాలు అనుభవిస్తున్నట్టు కలగంటే మీలో అహంకారం పెరిగి ఇబ్బందులు కలుగవచ్చు. ఏ రాకుమారునికో పట్టాభిషేకం జరుగుతున్నట్టు కలవస్తే మీ భవిష్యత్తు ఆనందమయం అవుతుంది. రాజ మకుటాన్ని మీరుధరించినట్టు కలగంటే పదుగురూ చెప్పుకునే ఘనకార్యాలు చేస్తారు. ఏ మహారాజు పహాన సంస్కార ఘట్టాన్నో కలగాంచితే ఏ నిధి నిక్షేపాలకో మీరు వారసు లవుతారు.

రాణి

మగవారి కలలో ఏ మహారాణో కన్పిస్తే విజయవంతమైన ప్రేమ కలాపం ఏర్పడుతుంది. స్త్రీ మహారాణిని చూచినట్టు కలగంటే

అతి త్వరలో ఏదైనా శుభకార్యం జరుగుతుంది. తామే మహారాణి యైనట్లు కలవస్తే సిరిసంపదలు సమృద్ధిగా లభిస్తాయి.

## రాకుమారుడు

కలలో రాకుమారుని చూస్తే అదృష్టదేవత వరిస్తుంది. రాకుమారునితో మాట్లాడినట్లు కలవస్తే భోగభాగ్యాలు ఏర్పడుతాయి. ప్రేమ కలాపం సాగించినట్లయితే బరువు బాధ్యతలు నెత్తిన పడతాయి. నవరత్నాలతో పొదిగిన కిరీటాన్ని మీరే మీ తలకు అలంకరించినట్లు కలవస్తే అత్యాశకు పోయి ఆపదలు కొనితెచ్చుకునే ప్రమాదం ఏర్పడ వచ్చు.

## రాకుమారి

రాకుమారిని స్వప్నంలో చూస్తే శుభం కలుగుతుంది. ఆమెతో ఆటలాడినట్లు కలవస్తే మంచి ఆరోగ్యం సిద్ధిస్తుంది. చెట్టాపట్టాలు వేసుకుని ఆమెతో విహరించినట్లు కలగంటే కోరుకున్న కోర్కెలు నెరవేరుతాయి. ఆమెను అక్కున చేర్చుకుని ముద్దాడినట్లు కలగంటే కొండమీది కోతినైనా నేర్పుగా క్రిందికి దింపగలిగిన శక్తి సామర్థ్యాలు మీకు ఏర్పడతాయి. ధగధగా మిలమిలా మెరిసిపోయే అందాల రాకుమారిని పెండ్లాడినట్లు కలగంటే పట్టిందంతా బంగారమయ్యే బంగారు క్షణాలు ఆరంభించాయని చెప్పుకోవచ్చు.

## సామంతరాజు

ఏ సామంతరాజో మహారాజు వద్దకు వచ్చి కప్పం చెల్లించి, కానుకలు సమర్పిస్తున్నట్లు కలగంటే మీరు అప్పుల బాధనుండి విముక్తులవుతారు. మీరే సామంతరాజై చక్రవర్తిని సత్కరిస్తున్నట్లు కలగంటే మీ యజమాని మెప్పుకోసం చేతకాని పనికి పూనుకుని అభాసుపాలయ్యే ప్రమాదం వుంది. చక్రవర్తికి వ్యతిరేకంగా శత్రురాజులతో,

చేరి ద్రోహం తలపెట్టిన సామంతరాజు మీ కలలోకొస్తే మీకు త్వరలో అనారోగ్యం ఏర్పడవచ్చు.

ఏ రు డు

ఎలాంటి ఆయుధాలు లేకుండా తన వీరత్వాన్ని ప్రదర్శిస్తున్న వీరుడు మీ కలలో కన్పిస్తే మీ వృత్తి వ్యాపారాల్లో ప్రగతి ఏర్పడుతుంది. మీరే వీరకృత్యాల్ని ప్రదర్శించినట్టు కలగంటే ధనార్జన పెరుగుతుంది. మిమ్మల్ని గురించి ప్రచారం జరుగుతుంది.

శూ రు డు

ఆయుధాలు ధరించిన శూరుడు మీ స్వప్నంలో సాక్షాత్కరిస్తే సంతానంలేని ఏ చుట్టమో మీకు ఆస్తిని వ్రాయటం జరుగుతుంది. మీరే శూరత్వాన్ని ప్రదర్శించినట్లు కలగంటే అకస్మాత్తుగా ఆస్తి వచ్చి పడుతుంది.

సి పా యి

సిపాయి కవాతు చేస్తున్నట్లు కలగంటే మీ పైవారికి మీపైన అసంతృప్తి కలుగవచ్చు. అతనితో మాట్లాడినట్లు కలగంటే అశాంతి కలుగుతుంది. స్త్రీలకు ఇలాంటి కలవస్తే పరువు తక్కువ వారితో ప్రేమ కలాపం ఏర్పడవచ్చు. యుద్ధం చేస్తున్న సిపాయి మీ కలలో కొస్తే అనుకోని వివాదాలు సంభవించవచ్చు.

సి పా యి బృ ం ద ం

మీరు సిపాయి బృందం (సైనికదళం) లో చేరినట్లు కలగంటే ధనలాభం చేకూరుతుంది. సైన్యాన్ని మీరు కలలో చూస్తే తెలియని భయాందోళనలు ఏర్పడుతాయి. ఏ యుదానికో సన్నద్ధం కావటం మీకు కలలోకొస్తే జీవితంలో కొత్తమలుపులు ఏర్పడుతాయి.

నావికాదళం

నావికాదళంలో చేరి సముద్రంలో ప్రయాణం చేస్తున్నట్లు కలగంటే శుభసూచకం. మగవారికి ఇలాంటి కలవస్తే గుణవతి, అందాలరాణి యైన స్త్రీతో ప్రేమకలాపం జరుగుతుంది. యువతులకు ఇలాంటి కలవస్తే చక్కని యువకునితో ప్రణయం ఏర్పడుతుంది.

వైమానికదళం

మీరు ఎయిర్ ఫోర్స్‌లో చేరి ఏ యుద్ధవిమానంలోనో మీ చాతుర్యాన్ని శత్రువులపై ప్రదర్శించినట్లు కలవస్తే ఎంత పెద్ద కోరికైనా తీరే అవకాశం వుంది. పురుషులకు ఈ కలవస్తే స్త్రీ సుఖం లభిస్తుంది. స్త్రీలకు పురుష సాంగత్యం ఏర్పడి సంతృప్తి కలుగుతుంది.



# 32. వాయిద్యాలు

### వీణ

దీనిని కలలో చూచినా, వినినా ఫలితం ఒకటే! మీరు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. మీరు వీణ వాయించినట్లు కలగనటం ఏమంత శుభసూచకం గాదు. ఎవరైనా వాయించినట్లు కలగంటే మంచిదే!

### సితారు

మీకు సితారు కలలో కనిపిస్తే ప్రేమ ఫలిస్తుంది. మీరు సితారు వాయిస్తున్నట్లు కలగంటే ప్రేమ విఫల మవుతుంది. ఎవరైనా వాయిస్తున్నట్లు కలగంటే తిరిగి ప్రేమను పొందగలుగుతారు.

### హార్మోనియం

ఇంతకు పూర్వం ప్రతి యింటా హార్మోనియం వుండేది. సాధారణంగా ఎక్కువ మందికి ఇది వాయించటం తెలిసివుండేది. వీధి గాయకులు ఇప్పటికీ దీన్ని ఉపయోగిస్తూనే వున్నారు. కలలో ఇది కన్పిస్తే జీవితంలో ఒక క్రొత్త మలుపు ఏర్పడుతుంది. మీరే వాయిస్తున్నట్లు కలగంటే మీది ఒంటరి బ్రతుకు అవుతుందని విచారిస్తుంటారు. ఎవరైనా వాయిస్తున్నట్లు కలగంటే ఏదైనా ఉత్సవానికి మిమ్మల్ని ప్రధాన అతిథిగా ఆహ్వానిస్తారు.

### సెహనాయ్

క్లారినెట్, సెహనాయ్, సన్నాయిలలో ఏది కలలో కన్పించినా ఫలితం ఒకటే! వీనిని మీరు వాయించినా, చూచినా మీరు చేయబోయే పనులలో అజాగ్రత, అశ్రద్ధ చూపటంవల్ల అలస్యం కావచ్చు. ఎవరైనా వాయిస్తున్నట్లు కలగాంచినచో అనారోగ్యం, పరధ్యానం ఏర్పడుతాయి.

ఫిడేలు

కలలో మీరు ఫిడేలు వాయిస్తే ముందు ముందు మంచి భోగాలు అనుభవిస్తారు. మరొకరు వాయిస్తున్నట్లు కలగంటే ఘనంగా సన్మానింప బడతారు. గొప్ప వ్యక్తిత్వాన్ని సాధిస్తారు. తీగెలు తెగిన ఫిడేలు కన్పిస్తే మీ స్వయం కృతాపరాధంతో సుఖశాంతులు దూరం చేసుకుంటారు. ఫిడేల్‌ను కొన్నట్లు కలగంటే మంచిరోజులు దగ్గరలో కొచ్చినట్లే. విరగ్గొట్టినట్లు కలగంటే తప్పటడుగులు చెడ్డపేరు తెచ్చుకుంటారు.

పియానో

ఇది మీ కలలో కనిపిస్తే మీరు పనికి మాలిన పనులు ప్రారంభిస్తారు. వాటివల్ల మీకు నష్టం వస్తుంది. కొన్నట్లు కలగంటే ఆడంబరం కోసం వృథా ఖర్చులు చేస్తారు. వాయించినట్లు కలగంటే మీ ఆకర్షణకు స్త్రీలు లొంగిపోతారు.

వేణువు

కలలో వేణువును చూచినా, వేణుగానం విన్నా ఒక రహస్యాన్ని మీ మనసులో దాచుకోలేక అవస్థపడతారు. మురళి వాయిస్తున్న గోపాల కృష్ణుడు మీ కలలోకొస్తే ప్రేమలో పడి జయప్రదులవుతారు.

ఇతర వాయిద్యాలు

మీకు తెలియని వాయిద్యాన్ని కలలో చూచినా, విన్నా మిత్రుల వలన అనేక లాభాలు కలుగుతాయి. దాన్ని మీరు వాయించినట్లు కలగంటే స్త్రీ సంబంధంగా సంపద లభిస్తుంది, సుఖమూ కలుగుతుంది. స్త్రీలైతే సంపన్నుడైన యువకునితో ప్రేమ, పెండ్లి, సాంగత్యం కలుగుతాయి. శృతి సరిగా లేని వాయిద్యాన్ని కలలో వింటే అపకీర్తి కలుగుతుంది. అశుభ వార్తలు వింటారు.

# 33. శరీరావయవాలు

మన శరీరము చాటున అస్థిపంజరం వుంది. శరీరములో ఎన్నో అవయవాలు వున్నాయి. అవి కలలో కనిపించిన కలిగే ఫలితాలు ఎలాంటివో చూడండి.

## అస్థిపంజరం

ఇది కలలో కనిపించిన నలుగురిలో మీకు అవమానం జరుగుతుంది. అర్థంగాని ఆవేదనను పొందుతారు.

## శరీరము

కలలో శరీరము బంగారు రంగులో మెరుస్తూ కనిపించిన అంతులేని ఆదాయం, ఆనందం కలుగుతాయి. సన్నగా, చిక్కిపోయినట్లు కనిపించిన అసంతృప్తి, దుఃఖం ఏర్పడుతాయి. పుండ్లతోనూ, గాయాలతోనూ కనిపించిన మీకు అష్టకష్టాలు పడే కర్మ పట్టవచ్చు. బట్టలు విప్పి కనబడితే, మీరు నవ్వులపాలు గావటం, అవమానం పొందటం జరుగవచ్చు. కలలో శరీరం నిండా రక్తం పూసుకున్నట్లు కనిపించిన ఆరోగ్యం, ఆదాయం రెండూ పెరుగుతాయి. శరీరానికి బురద పూసుకున్నట్లు కలగంటే అనారోగ్యం కలుగుతుంది. గంధం పూసుకున్నట్లు కనిపించిన మీకు ఉన్నతపదవి లభించవచ్చు. శరీరం మీద మచ్చవున్నట్లు కలగంటే మీ జీవితంలో సంతృప్తి నిచ్చే భాగస్వామి లభించవచ్చని సూచన.

## కనుబొమలు

ఇవి కలలో కనిపించిన అపఖ్యాతి కలుగుతుంది. వాలిపోయినట్లు కనిపించిన మీ పలుకుబడి విపరీతంగా పెరుగుతుంది.

## కనురెప్పలు

స్వప్నంలో కనురెప్పల్ని చూస్తే సున్నితమైన సమస్యలలో పడిపోయి పరిష్కార మార్గం దొరకక్క ఉక్కిరిబిక్కిరి అవుతారు. ప్రేమ కలాపాల్లో విసుగు, నిస్పృహ కలుగుతాయి.

## పెదవులు

ఎర్రని పెదవులు కలలో చూచిన మంచి స్నేహం లభిస్తుంది. ప్రేమించిన వారితో విహారయాత్రచేసే అవకాశం దొరుకుతుంది. పాలిపోయిన పెదవుల్ని చూస్తే స్నేహం సన్నగిల్లిపోతుంది. మీ ప్రేమ విఫలమయ్యే సూచనలు బలంగా కనిపిస్తున్నాయని అర్థం. మూసు కున్న పెదాలను చూస్తే అసూయ, అపార్థాలు కలుగుతాయి. లిఫ్‌స్టిక్ వేసుకున్న పెదవుల్ని చూస్తే జీవితంపై రోత, విరక్తికలుగుతుంది.

## బుగ్గలు

ఆరోగ్యంతో మిసమిసలాడుతూ, చిదిమితే పాలుగారే బుగ్గలు కలలో కనబడితే, మికు అత్యంత శుభం కలుగుతుంది. ఏ పనికి పూను కున్నా దాన్ని మీరు సంపూర్ణంగా సాధించటం జరుగుతుంది.

పీక్కుపోయిన బుగ్గలు కనిపించినచో కుటుంబంలో కలతలు, అనారోగ్యం ప్రాప్తిస్తుంది.

## మీసం

మగవారికి కలలో మీసం కనిపిస్తే అనుకున్న పనికాదు. స్త్రీ లకు కనిపిస్తే లైంగిక సుఖం తప్పక లభిస్తుంది. యువతికి మీసా లున్నట్లు యువకునికి కలలో కనిపిస్తే హానిసత్వం ఏర్పడి, అందరి అడుగులకు మడుగులు ఒత్తే మనస్తత్వం ఏర్పడుతుంది. తమకు మీసా లున్నట్లు, అమ్మాయిలకు కలవస్తే స్నేహితులవల్ల ప్రమాదం కలుగు

తుంది. మీసాలున్న మొగాడిని ముద్దుపెట్టుకున్నట్టు కలవస్తే యింట్లో పోట్లాటలు వస్తాయి; ప్రేమ విఫలమవుతుంది. ఆత్మహత్యా ప్రయత్నం జరుగవచ్చు. జాగ్రత్తగా మనస్సును అదుపులో పెట్టుకోవటం ఉత్తమము.

కళ్లు

స్వప్నంలో మీకు నీలి కనులు కనబడితే తలమునకలుగా ప్రేమలో పడిపోతారు. నల్లకళ్లు చూస్తే నష్టం కలుగుతుంది. మెల్ల కళ్లు చూస్తే ఎంత డబ్బు సంపాదించినా చాలనట్టు అనిపిస్తుంది. క్రీగంటి చూపులు కనిపించిన ప్రేమకలాపం శారీరక సుఖం లభిస్తాయి. గ్రుడ్డికళ్లు కనబడితే ప్రేమ విఫలం, కార్యహాని జరుగవచ్చు. ఒంటికన్ను కనిపించిన అవకతవకల జీవితం గడపవలసి వస్తుంది.

కాళ్లు

కాళ్లు కడుక్కున్నట్లు కలగంటే మీకున్న కష్టాలనుండి విముక్తి లభిస్తున్నట్లు భావించవచ్చు. వృత్తిలో మంచి మార్పుకు అది సూచన అవుతుంది. ఎన్నో కాళ్లు జంటలు జంటలుగా కలలో కనిపించిన ధన నష్టం కలుగుతుంది. అంతేగాక, విలువైన వస్తువులు పోగొట్టుకోవడం కూడ జరుగవచ్చు. వంకరటింకర కాళ్లు కలలో కనిపించిన మిమ్మల్ని చూచి మిత్రులు అసహ్యించుకుంటారు. కాళ్లు విరిగినట్లు కలగంటే ఎదురుచూడని ప్రమాదాలు సంభవిస్తాయి. కుంటికాళ్లు కనిపించిన దరిద్రాన్ని సూచిస్తుంది. అందమైన కాళ్ళు మీ కలలో కనబడితే అన్ని పనులలోను విజయం సమకూరుతుంది. ఏనుగు పాదం కలలో కనిపించిన రకరకాల నష్టాలు కలుగుతాయి.

గోళ్లు

కలలో గోళ్లు కనిపించిన ఆనందం, తృప్తికలుగుతాయి. దూర ప్రాంతాలనుండి శుభవార్త అందుతుంది. గోళ్ళు పెంచినటు కలగంటే,

మీ పైన కొందరికి అయిష్టం కలుగుతుంది. గోళ్ళకు పాలిష్ వూసుకుంటే మిమ్మల్ని మీ మిత్రులు తీవ్రంగా విమర్శిస్తారు. గోళ్ళు గిల్లుకుంటూ కలలో కనిపించిన మీ సొమ్ము దొంగలపాలవుతుంది. దగా, మోసం లాంటివి జరిగే సూచన లున్నాయి.

## త్రేళ్లు

కలలో త్రేళ్లు చూచిన మీ స్నేహితుని మీరు మరచిపోవటమో, లేక మిమ్మల్ని వారు మరచిపోవటమో జరుగుతుంది. ఎటుతిరిగినా నష్టం మీకే సంభవిస్తుంది. త్రేళ్లు తెగినట్లు కలగంటే మీ గురించి బాగా దుష్ప్రచారము బయలుదేరుతుంది. అశుభ్రముగా వున్న త్రేళ్లు కనబడితే లాభంలేని పనులలోకి దిగి బోలెడు నష్టపోతారు.

## ఎముక

స్వప్నములో ఎముకను చూచిన నిరుద్యోగ భారం పోయి, జీవనోపాధి లభిస్తుంది. ఎముకలోని మూలగ (గుజ్జు) చీకినట్లు కలగంటే దరిద్రం మిమ్మల్ని పట్టుకుంటుంది. కలలో కుక్కకు ఎముకలు వేస్తే మీకు చెడ్డపేరు సంక్రమిస్తుంది. ఎముకల గుట్ట కనబడితే చెడు వార్తలు వింటారు. ఏదైనా ప్రమాదంకూడ సంభవించవచ్చు. గొయ్యి త్రవ్వి అందులోనుండి ఎముకల్ని తీసినట్లు కలగంటే మీ అజాగ్రత్త వల్ల నష్టం కలుగుతుంది. మంత్రదండం లాంటి ఎముక గాలిలో ఆడినట్లు కలగంటే మంచి జీవితం, అనుకూలురైన భాగస్వామిని పొందుతారు.

## కాలేయము

ఇది కలలో కనబడితే ఆరోగ్యం పెంపొందుతుంది. దీన్ని వేయించుకుని తింటే శీఘ్రకాలంలో లాభం కలుగుతుంది.

కడుపు

మీకు కలలో కడుపు కనిపించిన అజీర్ణవ్యాధి కలుగుతుంది. నొప్పి వచ్చిన లాభం, దీర్ఘాయువును పొందుతారు. కడుపుతున్న స్త్రీ కనబడితే క్షేమ వార్తలు వింటారు. పెద్ద పొట్టవున్న మగవాడు కనబడితే అనారోగ్యంతో బాధపడతారు.

కండరాలు

స్వప్నంలో కండరాలు కనిపించిన ప్రాణ స్నేహితునితో మాట పట్టింపులు వచ్చి ఒకరి కొకరు దూరమౌతారు.

నోరు

కలలో నోరును చూచిన ఇతరులను కఠినంగా విమర్శించడం వల్ల కష్టాలు కలుగుతాయి. దుర్గంధ పూరితమైన నోటిని కలలో చూచిన అనుకోనివిధంగా ఆపదలు వస్తాయి. మంచి నోరు అయితే పలువురి ఆదరాభిమానములు పొందగలుగుతారు. చిన్నపిల్లల బుల్లి నోరు కనిపించిన సామాన్యవ్యక్తే ప్రాణమిత్రుడై అవసరానికి ఆదుకుంటాడు.

నాలుక

ఇతరుల నాలుకను కలలో చూచిన మిమ్మల్ని మీరే అవమానించుకొని, తక్కువ అంచనా వేసుకుని వంచన చేసుకుంటారు. తలపెట్టిన పనులు కావు. మీ నాలుకను మీరు కలగంటే సత్యవర్తనం అలవడుతుంది.

ముక్కు

పెద్ద ముక్కును స్వప్నంలో చూచిన అనవసరంగా పరుల కార్యాలలో జోక్యం కలుగజేసుకుని నష్టపోతారు. చిన్న ముక్కును

చూచిన పరాధికారాన్ని పైనవేసుకుని పరువు పోగొట్టుకుంటారు. ముక్కులోనుంచి రక్తం కారినట్లు కలగంటే ఆస్తి నష్టం జరుగుతుంది. ముక్కుకు గాయం తగిలితే శుభసూచన.

## ర క్తం

ఎర్రగావున్న రక్తం కలలో కనిపించిన ఆప్తమిత్రుని గురించి ఆందోళన పడవలసి వస్తుంది. అవయవాలనుండి రక్తం కారుతున్నట్లు కలగంటే శుభం జరుగుతుంది. రక్తపు మరకలు కలలో చూచిన మీ వృత్తిలో పోటీ ఏర్పడుతుంది. చేతులకు కాళ్లకు రక్తం పూసుకున్నట్లు కలలో కనిపించిన దూరదృష్టితో ఆలోచించి పనులు ముగించు కుంటారు.

## ము ఖ ము

కలలో ప్రేమించినవారి ముఖం చూచిన కామకలాపాల్లో పాల్గొంటారు. కందిపోయి ఎర్రబడి కనిపించిన, వివాహ ప్రయత్నాలు జరుగుతాయి. ఎవరి ముఖమో మీకు కలలో కనబడితే, అందరి బాధలు విని సలహాలు యిచ్చే సహనం ఏర్పడుతుంది. నవ్వు ముఖాన్ని కలలో చూస్తే విలాస జీవితం యేర్పడుతుంది. క్రొత్త సుఖాలు, మంచి మిత్రులు లభిస్తారు. అసహ్యమైన ముఖం కలలో కనబడితే ఆస్తి నష్టం కలుగుతుంది. నల్లని ముఖం చూచిన మీ ఆయుష్షు పెరుగు తుంది. మీ ముఖాన్ని మీరే కలలో చూచుకుంటే అనుకోని విధంగా నష్టం కలుగుతుంది. కలలో ముఖం కడుక్కుంటే మంచి భవిష్యత్తు ఏర్పడుతుంది. మీరు స్వప్నంలో పౌడరు పూసుకుంటే వినోద ప్రదర్శనకు హాజరవుతారు. మొటిమలతో వున్న ముఖాన్ని కలలోచూచిన పరుల కుతంత్రాలకు బలి అవుతారు.

### మోచేయి

మోచేతిని స్వప్నంలో చూచిన వారికి పెద్దలతో పరిచయం కలుగుతుంది. విరిగినట్లు కలగంటే సుఖవ్యాధులు రావచ్చు. నొప్పి కలిగితే అనారోగ్యం కలుగుతుంది. మోచేతిమీద పుండు వచ్చినట్లు కలగంటే ఆర్థిక యిబ్బందులు ఏర్పడుతాయి. వాచినట్లు కనిపించిన నిస్పృహాయతవల్ల ఆశాభంగం పొందుతారు. ఆపరేషన్ జరిగి మోచేతిని తీసివేసినట్లు కలగంటే అప్పుల్ని తీర్చివేస్తారు.

### మోకాలు

దీన్ని కలలో చూస్తే అనారోగ్యం కలుగుతుంది. విరిగినట్లు కన బడితే వ్యాపారంలో నష్టం వస్తుంది. తొలగించినట్లు కనబడితే శత్రువుల పీడనుంచి విముక్తి పొందుతారు.

### పుఱ్ఱె

కలలో పుఱ్ఱెను చూస్తే మీరు చేసిన ప్రయత్నాలు సఫలమవుతాయి. గోతిలో పడివున్న పుఱ్ఱెను కలలో చూస్తే వారసత్వం ద్వారా ఆస్తి సంక్రమించేందుకు ఆస్కారముంది. శ్రమపడి చక్కటి ఫలితం పొందుతారు. లేచి ఆడుతున్న పుఱ్ఱెను కలలో చూస్తే పట్టుదలతో అనుకున్న పనులు సాధిస్తారు.

### వెంట్రుకలు

తేనెరంగు జుట్టును కలలో చూస్తే వృథాశ్రమవల్ల ఆరోగ్యం పాడవుతుంది. క్రాపుగా చూస్తే విచార వార్తలు వింటారు. పరుల తల వెంట్రుకల్ని కలలో చూస్తే ఇతరుల డబ్బుతో కాలక్షేపంచేయాలన్న తలంపు కలుగుతుంది. తల అంటుకున్న జుట్టు కనిపిస్తే కలతలు బయలుదేరి జీవితం దుర్భరమవుతుంది. కలలో జుటు దువ్వుకుంటే

పగటికన్నా రాత్రుళ్ళు ఎక్కువగా తిరుగుతారు, ఒక్కోసారి పనుల వల్ల రాత్రిపూట జాగరణ చేయాల్సివస్తూవుంటుంది. వెంట్రుకలు రాలినట్లు కలగంటే ఎవరి అంత్యక్రియలకో హాజరవుతారు. నల్లని రింగు రింగుల జుటును చూస్తే రసిక జీవితం అలవాటవుతుంది.

## దంతాలు

అందమైన మీ పలువరుస కలలో కనబడితే బాగా డబ్బున్న వ్యక్తి తానుగా వచ్చి మీకు మిత్రుడవుతాడు. ఇతరుల దంతాలు కలలో కనబడితే ధననష్టంతో బాటు దీర్ఘవ్యాధి ఏదో ఒకటి మిమ్మల్ని పట్టుకుంటుంది. పళ్ళు పీకించుకున్నట్లు కలగంటే పరుల బాధలను మీ బాధలుగా స్వీకరిస్తారు. బంగారు దంతాలు కనబడితే హఠాత్తుగా మీ మనస్సు మారుతుంది. ఎర్రని దంతాలను చూచిన పలుకుబడి పెరిగి పరువు ప్రతిష్ఠ ఏర్పడుతుంది. తెల్లని దంతాలను చూచిన విచారం కలుగుతుంది.

## చీలమండ

ఇది వాచినట్లు కలలో కనబడితే ధననష్టం సంభవించుతుంది. స్త్రీల చీలమండను కలలో చూచిన అదృష్టం మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తుంది.

## చెవులు

కలలో చెవుల్ని చూచినవారిని అసమర్థులుగా జమగట్టే ప్రమాదం వుంది. ఇతరుల చెవుల్ని కలలో చూచితే కార్యసాధన ఏర్పడుతుంది. పెద్ద పెద్ద చెవుల్ని చూస్తే సుఖ సంతోషాలు కలుగుతాయి. చెవిలో గులిలి తీస్తున్నట్లు కలగంటే అనుమానించినదంతా ముమ్మాటికి నిజం అవుతుంది. చెవి మెలిపెట్టినట్లు కలగంటే చిత్రమైన బాధలు ఏర్పడుతాయి. మీ వాగ్దానాన్ని నిలుపుకోలేకపోతారు.

చెయ్యి

మీ చేతిని మీ కలలో చూస్తే కష్టకార్యాలను సాధించగలుగుతారు. చేతిని విరగ్గొట్టుకున్నట్టు కలగంటే అసంతృప్తి, నిరాశ కలుగుతాయి.

తొడలు

సున్నగా, అందంగా మెరిసే తొడల్ని కలలో చూచితే ప్రేమ కలాపంలో మునిగి తేలుతారు. బక్కచిక్కిన తొడల్ని చూచినట్టు కలగంటే విచారం, అనారోగ్యం ఏర్పడుతుంది. స్త్రీల తొడలను స్వప్నంలో పురుషుడు చూచితె ఉద్యోగంలో మార్పుగాని, ఇల్లు మారడంగాని జరుగుతుంది. పురుషుని తొడల్ని స్త్రీ జూచినట్లు కలగంటే అవివాహితులైతే ప్రేమలో పడతారు. వివాహితులైతే త్వరలో గర్భం ధరించి సత్సంతానాన్ని పొందుతారు.

మర్మావయవం

కలలో స్త్రీలు, పురుషుని మర్మావయవాన్ని జూచితే ప్రేమ కలాపాల్లో పడతారు. అనారోగ్యకరంగాను, అసహ్యంగాను వున్న మర్మావయవాన్ని జూచితే అనారోగ్యం ఏర్పడుతుంది. ఒకటికన్నా ఎక్కువ పురుష మర్మావయవాన్ని జూచిన స్త్రీలకు మొండి రోగాలు వస్తాయి.

స్త్రీ మర్మావయవాన్ని స్వప్నంలో పురుషుడు తిలకిస్తే ప్రేమ కలాపాలు ఎక్కువవుతాయి. అనారోగ్యంగానో, సుఖరోగాలతోనో వున్న స్త్రీ మర్మావయవాన్ని చూస్తే అతనికి సుస్తీ చేస్తుంది. అనేకంగా అవి కలలో కనిపించితే దీర్ఘవ్యాధులు వస్తాయి.

అ రి కా ళు

చక్కటి అరికాళ్లు మీకు స్వప్నంలో కనబడితే అశుభం కలుగుతుంది. జాగ్రత్తగా వుండాలి.

బొ మ్మ లు

పురుషుని బొమ్మను స్త్రీ కలగంటే, అవివాహితకు వివాహం అవుతుంది. వివాహితకు సంతానం కలుగుతుంది. స్త్రీల అందాల బొమ్మలు కనులపండువగా కలలో దర్శనమిస్తే పురుషుల సంపద అభివృద్ధి చెందుతుంది. జారిపోయిన స్త్రీ బొమ్మలను జూచినట్లు కలగంటే పురుషులకు దరిద్రం చుట్టుకుంటుంది. ఒంటి బొమ్మను కలలో జూచితే అనుకోని ఆపదలు వస్తాయి.

శ వ ం

కలలో శవాన్ని చూచితే ఎదురుచూడని విధంగా పనులు పూర్తి అవుతాయి, వివాహం లాంటి శుభకార్యాలు జరుగుతాయి, వివాహితులకు సంతానం కలుగుతుంది. కలలో మీరే శవమైనట్లు కనబడితే ఆనందం, సంతోషం, సమస్యల నుండి విముక్తి లభిస్తాయి. వాసనకొడుతున్న శవాన్ని చూచితే మీ ప్రయత్నాలు ఫలించి లాభం పొందగలుగుతారు. దాని తోలును కలలో మీరు తొలగించే ప్రయత్నం చేస్తే అపనిందల పాలవుతారు. దహనమైపోతున్న శవాన్ని కలలో చూస్తే వినోద విలాసాలలో పాల్గొంటారు. తత్సంబంధమైన ప్రయాణాలు చేస్తారు.

# 34. కలగూర గంప

## కాలెండరు

మీకు కలలో కాలెండరు కన్పిస్తే సంతోషవార్తలు వింటారు. శుభాలు జరుగుతాయి. బజారులో కాలెండరును కొన్నట్లు కలగంటే మీకు ఉజ్జ్వల భవిష్యత్తు వుంటుంది. దానిలోని కొన్ని తేదీలను మీరు చదివినట్లు కలగంటే మీకు చిక్కులు ఎదురవుతాయి. అయినా వాటిని మీరు సులువుగా సర్దుకోగలుగుతారు.

## స్పాంజి

స్వప్నంలో స్పాంజితో మీ శరీరాన్ని రుద్దుకొంటున్నట్లు కల గంటే మీకు స్టీమరు ఎక్కే యోగం వుంది. సముద్ర ప్రయాణం హాయిగా సాగుతుంది. కారునో, మరోదాన్నో స్పాంజితో తోమి కడుగు తున్నట్లు కలగంటే శ్రమ తప్ప ఫలితంలేని పనుల్లో మీరు మునుగు తారు. స్పాంజిలోని నీటిని పిండుతున్నట్లు కలగంటే మీరు నక్కతోక త్రొక్కినట్లే, అన్ని వైపులనుండి ఆదాయం లభిస్తుంది.

## కుట్టుమిషన్

ఇది కలలో కనబడితే మీరు మరీ పాత చింతకాయ పచ్చడి విధానాన్ని అవలంబిస్తుంటారని, మీవి బూజుపట్టిన భావాలని తెలుసు కోండి. మిషన్‌మీద మీరు కుట్టు చేస్తున్నట్లు కలగంటే ఏదో నూతన ప్రయత్నంలో మీకు దిగ్విజయం కలుగుతుంది.

## పెద్దబల్ల (లాంగ్ టేబిల్)

మీరు ఆఫీసులోని మీ టేబిల్‌ముందు కూర్చొనివున్నట్లు కల గంటే ఉద్యోగికి ప్రమోషను, ప్రేమికులకు పెండ్లి, వివాహితులకు

సంతానం లభిస్తాయి. భోజనంచేసే బల్లముందు కూర్చునివున్నట్లు కలగంటే వచ్చేదంతా మీకు శుభకాలమే.

### కుట్టుమిషను

దర్జీ అంగడిలోని కుట్టుమిషనును కాని, మీ యింటిలో వున్న దానినిగాని కలలోచూస్తే మీ ప్రయత్నాలు చురుగ్గా సాగి, విజయాన్ని చేకూరుస్తాయి. గబగబా కుడుతున్నట్లు కలగంటే మీకు శ్రమతప్ప మరేమీ మిగలని పనులు తగులుతాయి; ఫలితం చెప్పుకోతగ్గట్లు ఉండదు; ఎక్కువ శ్రమ చేయాల్సి వస్తుంది. వాటిని మీరు తప్పించుకోలేకపోతారు.

### టై

స్వప్నంలో మీరు క్రొత్తగా కొన్న టైని ధరించినట్లు కలగంటే మీరు పై పటాటోపాన్ని చూపి మీ హృదయంకోసం తపించేవారిని తప్పించుకొని తిరుగుతారు. పాత టైని ధరించినట్లు కలగంటే ఏదో చేయాలని వున్నా బాధ్యతల్ని మర్చిపోవటంవల్ల మీకు నష్టం కల్గుతుంది. టైని ఎవరన్నా మీకు బహూకరిస్తే మంచి స్నేహితులు దొరుకుతారు.

### మేజోళ్లు

కలలో క్రొత్త మేజోళ్లు చూచినవారు ఏదో సభలోనో, పిక్నిక్ లోనో, ఉత్సవంలోనో పాల్గొంటారు. వీటిని వేసుకున్నా, ధరించినా ఇదే ఫలితం. వాటిని తీసివేసినట్లు కలగంటే అలాటి అవకాశం పోయి నిరాశకు లోనవుతారు. చిరిగిపోయిన పాత మేజోళ్ళను కలలోచూస్తే మీ ప్రయత్నాలు పూర్తిగా ఫలించవు. వాటిని విప్పిపారేసినట్లు కలవస్తే శ్రమతో కూడిన పనులనుండి తప్పించుకొని సుఖాన్ని పొందుతారు.

చినిగిన పాతమేజోళ్ళను కుట్టి సరిచేసినట్లు కలగంటే మీరు చేసే పనిలో మీ శ్రమకు తగ్గ ఫలితం లభిస్తుంది.

## గ్లోవ్స్

గ్లోవ్స్‌ను ధరించినట్లు కలవస్తే అంతులేని గౌరవం లభిస్తుంది. వాటిని చింపినట్లు కలగంటే మిమ్మల్ని అందరూ చిన్నచూపు చూస్తారు. గొడవలు ప్రారంభమవుతాయి. గ్లోవ్స్‌ను బహుమతిగా పొందినట్లు కలలో చూస్తే పరులు మీనుండి ఎక్కువ లాభం పొందుతారు.

## డబ్బు సంచి (క్యాష్ బాగ్)

కలలో ఇది దొరికినట్లు కన్పిస్తే మీరు మీ మిత్రుల రహస్యాలు తెల్సుకొంటారు దాన్ని పోగొట్టుకున్నట్లు స్వప్నంలో కన్పిస్తే మీ రహస్యాల్లో ఏదో ఒకటి ఇతరులకు తెలుస్తుంది. అది దొరికినట్లు కలగంటే శ్రమపడకుండా డబ్బు రావాలని మీ ఆశ. అది ఫలించదు.

## పేడ

దీనిని కలలో చూచినవారికి అదృష్టం కలసివస్తుంది. దీనిని కుప్పగా వేసినట్లు కలగంటే కష్టపడి మీరు గొప్ప అంతస్థుకు చేరుకొంటారు. కాలుజారి పేడలో పడ్డట్లు కలగంటే మీకు మహర్దశ పడుతుంది.

## పింగాణీ పాత్రలు

ఇవి ప్రమాదవశాత్తు పగిలినట్లు కలవస్తే మీకు దురదృష్టం చుట్టుకోవచ్చు. ఎత్తి విసిరికొట్టినట్లు కలగంటే ఎంతో అదృష్టం. కలలో పింగాణీ పాత్రలను చూచిన, వారి కుటుంబం సుఖసంతోషాలలో ఓలలాడుతుంది. వాటిని వపయోగించినట్లు కలగన్నా ఇదే ఫలితం. పగిలిపోయిన ముక్కల్ని కలలో చూస్తే ఎంతో అదృష్టం అని చెప్పాలి.

## పీపా

నిండుగా వున్న పీపాను కలలోచూస్తే అతిగా లాభాలు పొందుతారు. అది ఖాళీగా వున్నట్లు కలగంటే డబ్బును పోగొట్టుకొంటారు. విచారకరమైన వార్తలు వింటారు.

## పరుపు

హాయిగా పరుపుమీద పవళించినట్లు కలవస్తే, ఏదో వెధవపని చేసి మీ పరువు ప్రతిష్టల్ని పోగొట్టుకుంటారు. జాగ్రత్తగా వుండటం మంచిది.

## ఫోటో

చిన్న ఫోటో కలలో కన్పిస్తే మీకు మంచివారితో స్నేహం లభిస్తుంది. పెద్ద ఫోటో కలలో కాంచినవారు తమ తప్పులు తామే సరిచేసుకోవటం మంచిది, లేకపోతే అవి గొంతుమీదకు వచ్చే సూచన లున్నాయి. మరొకరి పెద్ద ఫోటో మీ కలలో కన్పిస్తే వారు మీకు పరిచయస్తులైతే వారితో స్నేహ బాంధవ్యాలు బాగా వుంటాయి. అది తెలియని వారిదైతే ప్రఖ్యాతివహించిన గొప్పవారితో స్నేహం కలుగుతుంది. మిమ్మల్ని కలలో ఎవరైనా కెమేరాతో ఫోటో తీసినట్లు కన్పిస్తే వారికీ, మీకూ మధ్యవున్న సంబంధ బాంధవ్యాలు చెడిపోతాయి. మీరు మరొకరిఫోటోను కెమేరాతో తీసినట్లు కలలో కన్పిస్తే మీరు చిరంజీవులుగా జీవిస్తారు.

## తెర (కర్టెన్)

కలలో తెరను చూస్తే ఎవో రహస్యాలను మీరు దాస్తున్నారని అర్థం. అది తెల్లగా ఉంటే మీకు ఏమాత్రం ముఖపరిచయంలేని మనిషితో స్నేహం కల్గుతుంది. కిటికీలకువున్న తెరలు నల్లగానో, మాసిపోయి

నట్లుగానో కలలో కన్పిస్తే మీ కుటుంబంలో సుఖశాంతులు ఉండక పోవచ్చు. వెదురు బద్దలతో తయారుచేసిన తడికను కలలో చూస్తే, ఆలోచించకుండా చేసేపనులవలన చెడు ఎదురవుతుంది. అందువల్ల మీకు విచారం కలుగుతుంది.

### విజిటింగ్ కార్డు

మీ విజిటింగ్ కార్డును మీరే కలలోచూస్తే మీ ఆశలు అడియాస లవుతాయి. మరొకరి కార్డు మీకు కలలో కన్పిస్తే మిమ్మల్ని అభిమానించేవారు ఎక్కువ అవుతారు. మీరంత వారనీ, ఇంతవారనీ పొగడి తద్వారా మీకు మేలు చేకూరుస్తారు.

### చిట్టా పుస్తకం (లెడ్జర్ బుక్)

కలలో చిట్టాపుస్తకంలో జమాఖర్చులు వ్రాసినట్టు కన్పిస్తే మీకు అదృష్టకాలం వచ్చే సూచన ఉంది. పుస్తకం మాత్రం కలలోకి వస్తే ఆప్తులనుండి మంచి కబురు వస్తుంది.

### మరుగుదొడ్డి

స్వప్నంలో ఎవరన్నా మరుగుదొడ్డి కెళ్ళినట్లు కన్పిస్తే వృత్తిలోగాని, వ్యాపారంలోగాని పేచీలు వస్తాయి. మీరే వెళ్ళినట్లు కలగంటే అనారోగ్యం, వృధాఖర్చులు కలుగుతాయి.

### బూడిద

దీన్ని కలలో చూస్తే మీకు ఎక్కడన్నా అవమానం జరుగవచ్చు. దానితో మీ ఆశలు అడియాస లవుతాయి. ఎటుచూసినా బూడిదే కలలో కన్పిస్తే మీ ఆప్తులలో ఎవరో ప్రమాదానికి లోను కావచ్చు. బూడిదను కుప్పగా చేసినట్లు కలగంటే మీకు మంచి లాభాలు వస్తాయి.

మ సి

దీన్ని కలలో చూస్తే వారు కోరుకొన్న ఉద్యోగమో, వ్యాపారమో లభిస్తుంది. ఇది మీ దుస్తులకు అంటినట్టు కలగంటే మీరు చేసేది. మీకు నచ్చిన ఉద్యోగమో, వ్యాపారమో అయినా అందులో వూహించ నలవికాని లాభాలు పొందుతారు.

సి ని మా

సినిమా చూసినట్లు కలగంటే మీ మనస్సు వికావికలయ్యే సంఘటనలు కలుగుతాయి. సినిమాలో మీరు నటించినట్లు కలగంటే ప్రసిద్ధులైన వారిని కలుసుకొనే అవకాశాలు కలుగవచ్చు. వారితో స్నేహం కలకాలం నిలుస్తుంది. సినిమా ధియేటరులో కూర్చునివున్నట్లు కలగంటే మీరు ఏదో ఒక విషయంలో గట్టి నిర్ణయానికి రాలేకపోతుంటారు. ధియేటరు ముందు సినిమా టిక్కెట్లకోసం క్యూలో నిల్చొని వున్నట్టు కలగంటే మీరు ఏదో విషయంలో తప్పుడు మార్గాన నడుస్తారు.

అ ం గ డి

ఏదైనా అంగడిలోనికి పోతున్నట్లు కలగంటే, మీకు, మీరు చేయబోయే పనులలో లాభాలు కల్గుతాయి. అంగడినుండి బయటికి వచ్చినట్లు కలగంటే ధననష్టం జరుగుతుంది. అంగడి ముందునుండి వెళ్ళినట్లు కలగంటే చేతికి అందిన అవకాశం వృధాకావచ్చు. అంగడి మీదే అయినట్లు కలగంటే మీ ఆదాయం రెట్టింపవుతుంది.

త క్కె డ (త్రాసు)

ఏవ్యాపారైనా తూకంలో మోసం చేసినట్లు కలగంటే మీ నిర్ణయాలు సరైనవి కావని గుర్తు. త్రాసును కలలోచూస్తే అతిముఖ్యమైన పనులలో మీ నిర్ణయాలు చక్కగా వుంటాయి.

### పొట్లం

ఏదైనా పొట్లాన్ని తీసుకెళ్లుతున్నట్లు కలగంటే మీ యింటి పనులన్నీ మీ మీదే పడతాయి. మీరు ఏ కలవారి యింటికో ఆప్తులవుతారు. పొట్లం కట్టినట్లు కలగంటే మీ కష్టానికి తగ్గ ఫలితం లభిస్తుంది.

### బజారు

రంగురంగుల వస్తువులతో నిండిన షాపులతో కళకళలాడుతున్న బజారు కలలో కన్పిస్తే మీకు అంతులేని లాభాలు కల్గుతాయి. సిరిసంపదలు పెరుగుతాయి.

### అమ్మకం బిల్లు

అమ్మకం బిల్లును మీకు ఎవరన్నా యిచ్చినట్లు కలగంటే మీ మాటలు జోరుగానే వుంటాయి, కాని వాటిని నిల్పుకోలేరు. మీరు యితరులకు బిల్లు యిచ్చినట్లు కలగంటే అనవసరమైన విషయాలలో జోక్యం చేసుకొని నష్టపోతారు.

### బరువు చూసుకోవటం

కలలో మీరు మీ బరువెంతో చూసుకున్నట్లు కలవస్తే మీరు చేసే పనులు అపార్థం చేసుకొని, యిరుగుపొరుగువారు మిమ్మల్ని నిందిస్తారు.

### పార్శిల్

దీనిని తీసుకెళ్లుతున్నట్లు కలగంటే మీ పనులు తృప్తిగా ముగుస్తాయి. ఓపిగ్గా ఆ పనులుచేస్తే విజయం లభిస్తుంది. మీకు పార్శిల్ వచ్చినట్లు కలలో కన్పిస్తే మీ వృత్తి వ్యాపారాలలో జయం కల్గుతుంది.

### ఢంకా

దీన్ని కలలోచూస్తే మీకు శుభవార్తలు అందుతాయి. దీని శబ్దం విన్నా ఫలితం ఇదే దీన్ని మీరు మోగించినట్లు కలగంటే మిమ్మల్ను ఎవరూ అభిమానించరు.

### హోటల్

కలలో హోటల్ కన్పిస్తే మీరు మీ ప్రేమ రహస్యాన్ని భయంతో దాస్తున్నట్లు గుర్తు. అక్కడ కూర్చొని ఉన్నట్లు కలవస్తే పెద్దవారితో పరిచయంకోసం శ్రమపడుతున్నారన్నమాట. లోపల కూర్చొని చిరుతిండి తిన్నట్లు కలగంటే మీ యజమానితో గొడవ వస్తుంది. హోటలు బయట నిల్చున్నట్లు, అక్కడనే నిలబడి తిన్నట్లు కలగంటే మీ ఆరోగ్యం పెంపొందుతుంది. దానిలో గది తీసుకొన్నట్లు కలగంటే మీకు ముందుకాలం అంతగా బావుండదు.

### మధువు

దీనిని త్రాగుతున్నట్లు కలగంటే మీరు అప్పులు ఎక్కువగా చేస్తారు. వివాహ సందర్భంలో పెండ్లి కుమార్తెతోనో, పెండ్లి కుమారునితోనో మధువు త్రాగినట్లు కలవస్తే మీకు అదృష్టకాలం వస్తుంది.

### బీరు (పానీయం)

దీన్ని గ్లాసులో పోస్తున్నట్లు కలగంటే మీ ఆరోగ్యం, లాభాలు పెరుగుతాయి. బీరు త్రాగినట్లు కలవచ్చినా ఇదే ఫలితం. అది పోస్తుండగా దొర్లిపోయినట్లు కలగంటే మీకు త్వరలో వివాహం జరుగవచ్చు. పగిలిన గాజు గ్లాసులో బీరు త్రాగినట్లు కలవస్తే మీ ప్రేమ ఫలించదు.

### హుక్కా

కలలో హుక్కా కన్పిస్తే మీ బాల్యమిత్రులు మీ దగ్గరకు

రాగలరు. దీన్ని కాల్చినట్లు కలగంటే గృహజీవితం సంతోషవద మవుతుంది.

## తేనె

మీ కలలో తేనె త్రాగినట్లు కనిపిస్తే త్వరలో మీకు ఆనారోగ్యం కలుగవచ్చు. తేనె పట్టులోని తేనెను తీసినట్లు కలగంటే మీరు శ్రమ పడి సంపాదిస్తారు. సంతృప్తికరముగా జీవిస్తారు.

## విషం

మీరు విషం త్రాగినట్లు కలగంటే మీరు చెప్పేది మంచిదయినా యితరులు దాన్ని గ్రహించలేక, హేళన చేస్తారు. ఎవరికన్నా విషం పెట్టినట్లు కలగంటే మీ యింట్లో ఏదో అశుభం జరుగుతుంది.

## వేలిముద్ర (నిశాని)

స్వప్నంలో మీరు వేలిముద్ర వేసినట్లు కన్పిస్తే మీకు బంధు మిత్రుల సహాయం సదా లభిస్తుంది. ఎవరి నిశానియైనా కలతో కన్పిస్తే ఋణవిముక్తి కలుగుతుంది.

## సమూహం

గుంపులు గుంపులుగా జనం విందులు వినోదాలలో పాల్గొన టానికి వెళుతున్నట్లు కన్పిస్తే మీకు లాభాలు కల్గుతాయి. వాటిలో వారు పోట్లాడుకుంటున్నట్లు కలవస్తే మీకు నష్టాలు వస్తాయి.

## పండుగ

పండుగ చేసుకోవడం కలలో కన్పిస్తే మీకు లాభకరంగా మార్పులు జరుగుతాయి. వేడుకల్లో పాల్గొంటున్నట్లు కలవస్తే మీ మిత్రులకు మంచి రోజులు వస్తాయి. అదే సంగీత మిళితమైన వేడు

కయితే మీకు క్రొత్త అలవాట్లు అలవడుతాయి. పిక్‌నిక్‌కు వెళ్ళినట్లు కలవస్తే మీ బంధుమిత్రులతో సరదాగా గడుపుతారు.

## పతాకం

మీరు జెండా తీసుకొనిపోతున్నట్లు కలగంటే మంచి హోదా సంపాదిస్తారు. ఎగిరే పతాకాన్ని కలలో చూస్తే మీకు బాధలు ఏర్పడుతాయి. ఆ జెండా నల్లగా వుంటే ఎవరితోనో శత్రుత్వం వస్తుంది. దాన్ని స్తంభంపైన ఎగరవేసినట్లు కలగంటే మీరు స్థిర చరాస్థులు పెంచుకో గల్గుతారు. ఏ స్వతంత్రదినంనాడో పతాకానికి వందనం చేస్తున్నట్లు కలగంటే మీకు బహుమతుల రూపంలో చాలా లాభం చేకూరుతుంది.

## సిల్కు దుస్తులు

మీ కలలో సిల్కుదుస్తులు కనబడితే మీరు పెద్దవారితో చెలిమి చేస్తారు. వాటిని ధరించినట్లు కలగంటే మీ ఆర్జన యెక్కువవుతుంది. మీ హోదా పెరుగుతుంది. వాటిని తయారుచేసినట్లు కలగంటే మీకు మిత్రులు ఎక్కువవుతారు. మీరు చేసే ప్రతి పని వాళ్ళ మెప్పును పొందుతుంది.

## నారబట్టలు

నారబట్టలు ధరించినట్లో లేక దుప్పటి కప్పుకున్నట్లో కలగంటే మీకు ఆనంద ఘడియలు దగ్గరపడ్డాయని గుర్తు. నారతో చేసిన గుడ్డ బల్లపైనో, టేబిల్ పైనో వున్నట్లు కలగంటే మీకు నలుగురిలో గౌరవ మర్యాదలు పెరుగుతాయి.

## రబ్బరు గొట్టం

మీ కలలో రబ్బరు గొట్టం కనబడితే మీరు చేయబోయే పనికి సాహసం, చొరవ కావాలని అర్థం. దానితో నీటిని పచ్చికమీద పోస్తు

న్నట్లు కలగంటే మీకు క్రొత్తవారితో స్నేహం ఏర్పడి సంపాదన వృద్ధి అవుతుంది.

కుక్కగొడుగులు

ఇవి కలలో కనబడితే మీ మిత్రులలో ఎవరో మోసగాళ్లున్నారని సూచన. అవి తినేరకం కుక్కగొడుగులైతే మీ స్నేహితుల్లో కొందరు మంచివారే నన్నమాట. కుక్కగొడుగులలో మంచివాటిని ఏరినట్లు కలగంటే ఆనందం కలుగుతుంది. వాటిని ఏరి తింటున్నట్లు కలగంటే మీకు మంచిరోజులు వస్తాయి. పిచ్చి కుక్కగొడుగులు తిన్నట్లు కలగంటే మీరు మోసగించబడవచ్చు.

మెడల్ (పతకం)

మీరు ఏ పోటీలోనో జయించి మెడల్ పొందినట్లు కలగంటే మీకు వృత్తి వ్యాపారాలలో బోలెడు లాభం వస్తుంది.

మైక్

దీన్ని కలలో చూస్తే మీ కడుపులోని రహస్యం బయటపడే సమయం వచ్చినట్లు గుర్తు. మీరు మైక్‌లో మాట్లాడుతున్నట్లు కలగంటే మీ విచారాన్ని మిత్రులకు చెప్పుకొని తేలికపడతారు.

పజిల్

కలలో పజిల్ పూర్తిచేసినట్లు కన్పిస్తే మీకు కావాల్సింది వచ్చి శృంగారం, పేరాశ అని గ్రహించాలి. పజిల్ పూర్తిచేయడానికి తికమకలు పడితే ఏదో రహస్యం మీ హృదయంలో ఉన్నదన్నమాట. ఆ పజిల్ గెల్చినట్లు కలగంటే మీరు క్లిష్టపరిస్థితులను దాటి మంచి స్థితికి వస్తారు.

## ఎక్స్‌రే

కలలో ఎక్స్‌రే ఫోటో తీయించుకున్నట్లు కనబడితే మీ ప్రాణ స్నేహితుని జీవితంలో అనుకోనిదేదో జరుగుతుంది. ఎక్స్‌రేలోని ఎముకలు వగైరాల నీడలు చూడటం కలలో కనబడితే మీరు ఎప్పుడో చేసిన తప్పుడు పనికి ఫలితం ఇప్పుడు అనుభవించవలసి వస్తుంది.

## స్పాట్ లైట్

నాటక ప్రదర్శనలోగాని, డాన్స్‌ప్రోగ్రాంలోకాని సుంద్రంగా స్పాట్‌లైట్ వెలుతురు మీకు కలలో కనబడితే మీరు కళలలో, సంఘంలో కీర్తిప్రతిష్ఠలు పొందగలుగుతారు.

## సూక్ష్మదర్శిని (మైక్రోస్కోప్)

కలలో దీనితో దేనినైనా పరీక్ష చేస్తే మీ ప్రాణస్నేహితుడు అకస్మాత్తుగా మనసు మార్చుకుని మీకు ఆశ్చర్యాన్ని కలుగజేస్తాడు. పొరపాటున మైక్రోస్కోపు జారిపడి బద్దలయినట్లు కలగంటే మీ పనులు ఏవీ ఎవరికీ నచ్చవు.

## సంకెళ్ళు

మీ చేతులకు సంకెళ్ళు పడినట్లు కలగంటే మీరు ప్రేమబందీలవుతారు. తీయని బాధ, ఆనందం కలుతుంది. ఎవరికన్నా సంకెళ్లు పడినట్లు కలగంటే భయం, ఆందోళన కలుగుతాయి.

## లాండ్రీ

దీనిలో మీరు పనిచేస్తున్నట్లు కలగంటే మీ ప్రయాణంలో మీరు మీ మిత్రుని కల్పుకుంటారు. లాండ్రీలో ఎవరో బట్టలు వేస్తున్నట్లు కలగంటే మీ ఆరోగ్యాన్ని మీరే జాగ్రత్తగా చూసుకుంటారు.

విందు

విందు భోజనం చేసినట్టు కల రావటం మంచిది. మీకు అదృష్ట ఘడియలు వస్తున్నాయని భావించాలి. ఎవరైనా విందులో పాల్గొన్నట్టు కలగంటే మీ మనస్సుకు సంతృప్తి కలిగించే సంఘటనలు జరుగుతాయి.

సంతకం

కలలో దేనిమీదో సంతకం చేసినట్టు కలగంటే ఎవరివద్దనైనా ఉద్యోగం చేయవలసి వస్తుంది. తద్వారా భాగ్యవంతులు కావచ్చు.

పురాతన వస్తువు

పురాతన శిల్పాన్నో, విగ్రహాన్నో కలగంటే మీ యింటిలో సుఖశాంతులు ఏర్పడుతాయి. పాతకాలపు పనిముట్లను దేన్ని చూసినా శుభంగానే భావించాలి.

ఉచ్చుత్రాడు

కలలో ఏ వేటకాడైనా పిట్టల్ని పట్టటానికి ఉచ్చుత్రాడు విసిరినట్లు కలగంటే మీకు లాభాలు కల్గుతాయి. శుభవార్తలు వింటారు. ఎవరైనా మీ మీదకు ఉచ్చుత్రాడు విసిరినట్లు కలగంటే మిత్రులతో కలహాలు రావచ్చు.

ప్రకటన (ఎడ్వర్ టైజ్ మెంట్)

స్వప్నంలో ఏదైనా పత్రికలో ప్రకటన చూచినా, చదివినా ఫలితం ఒకటే. ఏపనిచేయాలని మొదలుపెట్టినా మార్గం దొరకక అయోమయ స్థితి ఏర్పడుతుంది.

బహుమతి

మీరు బహుమతి పొందినట్టు కలగంటే వాస్తవంలో కూడ

బహుమతి వస్తుంది. దాన్ని మీరు ఎవరికో యిచ్చినట్లు కలగంటే ఏదైనా కొద్దిపాటి ఆస్తి వచ్చి మీ ఆస్తిలో కలుస్తుంది.

## మంత్రదండం

మంత్రించిన ఎముక కనబడితే మీకు భోగభాగ్యాలు కలుగుతాయి. అదీ, తానంతట అదే ఆడుతున్నట్లు కనబడితే మంచిదికాదని అర్థంచేసుకోవాలి.

## రాక్షసుడు

పర్వతంలాంటి శరీరముతో వున్న రాక్షసుణ్ణి కలగంటే మీ పనులలో దిగ్విజయం కలుగుతుంది. వాడిని చూచి మీరు భయపడినట్లు కలగంటే ధైర్యంగా ఏ పని చేసినా జయమే కలుగుతుంది. వాడు మిమ్మల్ని బాధపెట్టినట్లు కలవచ్చినా ఫలితం ఇదే. అతనితో చెలిమి చేస్తున్నట్లు కలగంటే మంచిరోజులు వస్తాయి. అతిభయంకరమైన రాక్షసుని మీరు కలలో చూస్తే మీ స్నేహితుల్లో కొందర్ని అతిగా నమ్మటం మానుకోవాలి.

## ముత్యపుచిప్ప

ముత్యపుచిప్ప కలలో కనబడితే మీరు మోసగాళ్ళ బారి నుండి బయటపడాలని భావించాలి. దాన్ని తెంచినట్లు కలగన్నా అదే ఫలితం. ముత్యపుచిప్పలోని పురుగును తిన్నట్లు కలగంటే ప్రతిపనికి, చేయటానికి ముందు సంకోచిస్తారు, అది నష్టానికి దారితీస్తుంది.

## పిరమిడ్

కలలో ఇది కనబడితే మీరు భాగ్యవంతులు అవుతారు. అది కొద్ది రోజుల్లో కావచ్చు, కొన్ని సంవత్సరాలలో కావచ్చు. దానికోసం మీరు శ్రమించాల్సి వస్తుంది. కలహాలు రావచ్చు. కాని ఎన్నో అనుభవాలు కలుగుతాయి.

పచ్చబొట్టు

శరీరం మీద పచ్చబొట్టు వేసుకున్నట్లు కలగంటే మీకు విదేశ ప్రయాణం తప్పదు. ఎవరన్నా పచ్చబొట్టు పొడిపించుకున్నట్లు కలగంటే తిరిగి మరొకరికి చెప్పలేని రహస్యాలు మీకు మాత్రమే తెలుస్తాయి.

ముడి

కలలో మీరు ముడిని వేస్తున్నట్లు కలగంటే ఎవర్నో మీరు అటకాయిస్తారు. దాన్ని విప్పినట్లు కలగంటే మీ ఆశలు ఫలిస్తాయి.

లౌడ్ స్పీకరు

దీన్ని కలలో చూస్తే ఏవో శుభవార్తలు మీకు అందుతాయి. దీని ద్వారా మంచి సంగీతం వింటున్నట్లు కలగంటే ఏ సందులోనో, ఏ చిన్నదానితోనో చీకట్లో చిలిపిపనులు చేస్తారు. తద్వారా మీకు సుఖం లభిస్తుంది. కలలో మీరు విన్న సంగీతం కర్ణకఠోరంగా వుంటే విసుగుపుట్టించే సమస్యలతో తలమునక లవుతారు.

గాలిమిల్లు (విండ్ మిల్)

ఇది కలలో కనిపించటం మంచిది కాదు. సారంలేని జీవితంతో నీరసపడిపోతారు.

ఫ్యాక్టరీ

ఫ్యాక్టరీలో పనిచేస్తున్నట్లు కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో మీకు తృప్తి లభించదని తెలుసుకోండి. అందులో వున్నట్లు కలగంటే మీ ధనం దుబారా కాకుండా జాగ్రత్త పడాలి. జనంతో నిండి కిటకిటలాడుతున్న ఫ్యాక్టరీలో మీరు వున్నట్లు కలగంటే వృత్తివ్యాపారాలలో ఎంతో అభివృద్ధి కలుగుతుంది.

రిఫ్రిజిరేటరు

ఈ యంత్రాన్ని కలలో చూస్తే కొన్ని అపూర్వ రహస్యాలు మీకు తెలుస్తాయి. దానిలో పండ్లు, ఆహారం వగైరా వున్నట్లు కల గంటే భోగభాగ్యాలు కల్గుతాయి. దానిలోనుంచి ఏదైనా తీస్తున్నట్లు కలగంటే మీ బంధువులో, మిత్రులో వచ్చి చాలాకాలం మీ యింటిలో తిష్ట వేస్తారు. మీ అంతు తేలుసారు.

యంత్రాలు

సాధారణంగా ఏదైనా ఇంజనును మీరు నడుపుతున్నట్లు కల గంటే మీ వృత్తి వ్యాపారాలలో ఉత్సాహం కలుగుతుంది. ఇతరుల చేయూత వుంటుంది. చెడిన యంత్రాన్ని కాని, పనిచేయని యంత్రాన్ని కాని కలలో చూస్తే మీ జీవితాని కేదైనా యిబ్బంది కలుగవచ్చు. యంత్రాన్ని బాగుచేసినట్లు కలగంటే మీరు కష్టాల్ని అధిగమించి ప్రశాంత జీవితం సాగిస్తారు. దాన్ని బాగుచేయలేకపోతే ఆ అడ్డంకుల్ని అధిగమించలేరు. పోస్టు బిళ్ళలను కవర్లమీద ముద్రించే యంత్రాన్ని (ఫ్రాంకింగ్ మిషన్) కలలో చూస్తే మీ పనులు వగైరాలు కొంత వరకే జరుగుతాయి. మరమనిషి సరుకులు, పదార్థాలు అందిస్తున్నట్లు కలగంటే మీకు అదృష్టం కలుగుతుంది. మీ ఆవరణలో వున్న మోటారు ఇంజనును వాడుతున్నట్లు కలగంటే మీరు ఇతరులతో తగాదాలు పడ్తారు. డబ్బు విషయంలో ముఖ్యంగా గొడవలు వస్తాయి.

ముఖానికి ముసుగు

కలలో ముఖాన్ని ముసుగుతో దాచుకున్నట్లు కనిపిస్తే, మీ మిత్రులలో ఒకడు మిమ్మల్ని మోసం చేయవచ్చు. అందువల్ల మీ రహస్యాలు, మీరు చేసే పనులు ఎవరికీ చెప్పరాదని గుర్తుంచుకోవాలి;

మీరు ముసుగులో వున్నట్లు కలలో కన్పిస్తే మీరు లేనిపోని గొప్పలకు పోతారు. ఎవరైనా పైనుండి క్రిందివరకు ముసుగు ధరించినట్లు కలలో కన్పిస్తే మీకు గడ్డురోజులు వస్తాయి. అదే మీరు ధరించినట్లు కలవస్తే అతిగా ఖర్చు చేస్తారు.

### పంచర్

కారుకో, సైకిలుకో పంచరు అయినట్లు కలవస్తే నిజజీవితం భయాందోళనలు లేకుండా జరిగిపోతుంది. పంచర్‌వేసి బాగుచేసినట్లు కలగంటే గృహకల్లోలాలు సర్దుకుంటాయి.

### పేలాలు

వేడివేడి పేలాలు తిన్నట్లు కలగంటే ఆనందకరమైన జీవితం లభిస్తుంది. మెత్తగా వున్న పేలాలు తిన్నట్లు కలవస్తే అశుభవార్తలు అందవచ్చు.

### పచ్చడి

ఏదైనా పచ్చడి మీ కలలో కన్పిస్తే మీరు రెండు చేతుల సంపాదిస్తారు. మీ శ్రీమతికో, శ్రీవారికో ఉద్యోగం వస్తుంది. దాన్ని తిన్నట్లు కన్పిస్తే మీ బంధువుల్ని పైకి తీసుకొని రావడానికి మీరు పడరాని పాట్లు పడతారు.

### తోలు

ఇదికాని, దీనితో తయారైన వస్తువులుకాని కలలో కన్పిస్తే మీరు ప్రారంభించిన పని ఎంతటి కష్టమైనదైనా అంతిమవిజయం మీదే. తోలు వస్తువును మీరు చేతిలో వుంచుకొన్నట్లు కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో అభివృద్ధి కలుగుతుంది. నలుగురిలో మీ హోదా, అంతస్థు బలపడతాయి.

## చింపిరి గుడ్డలు

వీనితో వ్యాపారం చేసినట్లు కలగంటే మీ సంపాదన పెరుగుతుంది. వాటిని చూచినా, గుట్టగా వేసినా ఇదే ఫలితం. దీనిని ధరించినట్లు కలవస్తే నలుగురిలో మీరు అవమానాల పాలు కావచ్చు. జాగ్రత్త పడాలి. ఎవరో చింపిరిగుడ్డలు ధరించినట్లు మీ కలలో కనబడితే మీకు ఏ వారసుల ఆస్తో, ఎక్కడ నుండో వచ్చి కలుస్తుంది. బాగా మాసిపోయిన గుడ్డపీలికలు కలలో కనబడితే మీ ఆరోగ్యం చెడిపోతుంది.

## భయం

కలలో మీరు భయపడితే మీరు అనుకున్నదానికంటే ఎక్కువ లాభం పొందుతారు. మీరు ఇతరులను భయపెట్టినట్లు కలగంటే మీ వూహాలు తలక్రిందు లవుతాయి. భయంకరమైన చోట చిక్కుకున్నట్లు కలగంటే మీరు చేసే పనులు ప్రజలకు నచ్చవు. చెడ్డపేరు ప్రచారం కావచ్చు.

## నవ్వు

మీరు నవ్వినట్లు కలగంటే మీకు ఎవరితోనో కలహాలు వస్తాయి. ఎవరన్నా నవ్వినట్లు కలగంటే మీరు పదిమందిలో పరిహాసింపబడుతారు. కడుపు చెక్కలయ్యేట్లు నవ్వుతున్న వ్యక్తి మీ కలలో కనబడితే మీరు మంచి ఆరోగ్యవంతు లవుతారు.

## దువ్వెన

ఏ స్త్రీయైనా దువ్వెనతో తల చిక్కుతీసుకొన్నట్లు కలగంటే మీకు సంతోషకాలం వస్తుంది.

## ఏ డు పు

మీరు కలలో ఏడ్చినట్టు కనిపిస్తే నిజజీవితంలో మీకు మహదానందం లభిస్తుంది. పిల్లలు ఏడ్చినట్టు కలలో కనబడితే మీకు ఆశ్చర్యాన్ని కల్గించే వార్తలు వస్తాయి.

## ఈ ల

ఈలను కలలో వింటే ఏదో ప్రమాదం ముంచుకొని వస్తుంది. ఇతరులు ఈలవేసినట్లు మీకు కలలో కనబడితే మీ బంధు మిత్రులలో ఎవరికైనా అపాయం కలుగవచ్చు.

## వే లం పా ట

వేలంపాట పాడే చోటుకు మీరు వెళ్ళినట్లు కలగంటే మీరు రెండుచేతులా సంపాదిస్తారు. వేలంపాట పాడి మీరు ఏదైనా వస్తువు స్వీకరించినట్లు కలగంటే మీకు డబ్బు కూడబెట్టాలన్న సంకల్పం కలుగుతుంది.



# 35. వ్యాధులు - మృత్యువు - వగైరా

## కురుపు

మీ శరీరంలో ఎక్కడైనా కురుపు వున్నట్లు కలగంటే మీ జీవితం నిస్సారంగా వుంటుంది. కురుపు వున్న వానిని కలలో చూస్తే మీ పనులు నిరాటంకంగా చేసుకోగల్గుతారు. ఆ కురుపును గిల్లినట్లు కలగంటే అప్పులతో జగడాలు వస్తాయి. దెబ్బ తగిలిన కురుపు పెద్దదైనట్లు కలగన్న వారికి కష్టకాలము యింకా పోలేదని గుర్తు.

## జ్వరము

కలలో జ్వరం వచ్చినట్లు కన్పిస్తే మీ స్నేహితులలో ఎవరో దూరం అవుతారు. ఎవరికన్నా జ్వరం వచ్చినట్లు కలగంటే, మీ స్నేహితునితో గొడవలు పడవచ్చు.

## ధర్మామీటరు

కలలో ధర్మామీటరును చూస్తే అపరిచిత వ్యక్తితో మీకు అనవసరపు పేచీ వస్తుంది. అతన్ని మీరు వదిలించుకోడవం కష్టం అవుతుంది.

## జబ్బు

అదేం రోగమో తెలీకుండా వున్నట్లు కలగంటే మీ గృహ జీవితం కల్లోలంగా వుంటుంది. ఎవరికైనా జబ్బుచేసినట్లు కలగంటే గొడవలవల్ల మీకు శాంతి లభించదు.

## చావు

కలలో దగ్గర బంధువులో, మిత్రులో చనిపోవటం కన్పిస్తే మీకు బాధలు కల్గుతాయి. పసిపిల్లల చావు కలగంటే మీ కోర్కెలు ఫలించవు. చనిపోయాక తీసిన ఫోటోలు, లేక చనిపోయినట్లున్న చిత్రాలు కలలో చూస్తే మీ కష్టాలు తీరిపోతాయి.

## శవపేటిక

కలలో ఖాళీ శవపేటిక కన్పిస్తే మీ భావి జీవితాన్ని గురించి ఆరాటం కలుగుతుంది. శవం వున్న పెట్టెను కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో కష్టాలు ఎదురవుతాయి. కుటుంబంలో కలహాలు వస్తాయి. ఆ పెట్టెలోని శవం మీరే అయినట్లు కన్పిస్తే వృత్తి వ్యాపారాలలో అంతులేని లాభాలు, ఆదాయాలు, కుటుంబంలో శాంతి లభిస్తాయి. శవాన్ని పాతిపెట్టే చోటు కన్పిస్తే మీరు అన్ని విషయాల్లో జాగ్రత్తపడాల్సి వస్తుంది.

## శ్మశానం

కలలో శ్మశానాన్ని చూస్తే మంచి కలుగుతుంది. అందులో మీరు వున్నట్లు చూస్తే మీ ఆప్తులు ఎవరన్నా చనిపోవచ్చు. శ్మశానంలోకి పూలతో వెళ్ళితే ప్రేమించిన వారితో కలయిక లభిస్తుంది. చిన్న పిల్లలు శ్మశానంలో పూలతో ఆడుకొంటున్నట్లు కలగంటే మీకు వుజ్జ్వల భవిష్యత్తు వుంటుంది.

## మూర్ఛ

మీరు మూర్ఛపోయినట్లు కలవస్తే మీరు జాగ్రత్తగా ప్రవర్తిం

చకపోతే కష్టాలు వస్తాయని గ్రహించాలి. ఎవరైనా యువతి మూర్ఛ పోయినట్టు కలగంటే మీరు దగాకోరు స్త్రీ చేతిలో చిక్కుకుంటారు.

## సమాధి

కలలో తల్లి సమాధిమీద పుష్పాలు వుంచినట్టు కన్పిస్తే మీరు బాధలను ఓర్పుగా సహించవలసి వుంటుంది. తాజ్ మహల్ లాంటి అందాల సమాధిని చూస్తే మీ పాత మిత్రుడు చాలాకాలం తరువాత మిమ్మల్ని చూడడానికి వస్తున్నాడని గుర్తు. సమాధి మీద మీ పేరు కలలో కన్పిస్తే మీరు మీ ఆరోగ్యాన్ని కాపాడుకోవాల్సిన అవసరం వుంటుంది. సమాధి కూలిపోయినట్లు కలవస్తే కుటుంబం సభ్యులలో ఎవరికైనా సుస్తిచేయవచ్చు.

## మొటిమ

మొహంపై అక్కడక్కడ మొటిమలు వున్నట్లు కలవస్తే మీలోని లోటుపాట్లు మీకు తెలుస్తాయి. మరొకరి మొహంపై మొటిమ వున్నట్లు కలవస్తే మీ బంధుమిత్రుల కుట్రలు మీకు తెలుస్తాయి. అందమైన అమ్మాయి మొహంపై వున్న ఒకే ఒక మొటిమ అందంగా మీ కలలోకి వస్తే తీయని ప్రేమలో పడతారు.

## ఉలిపిరికాయ

మీ కలలో ఉలిపిరి కాయలు మొటిమలవలెనే కన్పిస్తే మొటిమల ఫలితాలనే అన్వయించుకోవాలి.

## కషాయం

కషాయాన్ని త్రాగినట్లు కలవస్తే మీ సంపాదన పెరుగుతుంది. మీరు ఇతరులకు కషాయాన్ని త్రాగటానికి యిచ్చినట్లు కలగంటే ఇతరులు మీకు సహాయం చేస్తారు.

## గూనివాడు

కలలో గూనివానిని చూస్తే మీ ఆదాయం పెరుగుతుంది. అతనితో ముచ్చట్లు పెట్టుకొన్నట్లు కలగంటే లాటరీ, రేసు, జూదాలలో అధిక లాభాలు వస్తాయి. మీకు గూనివచ్చినట్లు కలవస్తే మీ ఆరోగ్యమూ కుదుటబడుతుంది.

## గ్రుడ్డివాడు

మీరు గ్రుడ్డివారైనట్లు కలగంటే మీరు మూర్ఖంగా ప్రవర్తించి ప్రమాదాలు కొనితెచ్చుకొంటారు. అతడు కలలో కన్పించినా, అతనికి దారి చూపినట్లు కల వచ్చినా అనుకోని విధంగా మీరు కార్యసాధన గావించి లాభం పొందుతారు.

## చెవిటివాడు

మీకు చెముడు వున్నట్లు కలలో కన్పిస్తే మీ చిక్కులు తీరుతాయి. చెవిటివారితో మాట్లాడినట్లు కలగంటే మీ గొంతెమ్మ కోర్కెలు నెరవేరకపోయినా చిన్నచిన్న ఆశలు ఫలిస్తాయి.

## నత్తివాడు

స్వప్నంలో నత్తివాడు కన్పించినా, అతడితో మాట్లాడినట్లు కలగన్నా, మీ బంధువులవల్ల మీకు కష్టాలు వస్తాయి. మీరు నత్తి

వానిగా మారినట్లు కలవస్తే, సభలు, సమావేశాల్లో మీరు గౌరవింప బడతారు.

## వికలాంగుడు

అంగవైకల్యం కలవారు మీకు కలలో కన్పిస్తే మీవల్ల యితరులకు సహాయం లభిస్తుంది. మీకు అంగవైకల్యం కలిగినట్లు కలవచ్చినా ఇదే ఫలితం.

